# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 8　　శ్రావణ - భాద్రపద 1886 శకం

సంచిక : 10　　ఆగస్టు, 1964

## విషయ సూచిక



ముఖచిత్రం : నాగార్జున సాగర్‌లోని కాందిశీకుల శిబిరంలో...

సంవత్సరం చందా – రు. 3–00
విడి ప్రతి రు. 0–25 నయాపైసలు

# శ్రద్ధాంజలి

వడ్డాది సీతారామాంజనేయ కవి

ఇది కవిసార్వభౌము కల
మేకద! మా జవహర్ ప్రధాని, కో
విదమణి యస్తమించె నను
భీషణ వార్త నెఱింగినంతనే
చెదరిన దేమొ గుండియ, ర
చింపఁగ నోపదు పద్యమొక్కటిన్
సదమలమౌ తదాత్మకుఁ బ్ర
శాంతి ఘటిల్లఁ, బ్రశంస చేయుచున్.

క్రోధీ! మాజవహారుపైఁ
గ్రోధము నీ కేల యింత? క్షోణికి నెల్లన్
బాధ నిడితి; వెంతటి యప
రాధివిర! యజాత శత్రుగ్రసియింతవురా?

భౌతిక మైన దేహమును
బాసితి వంతియె కాని యాత్మ రూ
పాతిశయమ్ముతో జగము
నంతట నిండి వెలుంగుచుండవే?
భూతల మెల్ల నీ మృతికిఁ
బొంగులు వాఱెడు శోకబాష్పధా
రాతతి తర్పణం బిడ స
రాగముతో; జవహర్ సహోదరా!

మానవ సేవకే హృది స
మర్పణమో జవహర్ మహాశయా!
మానితరీతిఁ జేసితివి,
మా భరతోర్వి స్వతంత్ర రాజ్యమై
యీ నిఖిల ప్రపంచమున
నేపగు రాజ్యములన్ బ్రధానతన్
బూని, సమస్త రాజ్యముల
పొత్తు గడించి, మహత్త్వ మొందెడిన్.

శేఖరతన్ గడించి వికఁ
శించిన మా జవహర్ ప్రధాని, వి
ద్యాఖనినిన్ హరించితివె
హా! యపకీర్తికిఁ బాలుకావె వై
శాఖమ! నీ వసంత శుభ
సంపద యేది యిఁకన్? జగన్మరు
చ్ఛాఖిని దవ్వు చేసితె ప్ర
జాతతి? కెంతటి ఘోరమక్కటా!

అవిరళదీక్షఁ బూని, భర
తావని యందుఁ బ్రజా ప్రభుత్వమున్
ధ్రువముగ నిల్పి, గాంధి పద
తోయజయుగ్మముఁ గొల్చుచుండి, యా
హావభయ మెల్లఁ బాపి, జను
లందఱ ధీరులఁ జేసినట్టి మా
జవహరులాలు పండితుని
స్వాంతము శాంతిని బొందుఁ గావుతన్! ★

# పదిహేడేండ్ల ప్రగతి

స్వాతంత్ర్యానంతరం 17వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ అన్ని అభివృద్ధి రంగాలలోనూ ప్రశంసార్హమైన ప్రగతిని సాధించింది. ఆంధ్రప్రదేశ్ వంటి వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రంయొక్క అభివృద్ధి కృషిలో వ్యవసాయం అవశ్యం ప్రముఖస్థానం వహిస్తుంది. 1963–64వ సంవత్సరంలో అదనంగా 5.12 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, 0.80 లక్ష టన్నుల నూనెగింజలు, 0.24లక్ష టన్నుల చెరకు (బెల్లం), 0.15 లక్ష బేళ్ళ ప్రత్తి ఉత్పత్తిని లక్షించారు. 1964–65 వ సంవత్సరానికి 6.63 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు, 0 08 లక్షటన్నుల నూనెగింజలు, 0.24 లక్ష టన్నుల చెరకు, 0.18లక్ష బేళ్ళ ప్రతి ఉత్పత్తి లక్ష్యాలను ప్రతిపాదించారు.

ఆహారోత్పత్తిని పెంపొందించడానికి అత్యవసరమైన వాటిలో రైతులకు శీఘ్రంగా రసాయనిక ఎరువులు సరఫరా చేయడం ఒకటనే విషయం అందరికీ తెలిసిందే. 800 ప్రభుత్వడిపోలు, 2,200 సహకార డిపోలద్వారా వ్యవసాయదారులకు ఎరువులు పంపిణీ చేస్తున్నారు. 1963–64 వ సం. లో 1,58,500 టన్నుల అమోనియం సల్ఫేటు, 73,000 టన్నుల యూరియా, 68,000 టన్నుల అమోనియం సల్ఫేటు నైట్రేటు, 67,500 టన్నుల కాల్షియం నైట్రేటును పంపిణీ చేయడానికి ప్రతిపాదించారు. కేంద్ర ప్రభుత్వం 3,24,900 టన్నుల అమోనియం సల్ఫేటును మన రాష్ట్రానికి కేటాయించింది.

## అధిక ఎరువులు

సాంద్ర వ్యవసాయ కార్యక్రమం అమలు పరచబడుతున్న పశ్చిమ గోదావరిజిల్లాకు ప్రత్యేకంగా 25,500 టన్నుల అమోనియం సల్ఫేటును కేటాయించడం జరిగింది. దీనితో కలుపుకొని ఆంధ్రప్రదేశ్‌కు కేటాయించిన నత్రజని ఎరువుల కోటా 3,50,400టన్నులు అయింది. పంపిణీ చేయ నుద్దేశించిన ఎరువుల కోటాలో ఇది 73.8 శాతం. రాష్ట్రానికి అవసరమైన ఎరువులలో ఎక్కువ భాగాన్ని ప్రస్తుతం దిగుమతుల ద్వారా సేకరించడం జరుగుతున్నది. కొత్తగూడెం, విశాఖపట్నంలో స్థాపించదలచిన ఎరువులకర్మాగారాలు పూర్తయినప్పుడు రాష్ట్రంలో ఎరువుల అవసరాలను తగినంతగా తీర్చుకోవడానికి సాధ్యపడుతుంది.

**వెలుగు బాటలు**

వ్యవసాయోత్పత్తిని పెంపొందించే ఉద్దేశంతో ప్రారంభించిన తీవ్రతర జిల్లా వ్యవసాయ కార్యక్రమం, లేదా సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని పొగాకు, వేరుశనగ, పండ్లు, కూరగాయలు, కొబ్బరి పంటలకు కూడా పశ్చిమ గోదావరి జిల్లాలోని ఇరవై జిల్లాలలోనూ 1963 ఖరీఫ్ పంట కాలంనుంచి విస్తరింపజేశారు. ఫలితాలు ప్రోత్సాహకరంగా వున్నాయి. 1963-64 వ సం. లో ఎకరానికి సగటున 2,296 పౌనుల వరి పండింది. సాంద్ర వ్యవసాయ కార్యక్రమం అమలుకు పూర్వం మూడు సంవత్సరాల సగటు వరి రాబడి ఎకరానికి 1769 పౌనులు వుంది. ఈ కార్యక్రమం ద్వారా గణించిన అనుభవాన్ని పురస్కరించుకొని తూర్పు-గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, నిజామాబాదు, వరంగల్, కరీంనగర్, మహబూబ్‌నగర్ జిల్లాలలో 1963ఖరీఫ్‌కాలంనుంచి సవరించిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఈ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్‌లో సవరించిన సాంద్ర వ్యవసాయ పథకం 150 బ్లాకులలో-40 శాతం విస్తీర్ణంలో-అమలులో వుంది. 1964-65 వ సంవత్సరంలో ఈ బ్లాకులన్నింటిలోనూ 70 శాతం విస్తీర్ణంలో ఈ పథకాన్ని అమలు పరచడానికి ప్రతిపాదించారు.

## అధికాహారోత్పత్తి

రాష్ట్ర ఆర్థిక పరిస్థితి సంతృప్తికరంగానే వుంది. 1964-65 వ సంవత్సరంలో రాష్ట్ర ఆదాయపు అంచనా రూ. 136 00 కోట్లు కాగా ఖర్చు అంచనా రూ. 135.85 కోట్లు. బడ్జెట్లో రూ. 15.00 లక్షల నామమాత్రపు మిగులు చూపబడింది. వర్తమాన సంవత్సరపు సవరించిన అంచనాలకంటే రూ. 695.35 లక్షల మేరకు ఎక్కువ ఆదాయం లభించవచ్చని ఆశించబడుతున్నది. అధిక ఆదాయం ప్రధానంగా రాష్ట్ర ఎక్సైజు డ్యూటీలు (రూ. 97.47 లక్షలు), అమ్మకంపన్ను (రూ. 120.00 లక్షలు), స్టాంపులు (రూ 26.32 లక్షలు). యూనియన్ ఎక్సైజు డ్యూటీలలో రాష్ట్ర వాటా (రూ. 38.47 లక్షలు) కేంద్ర ప్రభుత్వం ఇచ్చే సహాయక గ్రాంట్లు (రూ 428.83 లక్షలు) వల్ల లభించవచ్చని ఆశించబడుతున్నది.

1963–64 వ సంవత్సరంలో ప్రవేశపెట్టిన నూత్న పన్నుల మూలంగా రాష్ట్ర ఎక్సైజు సుంకాలు, అమ్మకంపన్నుల ద్వారా లభించే ఆదాయం పెరుగుతుంది. 1964–65 వ సంవత్సరపు బడ్జెట్టు విశేషాల్లోని ముఖ్యాంశాల్లో సాంఘిక భద్రతా పథకాలకు ఎక్కువగా డబ్బు కేటాయించడం, కరువు భత్యాన్ని తాత్కాలికంగా కొంత హెచ్చించడం ద్వారా తక్కువ జీతం పొందే ప్రభుత్వోద్యోగులకు సహాయం కల్పించడం పేర్కొనదగినవి. కరువు భత్యం హెచ్చింపువల్ల ఏటా రూ. 1 84 కోట్లు ఖర్చవుతుంది.

1963–64 వ సం. లో నీటి పారుదల పథకాలకు తొలుత రూ. 395.19 లక్షలు కేటాయించారు. తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ, పోచంపాడు ప్రాజెక్టు మొదలైన ముఖ్యమైన పథకాల దృష్ట్యా పురోగతి తీవ్రతను పెంపొందించే నిమిత్తం అదనంగా రూ. 148 లక్షలు మంజూరు చేశారు. తత్ఫలితంగా ప్రణాలిక వార్షిక పెట్టుబడి రూ. 542.72 లక్షలకు పెరిగింది. 1963–64 వ ఆర్థిక సంవత్సరం ముగిసేలోగా రూ. 511.71 లక్షలు పూర్తిగా ఖర్చుపెట్టబడగలవని ఆశిస్తున్నారు. 1964–65 వ సంవత్సరానికై తొలుత రూ. 518 లక్షలు ఖర్చయ్యే పథకాన్ని ప్రతిపాదించారు. కాని దరిమిలా వ్యయాన్ని రూ. 456.50 లక్షలకు తగ్గించారు.

దిగువ పేర్కొన్న ప్రధాన పథకాల పన్నులు వివిధ దశలలో కొనసాగుతున్నాయి :– (1) నాగార్జునసాగర్ ప్రాజెక్టు, (2) తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ, (3) పోచంపాడు ప్రాజెక్టు, (4) వంశధార ప్రాజెక్టు, (5) రాజోలిబండ మళ్లింపు పథకం, (6) కడం ప్రాజెక్టు, నాగార్జునసాగర్ ప్రాజెక్టు పనులు నిలకడగా పురోగతి జెందుతున్నాయి. ఇప్పటి వరకు దాదాపు 62 శాతం ఆనకట్ట నిర్మాణం, 39 శాతం ప్రధాన కాలువల త్రవ్వకం పూర్తయింది. ఎడమ కాలువకు సంబంధించిన చిలకుర్తి సొరంగం త్రవ్వకం లైనింగ్ పనులు ముగిశాయి. ఎడమ వైపున హల్యాపై ప్రధాన అక్విడక్టు నిర్మాణం దాదాపు పూర్తయింది. శాఖలు పంపిణీ కాలువల త్రవ్వకం క్రాస్ డ్రైనేజి పనులు నిర్ణీత కార్యక్రమం ప్రకారం కొనసాగుతున్నాయి. సవరించిన అంచనాల ప్రకారం ఈ ప్రాజెక్టుకు రూ. 139.53 కోట్ల వ్యయమవుతుంది. 1964 జనవరి నెలాఖరు నాటికి రూ. 9.28 కోట్లు ఖర్చు జరిగింది

## పోచంపాడు ప్రాజెక్టు

పోచంపాడు (స్టోరేజి) ప్రాజెక్టు (సవరించిన) నివేదికను 1963 ఏప్రిల్‌లో కేంద్ర జలవిద్యుత్ సంఘానికీ, ప్లానింగ్ కమిషనుకూ పంపడం జరిగింది. సుమారు రూ. 39.85 కోట్లు ఖర్చయ్యే ఈ ప్రాజెక్టు నిజామాబాదు, కరీంనగర్ జిల్లాలలో దాదాపు 5.70 లక్షల ఎకరాలకు నీటిపారుదల చేయగలుగుతుంది. 1963–64 వ సంవత్సరంలో ఈ ప్రాజెక్టుకు తొలుత రూ. 15 లక్షలు కేటాయించారు. తరువాత రూ. 100 లక్షలకు పెంచారు. 1964–65 వ సంవత్సరానికి రు. 100 లక్షలు కేటాయించారు. 1963 జూలై 26 వ తేదీన నెహూర్ ఈ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేశారు.

1964–65 వ సంవత్సరపు ప్రణాళికలో భారీ ప్రాజెక్టులతో పాటుగా దిగువ పేర్కొన్న మధ్యతరహా పథకాలుకూడా వున్నాయి :– (1) శాలివాగు ప్రాజెక్టు, (2) జూట్‌పల్లి ప్రాజెక్టు, (3) రామడుగు ప్రాజెక్టు (4) స్వర్ణ ప్రాజెక్టు, (5) లక్నాపూర్ ప్రాజెక్టు, (6) మూసీ ప్రాజెక్టు, (7) కర్నూలు–కడప కాలువ, (8) పైడిగం ప్రాజెక్టు (9) నారాయణపురం ఆనకట్ట, (10) పాలేరు–బిట్రగుంట సరఫరా కాలువ, (11) జుర్రేరు రిజర్వాయరు, (12) తొర్రిగడ్డ పంపింగ్ పథకం. (13) కనుపూరు కాలువ పథకం. ఈ పథకాలు కొన్ని పూర్తయ్యాయి. కొన్ని పూర్తి కావచ్చాయి.

దిగువ పేర్కొన్న మధ్యతరహా పథకాలకు ప్రణాళికాసంఘం ఆమోదం తెలిపింది ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది. 1964–65 వ సంవత్సరంలో వీటిని చేపడతారు. (1) వట్టిగడ్డ ప్రాజెక్టు. (2) వరాహ రిజర్వాయరు, (3) నల్లవాగు ప్రాజెక్టు, (4) కోటిపల్లి వాగు ప్రాజెక్టు, (5) లక్నాసాగర్ ప్రాజెక్టు. వరద నిరోధక కార్యక్రమం క్రింద 1964–65 వ సంవత్సరంలో గోదావరి వరదగట్లు ఎత్తు పెంచడానికి, పటిష్ఠం చేయడానికీ, వరాహ, వంశధార, శారద వరదగట్లను మరమ్మతు చేయడానికీ ఎర్రకాలువ, తమ్మిలేరులకు అడ్డంగా రిజర్వాయర్లు నిర్మించడానికీ, ఉప్పుటేరు నదిని విశాలం చేయడానికీ ప్రతిపాదించారు.

## విద్యుచ్ఛక్తి పథకాలు

నాగార్జునసాగర్ జలవిద్యుత్ కేంద్రంతో కలిపి శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టును చేపట్టడానికి తలపెట్టారు. తృతీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రారంభించడానికి ప్రతిపాదించిన నూత్న విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు ఇది. దీనికి రూ 47.50 కోట్లు ఖర్చవుతుంది. ఈ ప్రాజెక్టు క్రింద, దిగువ కృష్ణా బేసిన్‌లో 430 మె. వా. ల మేరకు విద్యుచ్ఛక్తి సమీకృత అభివృద్ధిని తలపెట్టారు. శ్రీశైలం, నాగార్జునసాగర్‌లవద్ద ఒక్కొక్కటి చొప్పున రెండు విద్యుత్కేంద్రాలు నెలకొల్పబడతాయి. శ్రీశైలం విద్యుత్కేం

ద్రాన్ని ఒక్కొక్కటి 110 మె. వా. ల శక్తిగల ఏడు యూనిట్లను స్థాపించడానికి అనువుగా రూపొందించారు. అయితే దీనిలో మొదట్లో నాలుగు యూనిట్లను మాత్రమే నెలకొల్పుతారు. ఈ ప్రాజెక్టుకు నెహూౄ 1963 జూలై 24 వ తేదీన పునాది రాయి వేశారు. రూ 12.39 కోట్లు వ్యయమయ్యే కొత్తగూడెం థర్మల్ పథకం (ప్రథమదశ) కొత్తది. కొత్తగూడెంలో స్థాపించదలచిన ఎరువుల ఫ్యాక్టరీకి విద్యుచ్ఛక్తి సరఫరా చేసేందుకై రెండు 60 మె. వా. ల సెట్లను నెలకొల్పడాన్ని ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ప్రాథమిక సివిల్ పనులు ముగిశాయి. బాయిలర్లను నిర్మించడానికీ, నెలకొల్పడానికీ, వినియోగంలోకి తేవడానికి గాను 1963 జూలైలో జపానుకు చెందిన మెసర్స్ మిట్సుయి సంస్థకు ఆర్డరు ఇవ్వడం జరిగింది. టర్బో జనరేటర్ల తయారీ, స్థాపనకై 1964 సెప్టెంబరులో టోక్యోలోని మెసర్స్ హిటాచి లిమిటెడ్ సంస్థకు ఆర్డరు పంపడమైంది. తృతీయ ప్రణాళి కాంతంనాటికి వీటిని నెలకొల్పవలసి వుంది.

హైద్రాబాదులో విద్యుచ్ఛక్తి కొరతను తీర్చేఉద్దేశంతో హైద్రాబాదులోని ఎర్రగడ్డవద్ద రెండు 10 మె. వా. ల గ్యాస్ టర్బో సెట్లను నెలకొల్పారు. మొదటి సెట్టును 1964 జనవరి 26 వ తేదీన, రెండవ సెట్టును గత మార్చినెలలో వినియోగంలోకి తెచ్చారు. ఈ పథకం ఖర్చు అంచనా రూ. 165 లక్షలు.

ఉజ్వల భవిష్యత్తుకు ఇతోధిక సత్వర పారిశ్రామికాభివృద్ధి కీలకం. సవరించిన అంచనాల ప్రకారం తృతీయ ప్రణాళికలో పరిశ్రమలకు రూ. 1672.18 లక్షలు కేటాయించారు. ఈమొత్తంలోనుంచి 1963–64వ సంవత్సరంలో బహుశా రూ. 323.82 లక్షలు వ్యయం చేస్తారు. 1964–65 వ సంవత్సరానికి రూ. 358.01 లక్షలు కేటాయించడం జరిగింది. వివిధ పరిశ్రమలకు ఆర్థిక సహాయం లభింప జేస్తున్న పారిశ్రామికాభివృద్ధి సంస్థ దిగువ పథకాలను చేపట్టింది :– రూ. 1 కోటి ఖర్చయ్యే హెచ్. టి., ఎల్. టి, ఇన్సులేటర్ ప్రాజెక్టు, రూ. 2.5 కోట్లు ఖర్చయ్యే సమీకృతగాజు ప్రాజెక్టు, రూ. 4.5 కోట్లు ఖర్చయ్యే బాల్ బేరింగ్ ప్రాజెక్టు, రూ. 7 కోట్లు ఖర్చయ్యే దుక్క–ఇనుము ప్రాజెక్టు.

ఏటా 2,400 టన్నుల హెచ్. టి, ఎల్ టి ఇన్సులేటర్లను ఉత్పత్తి చేసేందుకు భారతప్రభుత్వం లైసెన్సు మంజూరు చేసింది ఈ పథకానికి ఒక కోటి రూపాయలు ఖర్చు కావచ్చు. ఈ మొత్తంలో రూ. 40 లక్షలను ఋణంగా పొందడం జరుగుతుంది. అనువైన భారతీయ సంస్థ ఒక దానితో కలిసి పబ్లిక్ లిమిటెడ్ కంపెనీని నెలకొల్పడానికి చర్యలు తీసుకుంటున్నారు. ఈ ప్రాజెక్టుకు సాంకేతిక విషయాలలో తోడ్పడడానికి జకోస్లవేకియా వారు సంసిద్ధత తెలిపారు.

వివిధరకాల గాజు వస్తువులను ఉత్పత్తి చేయడానికి అనుమతిస్తూ భారత ప్రభుత్వం లైసెన్సు ఇచ్చింది. సమీకృత గాజు ప్రాజెక్టుకు రూ. 2.50 కోట్లు ఖర్చు కావచ్చునని అంచనా. కాగా దీనిలో వాటాధనం రూ. 1 కోటి. మిగతా మొత్తాన్ని ఋణాల ద్వారా సేకరిస్తారు ఒక పబ్లిక్ లిమిటెడ్ కంపెనీని స్థాపించడానికి ఒప్పందం కుదుర్చుకోవడం జరిగింది. కార్పొరేషను రూ. 50 లక్షలు పెట్టుబడి పెడుతుంది. ఇంతే మొత్తాన్ని ప్రైవేటు వర్గాలనుంచి స్వీకరిస్తారు. ఈ ప్రాజెక్టుకు సాంకేతికంగా తోడ్పాటు నివ్వడానికి హంగరీవారు సంసిద్ధత తెలిపారు. వారితో ఈ విషయంలో ఒప్పందాలు కుదుర్చుకోవడం కూడా పూర్తయింది.

## దుక్క–యినుము కార్మాగారం

ఒక బాల్ బియరింగ్ కర్మాగారాన్ని నెలకొల్పడానికై ఒకజపానుసంస్థతోయీకార్పొరేషను ఒకఒప్పందానికి వచ్చింది ఈ కర్మాగారానికి సుమారు రూ. 4.50 కోట్లు ఖర్చవుతుందని అంచనా. ఇందులో వాటాధనం రూ. 2.7 కోట్లు. ఏటా ఒక లక్షటన్నుల దుక్క యినుమును ఉత్పత్తిచేయడానికి లైసెన్సు మంజూరుకొరకై కూడా యీ సంస్థ దరఖాస్తుచేసింది. కర్మాగారానికి సంబంధించిన నివేదిక నొకదానిని యీ సంస్థ తాలూకూసాంకేతిక సలహాదారులు కార్పొరేషనుకుఅందజేశారు. ఈనివేదికప్రస్తుతంపరిశీలనలోవుంది. ఈకర్మాగారాన్ని నెలకొల్పడానికి రూ. 7 కోట్లు అవుతుందని అంచనా

దీనికితోడు యీ కార్పొరేషను పరిశ్రమలకు యిచ్చే ఆర్థిక సహాయాన్ని యిప్పటికి రూ. 740.5 లక్షలవరకు పెంచింది. ఈ సంస్థ విశేష కృషి జరిపిన మరో రంగం పారిశ్రామికాభివృద్ధి ప్రాంతపథకం. దీనిక్రింద భూమిని సేకరించి, దానికి నీరు, విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలు కల్పించి పారిశ్రామిక వేత్తలు భారీ పరిశ్రమలు స్థాపించడానికి తోడ్పడం జరుగుతుంది.

పారిశ్రామిక యూనిట్లకు మధ్యకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయాన్ని కల్పించే ఉద్దేశ్యంతో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సహాయసంస్థ నెలకొల్పబడింది. 1963 డిశంబరు మాసాంతానికి మొత్తం 21 యూనిట్లకు సుమారుగా రూ. 171.75 లక్షల ఋణాన్ని యిచ్చింది. అంతకుక్రితం సంవత్సరం యిది మొత్తం 32 యూనిట్లకు

రూ. 57.50 లక్షలు మాత్రమే మంజూరు చేసింది

ఒకానొక పద్ధతిప్రకారం రాష్ట్రంలోని ఖనిజసంపదను వెలికితీయడంలో సహాయ పడేందుకై మైనింగ్ కార్పొరేషన్ నెల కొల్పబడింది. రెండు విధాలుగా యీ కార్పొరేషను పనిచేస్తుంది. త్రవ్వకం పనులను మెరుగు పరచడం, వీలయిన చోట్లల్లా ప్రయివేటు రంగం సహాయంతో యీ ఖనిజాలమీద ఆధారపడి లేచే పరిశ్రమలను అభివృద్ధి పరచడం — ఇది చేస్తుంది ముడి యినుము, బేరైట్, నాణ్యమైన సున్నపు రాయి, బాల్ క్లే త్రవ్వకాలు 1963-64 సం. కాలంలోచురుకుగాకొనసాగాయి ఖనిజాధార పరిశ్రమల విషయంలో ఖమ్మంజిల్లా బోన కల్లువద్ద యీ కార్పొరేషను ఆధ్వర్యంలో ఒక సిమ్మెంటు కర్మాగారం వుంది

తృతీయ ప్రణాళికా కాలంలో సుమారు రూ. 220 లక్షలు పారిశ్రామిక వాడల అభివృద్ధికై కేటాయించబడ్డాయి.

విశాఖపట్నం, విజయవాడ, వరంగలు, సనత్‌నగర్‌లలోని పారిశ్రామక వాడల్ని విస్తృతీకరించడంతోపాటు 14 సహాయక ప్రయివేటు పారిశ్రామిక వాడల్ని, 10 సాంప్రదాయక పారిశ్రామిక వాడల్నీ, 5 గ్రామీణ పారిశ్రామిక వాడల్నీ, ఒక సహకార పారిశ్రామిక వాడను నెలకొల్పాలని ఉద్దేశించడం జరిగింది. గ్రామీణ పారిశ్రామిక వాడలోనూ, సహకార పారిశ్రామిక వాడలోనూ మినహా పైన పేర్కొన్న మిగిలిన అన్ని పారిశ్రామిక వాడల్లోనూ పని చురుకుగా కొనసాగుతున్నది.

దక్షిణ సింగరేణి గనుల ప్రసిద్ధ బొగ్గు నిధి ఆంధ్రప్రదేశ్‌కే గర్వకారణమైన నిక్షిప్తం. 1963 సంవత్సరానికి ఉద్దేశింపబడిన వార్షికోత్పత్తి 32 లక్షల టన్నులను యిది అధిగమించింది. తృతీయ ప్రణాళికాంతానికి ఉద్దేశింపబడిన 60 టన్నుల ధ్యేయాన్ని తేలిగ్గా అధిగమించవచ్చునని భావించబడుతున్నది. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల పెట్టుబడులు యీ కంపెనీలో 60.40 శాతంలో వున్నాయి

భారతదేశంలోని యీ మాదిరి అయిదు యూనిట్లలోనూ పెద్దది అయిన సింథటిక్ మందుల కర్మాగారం రష్యా సహకారంతో హైదరాబాదుకు దగ్గర్లో రూపురేఖలు దిద్దుకొంటున్నది. క్షయ నిరోధక మందులు, సల్ఫర్ గ్రూపు మందులు మొదలయిన 850 టన్నుల ఆధునిక మందులను యిది తయారు చేస్తుంది. ఈ కర్మాగారం 1964 సంవత్సరాంతానికి ఉత్పత్తిని ప్రారంభించవచ్చు. తూర్పురాజ్యాలలో మిక్కిలి పెద్దదైన యీ మాదిరి కర్మాగారాల్లో యిది ఒకటి అనడంలో ఎలాటి సందేహమూలేదు.

## భారీ విద్యుత్పరికరాల కర్మాగారం

ఇవికాక విడిగా కేంద్ర ప్రభుత్వం హైదరాబాదుకు దగ్గర్లో రష్యా, భారతీయ నిపుణుల సంయుక్త సలహా సిఫారసుతో ఒక డిఫెన్స్ ఎలక్ట్రానిక్స్ కర్మాగారాన్ని నిర్మించడానికి నిశ్చయించింది. కర్మాగారాన్ని రూపొందించడంలోనూ, యంత్రాలను బిగించడం, పనిచేయించడం మొదలయిన వాటిల్లోనూ రష్యా సహాయం లభిస్తుంది హైదరాబాదుకు దగ్గర్లో సనత్‌నగర్ వద్ద హిందుస్థాన్ మెషిన్ టూల్స్ లిమిటెడ్ వారు తమ అయిదవ యూనిట్టును నెలకొల్పుతున్నారు. ఈ ఏడాదిలోని ప్రాథమిక పనులను యీ కంపెనీ చేపట్టుతుందని భావించ బడుతున్నది

ఈ నాడు రాష్ట్రంలోని మొత్తం గ్రామీణప్రాంత ,మంతా సమాజ వికాస బ్లాకులతో ఆవర్తింప బడి వున్నది. 1963 - 64 లో భద్రాచలం, అడ్డతీగల, వరరామచంద్రాపురం, కొవ్వూరు, వంకిడి బ్లాకులు అయిదూ గిరిజనాభివృద్ధి బ్లాకుల క్రింద మార్చబడ్డాయి. బ్లాకుల పునర్విభజనను గూర్చి, యితర విషయాలతో పాటు, పరిశీలించడానికి 1963 అక్టోబరులో ప్రధానకార్యదర్శి అధ్యక్షుడుగా ఉన్నతాధికార సంఘాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసింది. 1964 మార్చి 2 వ తేదీన యీ సంఘం తమ నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. బ్లాకుల సంఖ్యను 321 కు తగ్గించాలని ప్రభుత్వం నిశ్చయించింది. అయితే అంతకు పూర్వపు 28 గిరిజన బ్లాకుల సంఖ్యలో మాత్రం తగ్గింపు వుండదు

## గ్రామ పంచాయతీల చట్టం

పెరిగిన బాధ్యతల దృష్ట్యా పంచాయతీలను పునర్వ్యవస్థీకరించ వలసిన అవసరం ఎంతాయినా వుంది. ఇందుకు తొలి చర్యగా ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీల బిల్లును 1963 నవంబరు 27 వ తేదీన ఆమోదించడం జరిగింది కన్సీలియేషన్ బోర్డులను ఏర్పాటు చేయడమేగాక సివిల్, క్రిమినలు న్యాయ పరిపాలనకై మూడుకన్న తక్కువ కాని, అయిదుకన్న మించని పంచాయితీలకు కలిపి న్యాయ పంచాయతీలను ఏర్పాటు చేసేందుకు యీ చట్టం వీలు కల్పిస్తున్నది. ఇదే యిందులోని ముఖ్య విషయం. జిల్లాకు ఒక్కొక్కటి చొప్పున మొత్తం 20 జిల్లా పరిషత్తులు కాక ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో 15145 పంచాయతీలు వున్నాయి. ఇటీవల జరిగిన పంచాయతీల ఎన్నికల్లో 7117 పంచాయతీలలో పోటీలేకుండా ఎన్నికలు జరిగాయి. అంటే మొత్తం పంచాయతీల సంఖ్యలో ఇది 47 శాతం వుంది. నిజంగా

యిదొక గొప్ప విశేషమే. 11 పంచాయతీల్లోని సభ్యులంతా ఏకగ్రీవంగా ఎనుకోబడిన స్త్రీలే.

దేశం అన్ని విధాలా అభివృద్ధి చెందాలంటే విద్యాభివృద్ధి అనేది ప్రథమ సోపానం. సాధారణ విద్యక్రింద సవరించబడిన తృతీయ పంచవర్ష ప్రణాళిక కేటాయింపు రూ 1513.25 లక్షలు. దీనిలో 1963_64 కాలానికి రూ 337.22 లక్షలు ఖర్చు కాగలదని అంచనా. స్కాలర్ షిప్పులు మొదలయిన రాయతీ సౌకర్యాలను కల్పించే విషయంలో ప్రజల వెనుకబడిన తనాన్ని కులాలుబట్టిగాక, ఆకుటుంబంయొక్క సంవత్సరాదాయాన్ని బట్టి గుర్తించడం జరుగుతుందని ప్రభుత్వం ప్రకటించింది. ఇందుకు కుటుంబ ఆదాయం ఆయా పరిస్థితుల్ని బట్టి సంవత్సరానికి రూ 1500/ గాని, అంతకు తక్కువగాని వుండాలని కూడా ఒక హద్దు ఏర్పరచింది.

## నిర్బంధ ప్రాథమిక విద్య

6_11 సంవత్సరాల మధ్య పిల్లలకు నిర్బంధ ప్రాథమిక విద్యను బోధించడం అనేది తృతీయ ప్రణాళికా కాలంలో చేపట్టిన ప్రాథమిక విద్యకు సంబంధించిన బృహత్ప్రణాళిక. తృతీయ ప్రణాళిక కాలంలో అదనంగా 16 లక్షల పిల్లలకు ప్రాథమిక విద్యను బోధించాలని ఉద్దేశించబడింది. 1962_63 లో 0.89 లక్షల పిల్లలను, 1963_64 లో 0.50 లక్షల పిల్లలను నమోదు చేయడం జరిగింది. 6_11 సంవత్సరాల మధ్య పిల్లల కొరకు ఉద్దేశించబడిన మధ్యాహ్నభోజన కార్యక్రమం 1963_64 లో 9.52 లక్షలమందిని ఆవర్తించేటట్టు విస్తృతీకరించబడింది. 1963_64 లో ఉన్నత పాఠశాలల్లోని పిల్లల సంఖ్య 10,000 వున్నదని అంచనా వేయబడింది

చైనా దురాక్రమణ కారణంగా ఏర్పడిన ఆత్యయిక పరిస్థితుల దృష్ట్యా దేశంలో సాంకేతిక పనివారలను అధికతరం చేయవలసిన అవసరం కలిగింది. అందుకు వీలుగా 1963_64 సం. లో యీ దిగువ చర్యలు తీసుకోబడ్డాయి. రాష్ట్రంలోని ఇంజనీరింగు కళాశాల లన్నింటిలోనూ 4వ, 5వ సంవత్సరపు తరగతులవారి వేసవి శెలవులను తగ్గించడం ద్వారా త్వరితంగా పూర్తిచేయడం జరిగింది. ఉస్మానియా ఇంజనీరింగు కళాశాల, విశాఖపట్నంలోని ఇంజనీరింగు కళాశాల, కాకినాడలోని ఇంజనీరింగు కళాశాలల్లో సైన్సు పట్టభద్రుల కొరకు మూడేళ్ళ డిగ్రీ కోర్సులు ఏర్పాటు చేయబడ్డాయి. 1964 మే 4 వ తేదీనుండి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ చట్టాన్ని అమలులోకి తీసుకొచ్చి, హైదరాబాదుకు దగ్గర్లో రాజేంద్రనగర్ వద్ద ఒక కొత్త వ్యవసాయ విశ్వవిద్యాలయాన్ని స్థాపించడం జరిగింది. కళాశాల విద్యార్థు లందరూ తప్పనిసరిగా ఎన్ సి. సి. శిక్షణ పొందాలని 1963 లో నిశ్చయింపబడింది.

## ఆరోగ్య పథకం

గ్రామీణులకు వైద్య సహాయాల్ని ఎక్కువగా కలిగించే వుద్దేశంతో ఆంధ్రప్రదేశ్‌లో బ్లాకుకు ఒక్కొక్క ప్రాథమిక ఆరోగ్య కేంద్రంచొప్పున ద్వితీయ ప్రణాళికాంతానికి మొత్తం 193 ఆరోగ్య కేంద్రాలను స్థాపించడం జరిగింది. 1961_64 సం. లో మరో 92 కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. తృతీయ ప్రణాళికలో వచ్చే రెండేళ్ళలోనూ అదనంగా మరొక 44 కేంద్రాలు ప్రారంభించాలనిఉద్దేశించబడింది. వీటి కిచ్చే సహాయక గ్రాంట్లు 1963_64 సం. లో రూ 20,000 లకు పెంచడం జరిగింది. పై కేంద్రాలకు తోడు వివిధ జిల్లాలలో మొత్తం 237 సహాయక గ్రామీణ వైద్యశాలలు కూడా పనిచేస్తున్నాయి.

మలేరియా నిర్మూలనంక్రింద 1963_64 లో ప్రభుత్వం సుమారు రూ 90 లక్షలు వెచ్చించింది. 130 లక్షల జనసంఖ్యను ఆవరిస్తూ 13యూనిట్లద్వారా మందులు చల్లే కార్యక్రమం జరుగుతున్నది. ఈ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టడానికై 1963_64 సం. రానికి రూ 86.15 లక్షలు కేటాయించబడ్డాయి.

దోమలను నిర్మూలించడానికీ బోదకాళ్ళను నివారించడానికీ పురపాలక సంఘాలకు, పంచాయతీలకు వారు ప్రారంభించే పథకాలకు అయ్యే ఖర్చులో మూడోవంతు ధనాన్ని రాష్ట్రప్రభుత్వం గ్రాంటుగా యిస్తున్నది. ఇంతవరకూ 31 పురపాలక సంఘాలు, 24 పంచాయితీలు యీ పథకంద్వారా లాభాన్ని పొందాయి.

1963 మే నుండి మశూచి నిర్మూలన కార్యక్రమం కర్నూలు, అనంతపురం, చిత్తూరు, వరంగల్లు జిల్లాలకు విస్తరింపజేయబడింది. 1964 జనవరి నుండి కడప, విశాఖపట్నం జిల్లాలకు కూడా యీ కార్యక్రమం పొడిగించబడింది. ఇంతవరకూ యీ కార్యక్రమంక్రింద 40 శాతం జనానికి టీకాలు వేయడం జరిగింది. 1964_65 సం. లో కూడా యీ కార్యక్రమాన్ని కొనసాగించడానికి గాను రూ. 25 లక్షలు కేటాయించబడ్డాయి. బి. సి జి. టీకాల పథకం క్రింద 1964 మార్చి మాసాంతం నాటికి రాష్ట్రంలో సుమారు 80.5 లక్షల మందికి టీకాలు వేయడం జరిగింది. పురపాలక ప్రాంతాలలో తీవ్రంగా కృషి చేయడానికి 18 మంది సాంకేతిక పనివారలను ఏర్పాటు

చేస్తూ 18 పురపాలక సంఘాలకు యీ పథకం విస్తరించబడింది

### కుటుంబ నియంత్రణ క్లినిక్కులు

ప్రస్తుత సత్వర ఆర్థికాభివృద్ధి దృష్ట్యా కుటుంబ నియంత్రణావశ్యకత ముందెన్నడూ లేనంతగా అవసరమైంది. ప్రస్తుతం రాష్ట్రంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు అనుబంధించి 237 గ్రామీణ కుటుంబ నియంత్రణ క్లినిక్కులూ, ప్రభుత్వ వైద్యశాలలకు అనుబంధించి 62 పట్టణ కుటుంబ నియంత్రణ క్లినిక్కులూ పనిచేస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలలో వేసెక్టమీ ఆపరేషన్ల సౌకర్యాన్ని కలిగించడానికై విశాఖపట్నం, గుంటూరు, కర్నూలు, హైదరాబాదు, వరంగల్లు ప్రధాన కార్యాలయ స్థానాలుగా అయిదు పర్యటన సర్జికల్ యూనిట్లు ఏర్పాటు చేయబడ్డాయి. యీ కార్యక్రమానికై *1964-65* సంవత్సరానికి రూ 12.44 లక్షలు కేటాయించబడ్డాయి. ప్రసూతి, శిశు ఆరోగ్య సేవలక్రింద యింత వరకూ ప్రభుత్వం ఆధ్వర్యంలో 824, ప్రాంతీయ సంఘాల ఆధ్వర్యంలో 346 ప్రసూతి కేంద్రాలు నెలకొల్ప బడ్డాయి. వెనకబడిన గ్రామ ప్రాంతాలలో అదనంగా మరికొన్ని కొత్త కేంద్రాలను ప్రారంభించడానికి గాను *1964-65* లో అదనంగా రూ 0.75 లక్షలు కేటాయించ బడ్డాయి.

వైద్య విద్య మరింత వేగాన్ని పుంజుకుంది. రెండు ప్రయివేటు వైద్య కళాశాలలుతోసహా రాష్ట్రంలోని మొత్తం వైద్య కళాశాలల్లో ఏటా ప్రవేశం పొందేవారి సంఖ్య మార్చి 1963 నాటికి 850 ఆత్యయిక పరిస్థితి దృష్ట్యా ప్రవేశాల సంఖ్య 190 మరో పెంచడం జరిగింది. అంటే 1963-64 విద్యా సంవత్సరం నుండి ప్రభుత్వ వైద్య కళాశాలలో 120 సీట్లు, ప్రయివేటు వైద్య కళాశాలల్లో 70 సీట్లు పెంచారన్న మాట. ఈ అదనపు పెంపుదలకు భారతప్రభుత్వం ప్రభుత్వ కళాశాలల్లోని మొత్తం 120 సీట్లకూ సీటుకు రూ. 15,000 చొప్పున తిరిగి వసూలు చేయని పద్ధతిలో కేంద్రసహాయాన్ని కల్పిస్తున్నది.

### సహకార సంఘాలు

చతుర్థ పంచవర్ష ప్రణాళికాంతానికి వ్యవసాయదారులకు అవసరమయ్యే ఋణంలో కనీసం యాభై శాతం మేరకు సహాయపడవలసిన అవసరం దృష్ట్యా ద్వితీయ ప్రణాళికాంతానికి వున్న ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల సభ్యుల సంఖ్యను 15.89 లక్షల నుండి తృతీయ ప్రణాళికాంతానికి 40 లక్షలకు పెంచాలని తృతీయ ప్రణాళికలో సహకార సంఘాలు తలపెట్టాయి. 1960-61 లో సహకార సంఘాలు స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలక్రింద ఏటా యిస్తూ వుండే రూ 16.50 కోట్లను తృతీయ ప్రణాళిక ఆఖరి సంవత్సరంలో రూ 45 కోట్లకు పెంచాలనికూడా తలపెట్టడం జరిగింది. స్వల్పకాలిక, మధ్యకాలిక వ్యవసాయ ఋణాలక్రింద రాష్ట్రానికి రూ 200 కోట్లు అవసరమని అంచనా. 47 శాతం గ్రామీణ కుటుంబాలను ఆవర్తిస్తూ, 100 శాతం గ్రామాలను ఆవరించి 24 లక్షల సభ్యులు గల 16,000 సంఘాలు 1963-64 నాటికి మొత్తం రాష్ట్రంలో వుండాలని ధ్యేయం ఇంతవరకూ స్వల్పకాలిక, మధ్యకాలిక ఋణాలకింద అందజేసినది రూ 22 కోట్లు. అసలు ధ్యేయం రు 25 కోట్లు. ఈ సంఘాల వాటా ధనం, డిపాజిట్లు వరుసగా రూ 460 లక్షలు రూ 101 లక్షలు.

అపెక్సు బ్యాంకులు, సహకార సెంట్రల్ బ్యాంకుల మొత్తం నిర్వహణ పెట్టుబడులు 30-6-1963 నాటికి వరుసగా రూ 26 కోట్లు, రూ 34 కోట్లు మించివున్నాయి. 1963-64 సంవత్సరాంతానికి మొత్తం డిపాజిట్లను రూ 12కోట్లకు పెంచాలని ఉద్దేశించబడింది. అపెక్స్, సహకార కేంద్ర బ్యాంకుల వాటాధనం క్రింద ప్రభుత్వం 1963 మార్చి మాసాంతంనాటికి రూ 2.42 కోట్లు పెట్టుబడి పెట్టింది. 1963-64 సంకాలంలో రూ 65 లక్షలు పెట్టుబడిగా యివ్వాలని ప్రభుత్వం వుద్దేశించింది.

సవరించబడిన సాంద్ర వ్యవసాయ కార్యక్రమం తొలి సంవత్సరంలో - అంటే 1963-64 లో 40 శాతమూ; మలి సంవత్సరంలో 70 శాతమూ; మూడో సంవత్సరంలో 100 శాతమూ ఆవర్తించాలి. ఈ పథకం క్రింద సహకార సంఘాల ముఖ్యమైన పనులు సమృద్ధిగా, సమయానికి ఋణాలను యివ్వడం. ఈ పథకంక్రింద వ్యవసాయదారులకు అవసరమయ్యే ఋణం రు 25 కోట్లు అని అంచనా. తొలి సంవత్సరంలో సహకార సంఘాలు రూ 10 కోట్లు, ద్వితీయ సంవత్సరం రూ 17.50 కోట్లు, తృతీయ సంవత్సరం సుమారు రూ 25 కోట్లు అందజేయాలి. మొదటి సంవత్సరం అవసరమయ్యే రూ 10 కోట్లకు రూ 6.75 కోట్లను మామూలు ఋణవిధానంలో సహకార సంఘాలు అందజేయాలని ఉద్దేశించబడింది. అదనంగా రూ 3.25 కోట్లకు వేరే ఏర్పాట్లు చేయబడ్డాయి.

1963-64 రబ్బీకాలంలో యీ పథకం క్రింద వ్యవసాయదారులఅవసరాలుసుమారు 1 కోటి వరకు ఉండవచ్చునని అంచనా వేయడం జరిగింది. 1963-64రబ్బీకాలానికి నిర్ణయింపబడిన విధంగా ప్రతి పంటకు రిజర్వుబ్యాంకు అదనంగాబ్యాంకులకు ఋణ సౌకర్యాన్ని కలిగించడానికి అంగీకరించింది.

మిగతా 73 వ పేజీలో

# కీలుబొమ్మలాటలు - ఛాయా ప్రదర్శనలు

కూర్మా వేణుగోపాలస్వామి

భారత దేశంలో సజీవంగావున్న ప్రాచీన కళాస్వరూపం బొమ్మలాట. ఈ కళా ప్రక్రియ ఎంతో పురాతన కాలంనాటిదనీ, ఇది ప్రాచ్య ఖండంలో ఉద్భవించిందనే విషయాలు సర్వజనామోదితాలు. చైనాలో హనుల కాలంలోనే ఛాయా ప్రదర్శనలు ప్రచారంలో వున్నట్లుగా చెప్తుంటారు. అలాగే జపాను పురాతన సాహిత్యంలో కీలుబొమ్మల విషయమై ప్రస్తావించబడినది. అయినప్పటికీ క్రీ. పూ. 3 వ శతాబ్దిలోనే ఆంధ్రలో 'తోలుబొమ్మలాట'లు ప్రచారంలో వున్నట్లు నిరూపించడానికి తగిన ఆధారాలు వున్నాయి. అద్వితీయమైన ఈ కళా ప్రక్రియ శాతవాహనులు, పల్లవులు, చాళుక్యులు, కాకతీయుల కాలంలో రాజాదరణ పొంది వర్ధిల్లింది. విజయనగర సామ్రాట్టుల ఏలుబడిలోనూ, తంజావూరు పాలకుల హయాములోనూ యీకళ అత్యంత ఉన్నత స్థితి నందుకున్నది.

భారతీయులు సముద్రయానం చేసి దూర తీర ప్రాంతాలకు తరలి వెళ్ళడంతో కళింగపట్నం, భీమునిపట్నం, కోరంగి, మచిలీపట్నం, వాడరేవు, కొత్తపట్నం మొదలైన పురాతన రేవుపట్టణాల ద్వారా వర్తక వాణిజ్యాలు ముమ్మరంగా సాగడంతో బొమ్మలాట ఆగ్నేయాసియాకు ప్రాకింది. అక్కడ ఈ ప్రక్రియ బాగా అభివృద్ధిజెంది విరివిగా ప్రచారంలోకి వచ్చింది. ఛాయా ప్రదర్శన పర్షియా, టర్కీలద్వారా పశ్చిమాభిముఖంగా గ్రీకు వరకు ప్రాకిపోయింది. ఉత్తర ఆఫ్రికాలోని ముస్లిం దేశాలకుకూడా ఇది వ్యాపించింది. ఇటలీలో 17 వ శతాబ్దిలోనూ, విప్లవానికి పూర్వం ఫ్రాన్సులోనూ ఇది ప్రచారంలోకి వచ్చింది.

వివిధ కాలాలలో విభిన్న దేశాలలో ఈ బొమ్మలాట అనేక పరిణామాలు పొందింది. బొమ్మలాట విధానాలు అనేకం ప్రచారంలో వున్నాయి. అయితే వీటన్నింటిలోనూ కనిపించే సామ్య మేమిటంటే బొమ్మలకు వివిధ అంగాలు జోడించబడి వుంటాయి. ఈ అవయవాలు పలురకాల సాధనాలద్వారా కదిలించబడుతుంటాయి. మనుష్యులు, జంతువుల అనుకరణ వాటి లక్ష్యం. వినోద కాలక్షేపం వాటి ధ్యేయం.

ఆంధ్రలో కొయ్యతో తయారుచేసిన కీలుబొమ్మలను విరివిగా ఉపయోగిస్తారు. చేతితో ఆడించే కీలుబొమ్మలు, దారపు కీలు బొమ్మలు, చువ్వ కీలు బొమ్మలు వీటికి చక్కని ఉదాహరణలు. తోలు బొమ్మలను కూడా ఇచ్చట వాడతారు. ఛాయా ప్రదర్శనలకు ఉపయోగించే బొమ్మలు దీనికిదృష్టాంతాలు. కొయ్య కీలుబొమ్మలతో నిర్వహించే వినోద కాలక్షేపాన్ని ఇవి ప్రదర్శించబడే ప్రాంతాన్ని బట్టి "కొయ్య బొమ్మలాట" అనికానీ "కట్టాయ్ బొమ్మలాట" అని కానీ లేదా "కీలు బొమ్మలాట" అని కానీ వ్యవహరిస్తారు. ఇటీవలి కాలంలో ఈ బొమ్మలు చేయడానికి వస్త్రాన్ని, ప్లాస్టరును, ప్లాస్టర్ చెక్కను, గడ్డిగుజ్జునుకూడా ఉపయోగిస్తున్నారు. ఇంతేకాక రబ్బరు, లోహమిశ్రమాలు మొదలైన అనేక ఇతర పరికరాల ద్వారా మూడు పరిమాణాలలో కీలు బొమ్మలు తయారు చేయడానికి ప్రయోగాలు జరుగుతున్నాయి. బొమ్మలను తోలుతో తయారుచేస్తారు కాబట్టి ఛాయా ప్రదర్శనను "తోలుబొమ్మలాట" అనికూడా అంటారు. ప్రపంచంలోని ఇతర ప్రదేశాలలో ఛాయా ప్రదార్శనల నిమిత్తం కార్డుబోర్డు, రేకును కూడా ఉపయోగిస్తున్నప్పటికీ ఆంధ్రలో మాత్రం ఈ బొమ్మలకొరకు పదునుపెట్టిన చర్మాన్నే ఉపయోగిస్తున్నారు.

### చేతి (లేక మేజోడు) కీలుబొమ్మలు:

ఇవి భారత దేశంలో చాలా అరుదు. ఆంధ్ర, ఒరిస్సాలలో బిచ్చగాళ్ళు మాత్రమే వీటిని వాడుతుంటారు. రెండు చేతులతోనూ రెండు బొమ్మలను ఆడిస్తూ, తరచుగా వాటి మధ్య మోటు సంభాషణలు నడుపుతూ వీరు ప్రదర్శనలు జరుపుతారు. చేతి కీలు బొమ్మల తల, మెడ ఒకే ముక్కలో వుంటాయి మెడవరకూ ఒక రంధ్రం వుంటుంది. బొమ్మను ఆడించే వ్యక్తి ఈ

రంధ్రంలోకి తన మొదటి వేలును దూర్చి బొమ్మను ఆడిస్తాడు. బొమ్మ చేతులుకూడా కొయ్యతో చెక్కబడుతాయి. బొటన వ్రేలు, రెండవ వ్రేలుతో పట్టుకొని బొమ్మను ఆడించడానికి అనువుగా ఈ చేతులు వుంటాయి. మెడ అడుగున ఒకచిన్న సంచీ వుంటుంది. ఇది నాడాలతో కట్టి జార విడవబడి వుంటుంది. బొమ్మ చేతులనుంచి జారవిడవబడిన నాడాలుకూడా ఈ సంచికి కలపబడతాయి. బొమ్మను ఆడించే వ్యక్తి తన రెండు చివరి వ్రేళ్ళతో ఈ సంచిని పట్టుకుంటాడు. ఈ విధంగా చేయడంవల్ల అతనికి బొమ్మను ఆడించడంలో దానిపై పూర్తిగా అదుపు, పట్టు వుంటుంది. కొన్నిబొమ్మలను ముఖం, చేతులను చెక్కి రంగులు వేసి తయారు చేస్తారు. మరికొన్ని బొమ్మలను విగ్గు, ముసుగులతో జోడింపులు మొదలైన వాటిని కప్పివేసి తయారు చేస్తారు. మెడ అడుగున అంచులో వస్త్రాలు అమర్చుతారు. చేతి కీలుబొమ్మలను మేజోళ్ళవలె చేతికి తొడుక్కుని ఆడిస్తారు. బొమ్మను ఆడించే వ్యక్తి తన వ్రేళ్ళను తిప్పుతూ బొమ్మ తలను, చేతులను కదిలిస్తుంటాడు. బొమ్మను తొడిగిన ముంజేయి, బొమ్మను నిటారుగా నిలిపి వుంచడానికై నిలువుగా వుంచబడుతుంది.

చేతి కీలుబొమ్మలాటను రంగస్థలంపై ప్రదర్శిస్తుంటారు. దీనికి మూడువైపుల తెరలువేస్తారు. ఒకవైపున తెరచివుంటుంది. ఈ భాగాన్ని వ్రేలాడదీసిన తెరచట్టుతో మూసివేస్తారు. ఈవిధంగా నిర్మించిన రంగస్థలం కొద్దిగా ఎత్తులో వుంటుంది. దీనికి వేదిక వుండదు. రంగాలంకరణ వుండదు. బొమ్మలను అడుగుభాగంనుంచి ఆడిస్తారు. బొమ్మలపై వెలుగు ప్రసరించే విధంగా దీపాలను అమర్చుతారు.

**దారపు కీలుబొమ్మలు:** దారాల సహాయంతో ఆడించే కీలుబొమ్మలను ఈ పేరుతో వ్యవహరిస్తారు. సంస్కృత నాటకాలలో కనిపించే ''సూత్రధారి'' అనే పేరు ఆనాడు ప్రచారంలో వున్న దారపు కీలుబొమ్మల నుంచి బహుశా వచ్చివుంటుంది. ఎందుకంటే 'సూత్రధారి' అంటే ''దారాలను పట్టుకునేవాడు'' అనికూడా అర్థం. ఆధునిక నాటక దర్శకుని విధులను ఆనాడు 'సూత్రధారి' నిర్వర్తించేవాడు.

దారం సహాయంతో ఆడించే కీలుబొమ్మలు కొయ్యతోగానీ, ఇతర సామగ్రితోకానీ, తయారు చేయబడతాయి. ఈ వినోద ప్రదర్శనలను తెలుగులో 'బొమ్మలాట' అని సాధారణంగా వ్యవహరిస్తారు. కీలుబొమ్మను కొయ్యతో తయారు చేసినప్పుడు శిరస్సు పార్శ్వాలలోనూ, మెడ అడుగుభాగంలోనూ బొమ్మను ఆడించేందుకై దారాలను అమర్చడానికి వీలుగా తిరుగుడు నేత్రాలను ఉపయోగిస్తారు. కీలుబొమ్మను మృదువైన పదార్థంతో తయారు చేసేట్లయితే ఒక చెవినుంచి మరో చెవి వరకు ఒక తీగెనూ, మెడనుంచిదిగువవరకు మరో తీగెను బిగిస్తారు. చెవులకు రెండు వైపులా రెండు ముళ్ళు వేసివుంటాయి. మెడనుంచి తీసే తీగెను మొదటి తీగెకు మెలివేస్తారు. దీనికి చివరన ఒక ముడి వుంటుంది. మొండెం ఒకే ముక్కగా వుంటుంది. బుజాలు, తుంటిని వేరే ముక్కలతో తయారుచేస్తారు. సాధారణంగా బొమ్మలకు కాళ్ళు వుండవు. బొమ్మలను తయారు చేయడానికి ఏపదార్థాలను వాడినప్పటికీ జోడింపులు మాత్రం కదిలేవిధంగా వుంటాయి. వెంట్రుకలు, ముఖం, చేతులను సుశిక్షితులైన వృత్తి పనివారలు చిత్రిస్తారు. ఈ పనులను వారు తరతరాలనుంచి ప్రధాన వ్యాపకంగా కాకున్నా సహాయక వృత్తులుగా చేపట్టి వానిలో ప్రత్యేక సామర్ధ్యాన్ని కనబరుస్తున్నారు. ప్రతి బొమ్మనూ తలకు, రెండు చేతులకు కట్టిన దారాలతో ఆడిస్తారు ఈ దారాలన్నీ ముక్కోణాకారంలో వుండే ఒక సాధనానికి బిగించబడతాయి. బొమ్మను ఆడించడంలో ఈసాధనం ప్రధానమైనది. కీలుబొమ్మలను సాఫీగా ఆడించడానికి చెప్పుకోదగినంత నిపుణత, అనుభవం అవసరం.

దారపు కీలుబొమ్మలను ఆడించడానికి ఉపయోగించే రంగస్థలం చేతి కీలుబొమ్మలను ఆడించే రంగస్థలంకంటె భిన్నంగా వుంటుంది. దారపు కీలుబొమ్మలను ఆడించే వారు బొమ్మలు ఆడే రంగస్థలంకంటే ఎత్తు ప్రదేశంలో ఆ బొమ్మలకు వెనుకభాగంలో నుంచొని వుంటారు. రంగస్థలం ప్రక్కభాగాలు, బొమ్మలనురంగంపై ప్రవేశపెట్టడానికి నిష్క్రమింప జేయడానికిగాను తెరిచి వుంచబడతాయి. రంగస్థలంలో వెలుగుకోసం ఉపయోగించే కాగడాలను మంటలు అంటుకోకుండా వుండేందుకై బొమ్మలను ఆడించడానికి నిర్దేశించిన స్థలానికి దూరంలో వుంచుతారు.

**చువ్వ కీలుబొమ్మలు:** చువ్వల సహాయంతో ఈకీలు బొమ్మలను ఆడిస్తారు కాబట్టి వాటికిఈ పేరు వచ్చింది. ఈ పద్ధతిలో కీలుబొమ్మలను ఆడించడం ముఖ్యంగా బెంగాలులో ప్రచారంలో వుంది. అయితే ఆంధ్రలోకూడా ఇలాంటి కీలుబొమ్మలాటలు లేకపోలేదు. ఏమైనప్పటికీ ఇవి ఇక్కడ విరివిగా ప్రచారంలో లేవు. ఇది దేశీ ప్రదర్శన విధానంకూడా కాదు.

చేతి కీలుబొమ్మలు, దారపు కీలుబొమ్మలను తయారు చేయడానికి ఉపయోగించే పరికరాలనే చువ్వకీలుబొమ్మలను తయారు చేయడానికి కూడా వాడుతారు. చువ్వకీలుబొమ్మతలను మెడపై రంధ్రంవేసి అమర్చు

తారు. ఈ రంధ్రంలో బిగించిన పలచని సాధనం క్రిందివరకు వుండి, బొమ్మను పట్టుకొని ఆడించడానికి ఉపయోగిస్తుంది. బొమ్మ మొండేనికి కొయ్య భుజం ముక్కలు ఆయా స్థలాలలో నిలువుగా జోడించబడతాయి. చేతులను దారపు కీలుబొమ్మల మాదిరిగానే తయారు చేస్తారు. అరచేతులకు జోడించిన దారాలద్వారా క్రిందనుంచి వీటిని కదిలిస్తారు. కాళ్ళు వుండవు. చువ్వ కీలు బొమ్మల అవయవాల జోడింపు సంక్లిష్టంగా వుంటుంది. తల బోలుగా వుండి మెడపై తిప్పేవిధంగా అమర్చబడి వుంటుంది. మెడ, భుజాలు ఒకే ముక్కలో తయారు చేయబడతాయి. చువ్వ కీలుబొమ్మలను, దారపు కీలుబొమ్మలంత వేగంగా కదిలించడానికి సాధ్యంకాదు. అయితే వాటిఅభినయం మనోహరంగా వుంటుంది.

చువ్వ కీలుబొమ్మలాటకు నిర్మించే రంగస్థలం చేతి కీలుబొమ్మలాటకు ఉపయోగించే రంగస్థలం మాదిరిగానే వుంటుంది. అయితే ఒకమార్పు ఏమిటంటే ఈ రంగస్థలంలో స్టేజిమట్టానికి దిగువన అవసరమైన స్థలాలలో కొయ్య ముక్కలను అమర్చుతారు. వీటికి అక్కడక్కడ కొన్ని రంధ్రాలు వుంటాయి. చువ్వలను గట్టిగా అమర్చడానికి అనువుగా ఈ రంధ్రాలు తొలచబడతాయి. కొన్ని చువ్వ కీలుబొమ్మలకు ఒక అంగుళం ఎడంతో రెండు గుండ్రని చక్రాలు వుంటాయి ఇవిడిగువన కట్టబడి వుంటాయి. ఇందువల్ల బొమ్మలను ఆడించే వ్యక్తి అవసరం లేనప్పుడు వాటిని నిలబెట్టి వుంచడానికి వీలుగా వుంటుంది. చేతికీలుబొమ్మల రంగస్థలంలో మాదిరిగానే దారపుకీలు బొమ్మలను ఆడించే రంగస్థలంలో కూడా వెలుతురు ప్రసారానికి ఏర్పాట్లు చేస్తారు.

ఛాయా ప్రదర్శనలు: వీటినే సంస్కృతంలో ''ఛాయా నాటకాలు'' అంటారు. ఆంధ్రలో వీటిని 'తోలుబొమ్మలాట' లంటారు. ఈ బొమ్మలను తయారు చేయడానికి ఉపయోగించే పరికరాలను బట్టి వీటికీపేరు వచ్చింది.

ఈ ప్రదర్శనలలో చువ్వ బొమ్మలాటలలో వలె సాధారణంగా అడుగునుంచి బొమ్మలను ఆడిస్తారు. ముందుభాగంలో వస్త్రాన్ని ముడుతులు లేకుండా కప్పుతారు. వెనుకనుంచి వెలుతురు పడినప్పుడు నీడ తెరపై పడుతుంది. చర్మాన్ని బొమ్మలుగా కత్తిరించి అమర్చుతారు. వీటిద్వారా బొమ్మలను నేరుగా తెరవెనుక నుంచి ఆడిస్తారు. కదిలించడానికి వీలైన అవయవాలు, దవడలను విడిగా కత్తిరించి బొమ్మకు జోడిస్తారు. బొమ్మ వెనుకభాగంలో బిగించే దారాలతో వీటిని ఆడిస్తారు. వెనుకనుంచి పడే వెలుతురువల్ల నీడల దృశ్యాలు స్పష్టంగా కనిపిస్తాయి.

బొమ్మల కత్తిరింపుకు ఉపయోగించే పరికరాలు వివిధ దేశాలలో విభిన్నంగా వుంటయి. ఆంధ్రలో బొమ్మయొక్క పాత్ర స్వభావాన్ని బట్టి జింకలేదా మేక చర్మంతో బొమ్మలను సిద్ధం చేస్తారు. చర్మంతో బొమ్మలు తయారుచేసే దేశాలలో ఇతర చర్మాలనుకూడా ఉపయోగిస్తుంటారు. ఉదాహరణకు ఆగ్నేయాసియాలలో గేదె చర్మాన్ని వాడతారు. చైనాలో గాడిద చర్మాన్నిఉపయోగిస్తారు ఆలాగే టర్కీలో ఒంటెతోలును వినియోగిస్తారు. నేటికాలంలో ప్రదర్శించబడే ఛాయా ప్రదర్శనాలలో, బొమ్మలకత్తిరింపు పైచర్మానికిబదులు కార్డుబోర్డును, రేకును కూడా ఉపయోగిస్తున్నారు.

ఈ వినోద ప్రక్రియ ఆంధ్రలో గత 20 శతాబ్దాలకు పైగా ప్రచారంలో వుంది. నిజానికి క్రీడా ప్రదర్శనలు మొదట ఆంధ్రలోనే క్రీ. పూ. 3వ శతాబ్దిలోనే వాడుకలోకి వచ్చినట్లుకూడా ప్రతీతి. ఇటీవలి సంవత్సరాలలో, సుప్రసిద్ధ భారతీయ కళాకారుడు శ్రీ ఉదయ శంకర్ ఈ కళా ప్రక్రియకు నూతనత్వాన్ని సంతరింపజేశారు. వీటి దృష్ట్యా క్రీడా ప్రదర్శనలను గురించి వివరంగా తెలుసుకోవడం ఉచితం.

ఆంధ్రలో ''తోలుబొమ్మలు'' అన్న పదం ఛాయా ప్రదర్శనలలో ఉపయోగించే బొమ్మలకు పూర్తిగా అన్వయించదు. నిజానికి అవి బాగా నునుపుచేయబడిన అద్దం వలె తళతళా మెరిసేటటువంటి చర్మంతో తయారుచేసిన వర్ణ ప్రతిమలు. వివిధ అంగాలను విడివిడిగా కదిలించడానికి వీలుగా వాటిని జోడిస్తారు. ఈ జోడింపు పద్ధతి ప్రపంచ మంతటా ఛాయా ప్రతిమల అంగాలను జోడించడానికి అనుసరించే విధానాన్నే పోలివుంటుంది. వివిధ పాత్రలు – వాటి దుస్తులు ఆభరణాలతో–పదును పెట్టిన చర్మంపై చెక్కడాలు, రంధ్రాలద్వారా చిత్రించబడతాయి ప్రకాశవంతమైన మంచి రంగులతో వీటిని చిత్రించడం జరుగుతుంది. ఇందులో వాడబడే ప్రధానమైన రంగులు నలుపు, ఎరుపు, ఆకుపచ్చ. ఈరంగుల్నే ఒకదానితో ఒకటి కలిపితే ముదరాకుపచ్చ, మట్టిరంగు మొదలయిన మిశ్రమ రంగులు తయారవుతాయి. చదును చేసి సాగదీసిన చర్మానికి స్వతహాగా వుండే గోధుమ రంగు తరచుగా ముఖం, యితర ఆభరణాలను వ్యక్తం చేయడానికి వుపయోగించ బడుతుంటేవి.

ఈ తోలుబొమ్మలు వుండే తీరు, రంగులు పులిమే విధానం నిజానికి జావాదేశపు వాంగ్ పర్వా ప్రదర్శన చిత్రాలంత అలంకారాలతో కూడి వుండకపోయినప్పటికీ, ఆంధ్ర దేశం

యీ తోలుబొమ్మల నిర్మాణంలో, వీటికి రంగులు పులమడంలో ఆచార సాంప్రదాయాలను సృష్టించిన విష యం సర్వత్రా గుర్తించినదే. ఈనాడు యీ విధానాలను ఆగ్నేయాసియా దేశాలవారు అనుసరిస్తున్నారు. కళ్లు, ముక్కు, నోరు - వీటిని గీసిన విధానం చూస్తే ఒకానొక ఆచారం ద్వారా పాత్రలకు జీవంపోసినట్టు అనిపిస్తుంది.

ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలలో యీ తోలు బొమ్మల సైజు, ఉపయోగించే చర్మములలో కొద్దిపాటి తేడా కనిపిస్తుంది తెలంగాణాలో వీటి పొడవు 4 అడుగులుం టుంది. సర్కారు జిల్లాలలో వివిధ సైజుల్లో వుంటాయి. కొన్ని ఆరు అడుగులకు పైబడికూడా వుంటాయి. తెలంగాణ, రాయలసీమ ప్రాంతాలలో దేవుళ్ళ బొమ్మలు, రాజుల బొమ్మలు జింక చర్మంతోనూ, మిగిలిన పాత్రల్ని మేక చర్మంతోనూ, తయారు చేస్తారు. సర్కారు ప్రాంతంలో సాధారణంగా పాత్రలన్నింటినీ మేక చర్మం తోనే తయారుచేస్తారు. ఒక్కొక్కప్పుడు రాక్షస పాత్రలకు మాత్రం గేదె చర్మం వాడబడుతుంటుంది.

కీలుబొమ్మల్లోవలె కాక తోలుబొమ్మల్లో మాత్రం మధ్యలో కిందవరకు వ్రేలాడే ఒక వెదురుబద్ద వుంటుది. దీనితో వీటిని కదిలి స్తారు. ఈ వెదురుబద్ద తోలుబొమ్మ తల వరకూ వుంటుంది. మరో రెండు సన్నటి వెదురుబద్దలు ఆ బొమ్మల చేతుల చివర్ల నుండి వేలాడుతుంటాయి. బొమ్మలో వివిధ జాయింట్లవద్ద గుండ్రంగా తాడుతో ముడులు వేసివుంటాయి. పొడుగ్గావున్న వెదురుబద్ద పైన అడ్డంగా చిన్న కర్రను కట్టి, దానిని ఆయా అంగాలవద్దగల ముడులలో దూర్చి ఆయా అంగాలను కదిలించడానికి ఉపయోగి స్తుంటారు. ఒక్కొక్కప్పుడు బొమ్మల్ని తెరకు ఆనించి ఈతముల్లుతోగుచ్చడంకూడా కద్దు.

తోలుబొమ్మలాట జానపదకళ మాత్రమే కాదు. జానపద వినోద ప్రదర్శనకూడాను. ఈ ప్రదర్శన యించుమించు ఆరుబయటే ప్రదర్శింపబడుతుంది. ప్రదర్శనా రుసుము వుండదు. అంతా వెళ్ళి చూడవచ్చు అయితే తాత్కాలికంగా ఆ ప్రదర్శనానికై అప్పటికప్పుడు ఒక పందిరివేయడం జరు గుతుంది. ఈ పందిరి సైజు దానికి లభ్య మయ్యే గెడ కర్రలు, తెరలు మొదలయిన వాటిమీద ఆధారపడి వుంటుంది. ఈ పందిరి ముందరి భాగంలో అడ్డంగా కట్టిన రెండు సన్నటి తెల్లటి చీరలు తెరలా వుపయోగి స్తాయి. మందంగా వున్న వస్త్రం అయితే నీడలు వివరంగా కనుపించవు. రెండు చీరలు పైనా కిందా గట్టిగా బిగించి కట్టి, ఆ రెంటి అంచుల్ని యీత ముల్లుతో దగ్గరకు చేర్చి, వాటిని యిరువైపులా రెండు రాటలకు కట్టడం జరుగుతుంది. ఈ తెరను ఏర్పాటు చేయడంలో క్లాశీ వుండడంగాని, ముడతలు పడడంగాని, వదులుగా వుండడంగాని కూడదు. అందు వల్ల నీడలు బాగాకనిపించవు. తెర వెడల్పు చీర పొడవుమీద ఆధారపడి వుంటుంది. ఇది పన్నెండునుంచి పదహారు మూరల వరకు వుంటుంది. అంటే 18-24 అడుగు లన్నమాట. తెర వెడల్పు ఎక్కువగా వుండంవల్ల దీనికి ఆధారంగాను, కదల కుండా స్థిరంగా వుండడానికి గాను సాధార ణంగా మధ్యలో అదనంగా మరొక రాట పాతుతారు. రెండు చీరలను దగ్గరకు చేర్చి తెరను నిర్మించడంవల్ల దీని వెడల్పు 8-10 అడుగుల మధ్య వుంటుంది. తెరకు దిగు వన మోకాలు ఎత్తున కొంత స్థలం అటూ యిటూ కదలడానికి, కూర్చుని బొమ్మల్ని కదిలించడానికి వీలుగా వదిలివేయబడు తుంది గనుక రంగస్థలం మొత్తం ఎత్తు 10-12 అడుగుల మధ్య వుంటుంది. ముందున్న రాటలమధ్య మోకాలు లోతు స్థలాన్ని వెలుతురు చొరరాని మందమైన నల్లటి గుడ్డతో కప్పడం జరుగుతుంది. తోలు బొమ్మల్ని ఆడించే వారు ఆ బొమల్ని కదలించడానికి, యితర పనులకు అవసర మయ్యే మోకాలు ఎత్తు స్థలంమీద రంగ స్థలం లోతుపాతులు ఆధారపడి వుంటాయి. సాధారణంగా తెరవెనక 6-12 అడుగుల లోతు గొయ్యి ఏర్పాటు చేయబడుతుంది. పైకప్పు, పక్క గోడలు, వెనక గోడ టార్పాలిన్‌తోగాని, గోనె సంచులతోగాని కప్పి, వెనకభాగంలో తోలు బొమ్మల్ని ఆడించేవారు అవసరమైతే అవతలికి పోవ డానికీ, లోపలికి రావడానికీ వీలుగా ఖాళీగా కొద్దిభాగం వదిలివేయబడుతుంది. నిజానికి ప్రదర్శకులు ప్రదర్శన సమయమంతా లోపలే వుండిపోతారు. ఈ ప్రదర్శన ఆరు నుంచి ఎనిమిది గంటలపాటు నిర్విరామంగా సాగుతుంది గనుక ప్రదర్శకులకు ఫలహా రం తయారుచేయడానికి, తెరవెనక వున్న ప్రదర్శకుల పిల్లలు నిద్రపోవడానికి వీలుగా సౌకర్యాలు కల్పించబడతాయి ప్రదర్శకులు తమ పిల్లలు ఏడ్చి ప్రదర్శనకు అంతరా యం కలిగిస్తున్నప్పుడూ, అత్యవసర పరి స్థితి ఏర్పడినప్పుడు మాత్రమే లోపలినుంచి కదిలి వస్తారు. తాత్కాలికంగా పందిరి వేయడానికి కావలసిన వస్తువుల్ని ఆ గ్రామంలోని ధనవంతులు యిస్తారు. దాని నిర్మాణం గ్రామీణ శ్రామికులు చేపట్టుతారు. ఆ గ్రామంలోని రజకుడు చీరల్ని, గ్రామ మంగలి దీపాలను అందజేస్తారు.

బొమ్మలు బాగా కనిపించాలంటే తెరను పైనుండి కొద్దిగా కిందకు రంగస్థలంలోకి వాలుగా దిగేటట్టు ఏర్పాటు చేయవలసి వుంది. తెర ఎప్పుడూ భూమికి నిట్టనిలువుగా సమకోణంలో వుండకూడదు. ప్రదర్శకుడి అలక్ష్యంకారణంగా తోలుబొమ్మ క్రిందకు జారిపోకుండా వుండేందుకు యిలావుంచాలి. ఈ ప్రదర్శనలో రంగు రంగుల బొమ్మల్ని చూపించడం జరుగుతుంది గనుక వీటిని సరిగ్గా కనిపించడానికి సాధ్యమైనంత దగ్గరగా తెరకు ఆనించాలి.

తోలు బొమ్మల్ని ఆడించేవాడి నేర్పు, ఆ బొమ్మల్ని తెరదగ్గరకు తీసుకురావడంలోను, వాటిని తిరిగి వెనక్కు తీసుకోవడంలోనూ వుంటుంది. పార్శ్వాకృతిలో వున్న తోలుబొమ్మల తలల్ని కదిలించే నేర్పే, ఆంధ్రదేశంలోని తోలు బొమ్మల ప్రదర్శనలో ఒక ప్రత్యేకత అనవచ్చు. ఈ రకమైన పార్శ్వాకృతి బొమ్మలు జావా, చైనా, యితర పాశ్చాత్యుల ప్రదర్శనల్లో కనుపించవు.

ఈ ప్రదర్శనకు కావలసిన వెలుతుర్ని దివిటీలద్వారా, ఆముదపు దీపాలద్వారా కల్పించడం సాంప్రదాయ సిద్ధంగా వస్తున్న అలవాటు. ముఖ్యంగా ఆముదపు దీపాలే ఎక్కువగా వాడబడుతుండేవి. తెరకు సరియైన స్థలంలో దీపాలను వుంచేటట్టు శ్రద్ధ తీసుకోవాలి. దీపాలు తెరకు బాగా దూరంగా వుంటే ప్రదర్శకులు ప్రేక్షకులకు కనబడిపోవడమే కాకుండా, వారి నీడలు తెరమీద పడి ఆటకు అంతరాయం కలిగిస్తాయి. దీపాలు తెరకు మరీ దగ్గరగావుంటే దీపాలకు దగ్గరగా వున్న బొమ్మలు బాగా కనుపించి, దూరంగా వున్నవి కనుపించక పోవడం, అలుక్కుపోయినట్లుకనుపించడంజరుగుతాయి. అందుచేత దీపాలను తోలుబొమ్మల ఎత్తులో తెరకు రెండుఅడుగుల దూరంలో వుంచాలి.

దివిటీలు, ఆముదపు దీపాలవల్ల, ఏ మాత్రం అలక్ష్యంగా వున్నా పందిరి అంటుకునే ప్రమాదం వున్నందువల్ల వాటివిషయంలో చాలా జాగ్రత్త వహించాలి. ఈ ప్రమాదాన్ని గుర్తించి యిటీవల వీరు యితర విధాలను అనుసరించడానికి ప్రయత్నిస్తున్నారు. యిక్కడ ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఆముదపు దీపాలు యితర విధాలైన దివిటీలు ఎరుపురంగు కాంతి నిస్తాయి. ఈ కాంతితో తోలుబొమ్మలకు ఎరుపురంగు పృష్ఠభూమిని కల్పించడం జరుగుతున్నది. మరో విధమైన దీపాలను వాడినప్పుడు–ముఖ్యంగా పెట్రొమాక్సు లైట్లను, విద్యుద్దీపాలను వాడినప్పుడు–పై విషయాన్ని కూడా ఆలోచించాలి. ఎరుపు రంగు ట్యూబులైట్లద్వారా సాంప్రదాయిక ఫలితాలను సాధించవచ్చు.

తోలుబొమ్మలాటలోను, దారపుబొమ్మలాటలోను శబ్దం ఒక ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. తీగబొమ్మలు రాజస్థాన్‌లో బహుళ ప్రచారంలో వున్నాయి. ఇవి మాట్లాడేభాష ఆదోరకమైన ప్రత్యేకతను కలిగి వుంటుంది. అటూయిటూ కదలుతూ కీచు గొంతుకలతో, బొంగురుగొంతుకలతో అరుస్తూ శబ్దం చేస్తుంటాయి. మనుషుల్ని ఆనందింప జేయడానికి దివినుండి భువికి దిగివచ్చిన భావన కలుగుతుంది వాటి మాటల్లో. దారపు బొమ్మలకు భాష పరిమితమై వున్నందున, మాటలకన్న కదలికకే ప్రాధాన్యత వున్నది. తోలుబొమ్మలాటలో నయితే అన్ని శబ్దాలు దాని కవసరమే. అనేకమైన కంఠాలు వివిధవ్యక్తుల్లా మాట్లాడుతాయి. ఒంటిగా గళమెత్తి పాటలు పాడుతాయి. బృందగానం చేస్తాయి. హార్మనీ మొదలయిన వాటి సంగీతం, సమయానుకూలంగా రసోత్పత్తికి తగినట్టు సృష్టించే సంగీతం, రంగస్థలంమీద చేసే శబ్దం – యివన్నీ వాళ్ళ కంఠాల వెనక అల్లుకుని వుంటాయి.

సర్వసాధారణంగా తోలుబొమ్మలప్రదర్శకుల బృందంలో అరడజను మంది సభ్యులుంటారు. వీరిలో కనీసం స్త్రీలు యిద్దరయినా వుంటారు తరచుగా ఆడ, మగ సమసంఖ్యలో వుంటుంటారు. తోలుబొమ్మల్ని ఆడించేవాడు ఆ బొమ్మ అంగాలను అటూఇటూ కదలించడమే కాకుండా వాటితో పాటు అక్కడికీ యిక్కడికీ కదులుతూ వుండాలి గనుక ఏకకాలంలో ఒకటికన్న ఎక్కువ బొమ్మల్ని ఆడించలేడు. వీరు తమ కంఠాల్ని రకరకాలుగా మార్చగలిగే సమర్థులు. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. అయినప్పటికీ వీరు ఇండోనేసియా 'యాంగ్‌కులిట్' ప్రదర్శకులు, దాలంగ్‌లు ప్రదర్శించే నైపుణ్యపు స్థాయిని చేరుకోలేక పోయారు. ఈ యిండోనేసియా ప్రదర్శకుడు అన్ని బొమ్మల్నీ ఒకేసారి కదిలించి ఆడిస్తాడు. ఈ తోలుబొమ్మల్ని ఒకేసారి ఆడించడానికి ఎప్పుడూ ఒకరికన్న ఎక్కువ మంది అవసరమవుతూ వచ్చారు. ఆడ, మగ కంఠాలకుగాను కనీసం యిద్దరు ఆడవాళ్లు, యిద్దరు మగవాళ్ళు. హార్మనీ మొదలయిన వాటిని వాయించడానికి కనీసం యిద్దరువ్యక్తులు వుండేవారు. హార్మనీ, మృదంగం, తాళాలుఆర్కెస్ట్రాగా పనిచేసేవి, మొత్తం బృందం అంతా బృందగానం చేసేది. రెండు కర్రచెక్కలు నేలమీద ఒకదానిమీద ఒకటి పేర్చి వాటితో నేర్పుగల ప్రదర్శకులు రంగస్థలం లోపలనుండి రకరకాలైన శబ్దాలను అతిచాకచక్యంతో

సృష్టించేవారు. తోలుబొమ్మల కదలికలకు అనుగుణంగా, స్వయంగా ఆ బొమ్మలే శబ్దాన్ని సృష్టిస్తున్నవన్న భావనను కలిగించేవారు.

## ఇతివృత్తాలు

ఇటీవలి కాలం వరకూ యీ తోలుబొమ్మలాటకు కావలసిన యితివృత్తాలను రామాయణ, మహాభారత, భాగవత కావ్యాల నుండి తీసుకోవడం జరుగుతుండేది. వర్తమాన శతాబ్దం తొలి రెండు దశాబ్దాలలోనూ ప్రయోగపూర్వకంగా చారిత్రక యితివృత్తాలను తీసుకుని ప్రదర్శించారు. స్వాతంత్ర్యానంతరం పంచవర్ష ప్రణాళికలకు ప్రచార సాధనాలుగా సాంఘిక యితివృత్తాలు కూడా ప్రదర్శించబడడం ప్రారంభించాయి. ఇతివృత్తం ఏలాటిదైనప్పటికీ వీటి సాంప్రదాయాలు పరిపోషింపబడుతూనే వున్నాయి. ప్రదర్శన ప్రారంభం ఎప్పుడూ నటరాగంతోను, ముగింపు సురటి రాగంతోను వుంటుంది. ఆట ప్రారంభించే ముందు విఘ్నేశ్వర పూజ జరుగుతుంది. ఇందుకై విఘ్నేశ్వరాకారం గల తోలుబొమ్మ తెర మధ్య ఉంచబడుతుంది. ఒక్కొక్కసారి అందానికి అలంకారయుతంగా జంతువులు, పక్షులు, చెట్లు మొదలయిన యితర తోలుబొమ్మలుకూడా తెరమీద వుంచుతారు. అయితే ప్రార్థనానంతరం విఘ్నేశ్వరుడితో పాటు వీటినికూడా తీసివేయవలసి వుంటుంది. ఆతర్వాత 'సూత్రధారుడు' అనబడే బృందనాయకుడి నాందీ వాక్యాలతో ఆట ప్రారంభమవుతుంది. కథాకథనం, మాటలు, పద్యాలు, పాటలు అన్నీ తెలుగులోనే వుంటాయి. అయితే కథ చెప్పేవాడు తన పాండిత్య ప్రకర్షను వ్యక్తం చేసుకోవడానికి సంస్కృత శ్లోకాలను అప్పుడప్పుడు పఠిస్తుంటారు.

తోలుబొమ్మలచేత నాట్యం చేయించగలిగే నేర్పుగల ప్రదర్శకులు లభించినప్పుడు నాట్యాన్నికూడా యీ తోలుబొమ్మలాటలో ప్రవేశ పెట్టడం జరుగుతుంది. నాట్యం చేయించే తోలుబొమ్మను తెరకు దగ్గరగా వుంచి, తల, మెడ, చేతులు, కటి, కాళ్ళు మొదలయిన భాగాలను నైపుణ్యంతో కదలించడానికి ఒక తోలుబొమ్మకు బాగా తరిఫీదుపొందిన యిద్దరు ప్రదర్శకులు కలిసి పని చేయవలసి వుంటుంది. వీరు తోలుబొమ్మలను ఆడించడంలోనే కాక భరత నాట్యంలో కూడా శిక్షితులై వుంటారు. ఏ తోలుబొమ్మలాట అయినా చిట్టచివర ఆఖరయ్యేముందు, మొత్తం బృందంలో వారంతా సర్వజన శ్రేయస్సుకై బృంద గానంగా పాడే 'మంగళం'తో ముగుస్తుంది.

తోలుబొమ్మలాటలో ప్రధాన పాత్రలు యితివృత్తాన్ని బట్టివుంటే, రెండు హాస్య పాత్రలు ఎప్పటికప్పుడు ప్రవేశిస్తూ తాజా వార్తల్ని తెలియజేస్తూ, వ్యంగ్యంగా వ్యాఖ్యానిస్తుంటాయి. ఇవి కేతిగాడు (ఒక్కొక్కప్పుడు వీడి జుట్టు తీరునుబట్టి జుట్టు పోలిగాడు అనికూడా పిలుస్తుంటారు) బంగారక్క. ఈ పాత్రలు ఇండోనీసియాలో యాంగ్ కులిట్ ప్రదర్శనలోని పడగోల్, వలాంగ్ పాత్రలను టర్కీలోని కరజాంగ్, హెడ్జివెడ్ పాత్రలను పోలివున్నాయి. ఇవి సందర్భానుసారంగా రావడమే గాకుండా సంజ్ఞామాత్రంచేత వచ్చి సంక్లిష్టమైన ఇతిహాసిక సంఘటనను కూడా ప్రేక్షకులకు విశదీకరిస్తుంటాయి.

వంశపారంపర్యంగా తోలుబొమ్మలాటను భుక్తికొరకు ఆడుకుంటూ వస్తోన్న కుటుంబాలనుంచి తోలుబొమ్మల ప్రదర్శకులు ఉద్భవిస్తుంటారు. చిన్నప్పటినుంచీ కూడా ఆ కుటుంబంలోని పెద్దవారికి తోలుబొమ్మల్ని తయారు చేయడంలో, ఆడించడంలో, కథ చెప్పడంలో, పద్యాలు అప్పజెప్పటంలో పాటలు పాడడంలో శిక్షణ యిస్తాడు. అచ్చుపుస్తకాలు లేనప్పుడు యీ శిక్షణ కేవలం నోటి మాట ద్వారా వుండేది. ఇందుకు నేర్పుతోపాటు ఎక్కువ జ్ఞాపకశక్తికూడా వుండాలి ఒకే కుటుంబంలోని వారు గాని, దగ్గరి బంధువులుగాని తోలుబొమ్మల ప్రదర్శకులు బృందాలుగా ఏర్పడుతూ వుంటారు.

వీరికి తోలుబొమ్మలే విలువైన ఆస్తి. వీలునామాల ద్వారా ఒక తరంవారి నుండి మరోతరానికి సంక్రమించే ఐశ్వర్యం. ఒక్కొక్కప్పుడు వధువుకు కట్నంగా కూడా ఉపయోగిస్తుంటాయి. వాతావరణం పొడిపొడిగా వున్నప్పుడు ఈ బృందాలు ఒక గ్రామంనించి మరో గ్రామానికి కదలి వెళ్ళుతుంటాయి. వర్షాకాలంలో తరచుగా వీరికి పనేమీ వుండదు. అందుచేత వీరికి సహాకారం లభింపజేయడం, ఆటంకాలను తొలగించడం అవసరం. కుటుంబంలో పెద్దే యీ బృందానికి కూడా నాయకుడుగా వుంటాడు. ఈయన అతి సౌమ్యుడు. దూరదృష్టి గలవాడు, విజ్ఞుడు. బృంద సభ్యులంతా ఈయనను గౌరవిస్తారు.

తోలు బొమ్మల్ని ఆడించేవారు కళాకారులు గనుక వీరి జీవనభృతి అనిశ్చితమైనది. వీరిచ్చే ప్రదర్శనలు ఉచితమైనవి అయినందువల్ల వీరు తమ జీవనభృతికి ఎల్లప్పుడూ గ్రామస్థులిచ్చే కొద్దిపాటి విరాళాలమీదా, గ్రామపెద్దల దాతృత్వంమీదా ఆధారపడి వుండవలసి వుంటుంది. ఇటీవలి

(మిగతా 15 వ పేజీలో)

# శాంతి పూలు - ఎర్ర గులాబీలు

'రోహిణి'

సహజీవన శాంతిదూత పండిత జవహర్
స్వాతంత్ర్య రథ సారథి చాచా జవహర్
బ్రతుకు బాట లన్నిట గల విజ్ఞానఘనుడు లేడు
బ్రతికియున్న వారలందు కానరాడు సముడు
మింట జేరె ఆ దివ్వెల నంటి - నీ చూపుల వెంట
ఇంటింట విరజిమ్మెను ఎన్నెన్నో రోజాలంట
రోజు రోజు రోజాలు - ప్రతి యింట రోజాలు
రత్నగర్భ రోజాలు - భారతాంబ కంటి నీలాలు
ప్రతియింట రోజాలు - రత్నగర్భ రోజాలు
ఇంట యింట విరజిమ్మెను - ఎట్టిటి గులాబీలు
పాపలకు బాలురకు బాలికలకును
నరుల కహో ! నారీమణుల కహో ! వృద్ధులకూను
తన్నెరిగిన ప్రతివారికి - తన్నంటిన ప్రతి ఛాయకు

ఎన్నెన్నో విరజిమ్మెను - ఎర్రటి గులాబీలు
ప్రగతి పూలు మన కిచ్చెను - ప్రజ్ఞాధురీణుడు
సహజీవన మొక పూవు - త్యాగశీలత వేరొండు
పూల నంటిన ముళ్ళవియె - రక్కసి కాంతులట
తెగద్రుంచెను మొదలంట - తిరిగి జేరకుండ
మన కందించెను - ఏదో మరపురాని ఆవేదన
ఆ దివ్వెలనడుమను జేరిన మహనీయుని మన మంత
సహజీవన పూలతో - త్యాగశీల గులాబీలతో
అర్చించిన యందించును - శాంతి ఫలం
బ్రతుకుబాట లన్నిట గల విజ్ఞానఘనుడు లేడు
బ్రతికియున్న వారలందు కానరాడు సముడు
సహజీవన శాంతిదూత పండిత జవహర్
స్వాతంత్ర్య రథసారథి - చాచా జవహర్

---

(14 వ పేజీ తరువాయి)

కాలంలో వీరి పరిస్థితి మరీ దిగజారి పోయింది. అయితే స్వాతంత్ర్యా నంతరం యితర కళల పునరుద్ధరణతోపాటు తోలు బొమ్మల ప్రదర్శన కూడా త్వరిత గతిని పునరుద్ధరింపబడుతున్నది. ప్రపంచమంతటా తోలుబొమ్మల ప్రదర్శనలపై గల అభిరుచి భారతీయ కళారంగాన్ని కూడా విస్తరించి వున్నది. విదేశాలలో యీ రంగంలో జరిగిన అభివృద్ధి మన ప్రదర్శనలకు గొడ్డలి పెట్టయింది. తోలు బొమ్మల్ని వాస్తవిక స్వరూపాలకు దగ్గరగా వుండాలన్న వారికి, వాటి వ్యక్తిత్వాలను నిలుపుకొంటూ ప్రత్యేకతను కలిగి వుండాలన్న వారికి ఎప్పుడూ అభిప్రాయభేదాలు వుండనే వున్నాయి. చక్కటి ప్రదర్శనకు తావిచ్చే తోలుబొమ్మల స్వరూపాలలోని అభివృద్ధిసర్వధా అభిలషనీయమే. అయితే యీ అభివృద్ధివల్ల విపరీతంగా ఖర్చు పెరగకుండా చూడాలి. రెండింటినీ సమన్వయించే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. తోలుబొమ్మలను తయారు చేయవలసిన అవసరం యిటుపై ఆ ప్రదర్శకులకు లేకుండా పోయింది. మద్రాసులోని సెంట్రల్ లెదర్ ఇన్స్టిట్యూట్‌లో జరిగిన పరిశోధనల కారణంగా చర్మం శుద్ధిచేయడంలోను, కత్తిరించడంలోను, రంగులు వేయడంలోను ఎన్నో విధాలైన అభివృద్ధులు సాధించబడ్డాయి.



## అనంతపురం

*వ్యవసాయ ప్రదర్శనలు :*

రాయదుర్గం పంచాయతీ సమితిలో 1964 మే లో 8 వ్యవసాయ ప్రదర్శనలను నిర్వహించారు. ఈ కాలంలో 61 కిలోగ్రాముల మేలురకం విత్తనాలు, 1,221 కిలోగ్రాముల రసాయనిక ఎరువులను పంపిణీ చేశారు.

## చిత్తూరు

*నీటి పారుదల కాలువలు :*

రెడ్డివారిపల్లి తదితర గ్రామాల ప్రజలు మూడు గ్రామాలలోని మూడు సేద్యపు నీటి కాలువలను మరమ్మతు చేశారు.

*వ్యవసాయోత్పత్తి :*

నగరి పంచాయతీ సమితి రైతులు వ్యవసాయోత్పత్తిని పెంపొందించే నిమిత్తం 326 మణుగుల మేలు రకం విత్తనాలు ఉపయోగించారు.

## తూర్పు గోదావరి

*వరి విత్తనాల పంపిణీ :*

సీతానగరం పంచాయతీ సమితిలో 1964 మే నెలలో 172 మణుగుల మేలు రకం వరి విత్తనాలు, 8 మణుగుల వేరు శనగ విత్తనాలు, 128 మణుగుల రసాయనిక ఎరువులను పంపిణీ చేశారు.

*రసాయనికాల పంపిణీ :*

పెద్దపురం పంచాయతీ సమితిలో 1964 మేలో 1164 మణుగుల వరి విత్తనాలను, 250 టన్నుల రసాయనిక ఎరువులను, 21 పౌనుల రసాయనిక ఔషధాలను పంపిణీ చేశారు

## గుంటూరు

*జొన్న విత్తనాల పంపిణీ :*

ఈపూరు పంచాయతీ సమితిలో 1964 మే నెలలో 17 మణుగుల మేలురకం జొన్న విత్తనాలను, 12 ఆధునిక పనిముట్లను పంపిణీ చేశారు.

*శిక్షణా శిబిరం :*

పిడుగురాళ్లలో మహిళల నిమిత్తం గ్రామ సహాయకుల శిక్షణా శిబిరాన్ని మూడు రోజులపాటు నిర్వహించారు. 40 మంది మహిళలు శిక్షణ పొందారు.

## ఖమ్మం

*గోష్ఠి :*

ఖమ్మంలో 3 రోజులపాటు జరిగిన ముఖ్య సేవికల గ్రామసేవికల, గోష్ఠిని కలెక్టరు ప్రారంభించారు.

## కృష్ణా

*శిక్షణ శిబిరం :*

కంచికచర్ల పంచాయతీ సమితిలోని పల్లంపల్లిలో గ్రామ సహాయకుల శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు. ఈ శిబిరంలో 51 మంది రైతులకు వ్యవసాయం, పశుపోషణ, ఆరోగ్యం, పారిశుద్ధ్యం మొదలైన విషయాలలో శిక్షణ ఇచ్చారు.

## నల్గొండ

*శ్రమదానం :*

నాగారం బ్లాకు గ్రామీణ స్వచ్ఛంద దళం సభ్యులు 35 అడుగుల అప్రోచ్ రోడ్డును నిర్మించారు. రూ. 220/-ల విలువగల పని రోజుల మేరకు శ్రమదానం లభించింది.

*యువ జనోత్సవం :*

మునుగోడు పంచాయతీ సమితి చందూర్‌లో బ్లాకు స్థాయి యువజనోత్సవం జరిగింది.

## నెల్లూరు

*పశు చికిత్సా కేంద్రం :*

సూళ్లూరుపేట పంచాయతీ సమితి మన్నార్ పోలూరు గ్రామంలో, తొగరమూడి ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి అనుబంధంగా ఒక ఉప కేంద్రాన్ని నెలకొల్పారు. చెవిగుంటలో ఒక పశు వైద్య ప్రాథమిక కేంద్రాన్ని ప్రారంభించారు.

## విశాఖ పట్నం

*బాలభటుల విన్యాసం :*

అరకులోయలో అయిదవ జిల్లా బాలభటుల విన్యాసాన్ని ప్రారంభించారు. 18 విద్యా సంస్థలకు చెందిన సుమారు 200 మంది స్కౌట్లు, గైడ్లు ఈ విన్యాసంలో పాల్గొన్నారు.



# వృక్షసంపద ★

యస్. శ్రీనివాసాచార్యులు

పచ్చ పచ్చనీ చెట్టు చేమలతో,
ముచ్చట గొలిపే మన వనసీమలు :
మోడులు, మొట్టులు, పొదలూ, చెదలూ,
వాడిన మాడిన పచ్చిక బీడులు,
చావలేక జీవించు చెట్లతో
బావురు మంటూ వట్టిపోయినవి.

తరతరాల మన వృక్ష సంపదను
నరికి, పెరికి, తలగొరిగినరీతిగ,
మన చేజేతుల మంట గలుపుకొని,
అనర్ఘసంపద మిగుల్చుకొంటిమి.
సరియగు రీతులతో వర్షంబులు,
కురియుటలేదని యేడ్పు లెందులకు ?

పొయ్యిలో బెట్టే వంటచెరుకులను
పుత్తడి తూచినరీతిగ తూచే
'అడితీదారు'లు చెప్పినట్లుగా
'అడ్డికి పావు'గ ధరలను బెట్టి
కొనితెచ్చుకొనే దుర్గతిమనమే
కొనితెచ్చుకు, యీ యేడ్పులెందులకు ?

వ్యవసాయం బను బండిని నడుపగ
వలసిన, పసిముల్లెన్నో యున్నవి,
గొడ్డలికామకు మొదలు పెట్టుకొని
తెడ్డుకు వలసిన కఱ్ఱముక్కకై
దేబెరించు దౌర్భాగ్యము మనమే
తెచ్చిపెట్టుకొని యేడ్వా లెందుకు ?

దేశకాల పాత్రంబుల కనువుగ
తీర్చి దిద్దుకొను గృహములు కట్టగ,
కలప, లభించక, నీడకోసమై,
తలలను మాడ్చే రేకులకొంపలు,
వినిర్మించుకొని, యడుగడుగునకును,
విసుగు లెందులకు, యేడ్పులెందులకు ?

ఇంటికి, వంటకు, పంటకు, పెంటకు,
ఉంటకు చల్లని నీడ నిచ్చుటకు
కంటికి నింపగు ఆనలతో, కొనలతో
-మింటిమబ్బు నాకర్షించుటకును,
చివరకు చచ్చినవాని కాల్చుటకు
చెట్లేకదరా, చెరచుకోకురా !

ఇకనైనా నీ కనులు దెరువరా !
వికసిత పుష్పమురీతిగ, భూమిని
పచ్చపచ్చగా కలకలలాడగ,
పైరుపంటలకు నుపకరింపగా,
పెంచుకొనుమురా చెట్లు విరివిగా
పెన్నిధులోయ్ యివి ప్రకృతి శోభలోయ్ !

చల్లని నీడలనిచ్చును పాంథుల
యుల్లంబుల కాహ్లాదమునొసగే
ఛాయాతరువులు, రాజమార్గముల -
-కా, యీ వైపుల నమరియున్నచో
అందము మరి యానంద మిచ్చురా
అందుకు చెట్లను పెంచుకొమ్మురా !

రచ్చచావడికి నలుకెలకులలో,
పచ్చని పొలముల పార్శ్వంబులలో,
గ్రామకంఠముల, ఖాళీభూముల
కాల్వల, వాగుల, మోటబావులకు
గట్టులపైనను యే యే విధముల
చెట్లను నాటిన, సత్ఫల మొసగునో ? -

-చెప్పేవాని తెలుసుకొమ్మురా !
చెట్లవలన లభియించు రొట్టతో
చేలకు వలసిన యెరువు లభించును,
బంగారముతో సమముగ బలమిడు
పశువుల పేడను పిడకలు చేసీ
కఱ్ఱకు బదులుగ కళ్ళు మండగా
కాల్చే దుస్థితి కదలిపోవురా.

పూర్వమునుండీ వృక్షరాజముల
పూజలు చేసీ, పెండ్లిని చేసీ,
గౌరవాదరముల కలియబోసి, భ్రమ
మీర, వనములను, తరువులు బెంచీ
పెంచిన సంపద మూర్ఖజనులమై
త్రుంచిన తప్పును తెలిసికొమ్మురా !

'పదుగురు సుతు లొక నూటికి సమ'మని
'పదిబావులు వొక చెరువుకు సమ'మని
'పదిచెరువులు ఒక చెట్టుకుసమ'మని
ప్రవచించెనురా మహాభారతము
తరు, వన, హరిత విలాససంపదల
భరతభూమి విలసిల్లజేయరా -

★

క్రాలం మారిపోతోంది. కాలగతి ననుసరించి మనమూ మారాలి. బయటనుంచి వచ్చే సవాళ్ళ నెదుర్కొని మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పరిరక్షించుకోవాలనుకుంటే మన జాతి తన ఆహారవిధానాల్లో మార్పులు చేసుకుతీరాలి. జాతి బ్రతికి బట్టకట్టుందో లేదో అనే భయానక స్థితిలో జాతి శారీరక దౌర్బల్యంతో వుండరాదు. ఈ రోజు న మనం తినే ఆహారం పరిశీలిస్తే అంతా లోటుగానే కనిపిస్తుంది. మనం తినేదంతా జీవం లేని, జవసత్వంలేని ఆహారం. దేశంలో చాలా ప్రాంతాల్లో ప్రజలు తినే దాంట్లో సెరియల్సు, మాంసకృత్తులూ వగైరాదులుండే బలీయమైన ఆహారం—పాలు, గ్రుడ్లు, మాంసం లాంటివి చాలా తక్కువగా వుంటాయి.

దక్షిణ భారతదేశంలో పాలు, గ్రుడ్లు మొదలైన బలవత్తర ఆహారపదార్థాల వాడకము చాలాతక్కువ. అందులోనూ మంచి పాలు—అవీ పెద్దవారు వాడటం మరీ తక్కువ. పైగా వాడేవాటిలో మిరపకాయలో లేక కారమో ఎక్కువ వుంటుంది. అది రుచికోసమని వాడుతుంటాము. కాని దానివలన మన శరీరానికి ప్రయోజనం శూన్యమన్న సంగతి మనలో చాలా మందికి తెలియదు. మన ఆంధ్రులకన్న బెంగాలీ వారు కాస్త మెరుగు. కనీసం గ్రుడ్లు, చేపల వాడకమైనా వుంది వాళ్ళకు. అలాగే బీహారు. ఉత్తరప్రదేశ్ లోని వాళ్ళుకూడా మనకన్న కాస్త మెరుగే.

కానీ పంజాబీలను చూడండి. వాళ్ళ ఆహారం చాలా పుష్టికరమైనదని ప్రపంచమంతా అంగీకరించింది. వాళ్ళ వాడకంలో పాలు, పెరుగు, పానీర్, మజ్జిగ, గ్రుడ్లు—ఎక్కువ భాగం వుంటాయి. వాళ్ళు క్యారెట్సు, రామములగ, తదితర పళ్లు జోరుగా వాడుతారు. అవన్నీ మంచి విటమిన్లు కలిగివున్న పదార్థాలే. వాళ్ళు కూరలుగా పీజ్‌ను వాడుతారు. పైగా శుద్ధమైన నెయ్యిని కూరల్లో వుపయోగిస్తారు. అలాగే చపాతీలకూడా. మనమూరిగా బాగా కాల్చరు. పెనంమీద వేసి కాస్త వేడిచేస్తారు. తర్వాత తినేముందు మంచి నెయ్యి దానికి రాసి తింటారు. ఆ రకంగా మంచి పుష్టికర మైన ఆహారపదార్థాలను వాళ్లు తింటున్నారు గనుకనే దేశరక్షణ నిర్వహణలో నేమి, ఆటపాటల్లో నేమి, పంజాబీలే ప్రథమస్థానం ఆక్రమిస్తున్నారు. అలాగే మనంకూడా భవిష్యత్వాంధ్ర నిర్మాణంలో, ముందంజ వెయ్యాలంటే మన దేశసంపదను త్వరితగతినిపెంపొందించుకోవాలంటే, ముందుగా మన దేహసంపదను పెంచుకోవలసి వుంటుంది. ఆ నగ్న సత్యం ప్రభుత్వం గుర్తించింది. కనుకనే బృహత్ప్రణాళికల నిర్వహణకు పూనుకుంది. ఆ ఫలితమే అక్టోబరు2న విజయవాడవద్ద పాలసరఫరా పథక ఫ్యాక్టరీకి శంకుస్థాపన జరిగింది. ఆ భవన నిర్మాణానికి 35.75 లక్షల రూపాయలు ఖర్చవుతుంది. మిత్రరాజ్య సమితి శిశు సంక్షేమ నిధి తోడ్పాటుతో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల పూనిక ఫలితంగా హైదరాబాద్, సికింద్రాబాద్‌లకు, విజయవాడ, గుంటూరు పట్టణాలకు మంచి పాలు, పాలపొడి వగైరా పదార్థాల సప్లయిచేసే బృహత్పథక మొకటి ఆధునిక యంత్ర పరికరాల తోడ్పాటుతో అమలు జరుగనున్నది. ఈ ఫ్యాక్టరీలో ఒక కోటి రూపాయల కిమ్మతుగల నెయ్యి, 30 లక్షల రూపాయల విలువగల పాలపొడి వుత్పత్తి కాగలదు. ఈ ఫ్యాక్టరీ నిర్మాణం వలన పశుపోషణ, పాల సరఫరా, వ్యవసాయదారుని ఆదాయం అభివృద్ధిచెందటానికి ఎంతైనా అవకాశం వుంది.

'షౌ ట్లూ రి'

అయితే యీ బృహత్ప్రణాళికి వ్యవస్థాపనావశ్యకత ఏమిటో, ప్రభుత్వ మెందుకు చేబట్టిందో పరిశీలించవలసిన అవసరం ఎంతయినా వుంది.

పాలల్లో అన్ని విటమిన్లూ వుంటాయి గనుక దేహారోగ్యానికి పాలు సంపూర్ణాహారమని సైన్సు పాఠాల్లో పేర్కొవడం జరిగింది. శరీరాభివృద్ధికీ, ఆరోగ్య పరిపోషణకూ పాలు తగిన ఆహార పదార్థమేనని డాక్టర్లు చెబుతుండడం వింటున్నాము. వయసుతో నిమిత్తం లేకుండా ఏ వయసు వారికైనా పాలు పుష్టికరమైన ఆహారమవుతుందా? కాదా? అసలు పాలను సంపూర్ణాహారమని ఎందుకన్నారు? పాలల్లో ఏయే విటమిన్లు ఏయే నిష్పత్తిలో వున్నాయి? ఈ వివరాలు పరిశీలించి నట్లయితే, పాల వాడకం అవసర మెంత ముఖ్యమో, యీ పాల పథక సరఫరా ఫ్యాక్టరీ నిర్మాణానికి ప్రభుత్వం పూనుకోవడంలోని ప్రాధాన్యతను అర్థంచేసుకోగలుగుతాము.

అన్ని రకాల మనుష్యులకూ, అన్ని వయస్సుల వారికి కూడా పాలు చక్కని పోషక పదార్థం. శరీరాన్ని పోషించడమే కాకుండా, అనారోగ్యాల నుండి కాపాడుతుంది. శక్తి నిస్తుంది. పాలు ద్రవ పదార్థం గనుక అందులో నీ రెక్కువ వుంటుందని కొందరి వాదం. యాపిల్సు,

క్యారట్సు పీచెస్, క్యాబేజి, కాలీ ఫ్లవర్, ఫ్రెంచి బీన్సు, అరటి పళ్ళు, బంగాళా దుంపలు వగైరా లన్నీ ఘన పదార్థాలుగా వుంటాయి గనుక అవి శ్రేయోదాయక మనే వాటూ వుండకపోరు.

నీరు దేనిలో ఎన్ని పాళ్ళు వుంటుందో క్రింది వివరాలను పరిశీలిస్తే అర్థ మవుతుంది.

| | | |
|---|---|---|
| పాలల్లో | నూటికి | 85 పాళ్ళు |
| క్యారెట్సులో | .. | 86 పాళ్ళు |
| ఉల్లిపాయల్లో | .. | 86 8 పాళ్ళు |
| పీచెస్‌లో | .. | 91.4 పాళ్ళు |
| క్యాబేజిలో | .. | 90 పాళ్ళు |
| కాలీ ఫ్లవరులో | .. | 89 పాళ్ళు |
| ఫ్రెంచి బీన్సులో | .. | 91.4 పాళ్ళు |
| అరటి పళ్లలో | .. | 73 నుంచి 79 పాళ్ళు |
| బంగాళా దుంపల్లో | .. | 74.7 పాళ్ళు |

ఈ విధంగా నీరు వుంటుంది.

పాలు కడుపులోకి వెళ్లాక కాఫీ, టీ, లేదా మరో ద్రవ పదార్థంలా ద్రవ పదార్థం గానే వుండిపోదు. గడ్డ కట్టుకు పోతుంది. పై యితర ఆహార పదార్థాల్ని కడుపు నిండేలా తినే కంటే, ఒక గ్లాసెడు పాలు త్రాగేట్లయితే ఎక్కువ దండిగాను, ఎక్కువ పోషకంగానూ వుంటుంది.

ఆయుర్వేద శాస్త్రజ్ఞులు చెప్పేదాని ప్రకారం మనిషి, గోవు, గేదె, మేక, గొఱ్ఱె, ఒంటె, గుఱ్ఱము, ఏనుగు — యీ ఎనిమిదింటి నుంచీ పాలు పొందవచ్చును. వాళ్ళ విశ్వాసం ప్రకారం పుట్టుకనుంచీ పాలు శరీరంలో ఒక భాగమై పోతోంది గనుక అదే అన్ని వయస్సులలోను కూడా శ్రేష్ఠమైనది. యవ్వనాన్ని కలిగిస్తుంది. మనిషిలో తేజస్సు వస్తుంది. మనిషిలో బలాన్నీ, మేధస్సునూ, పెంపు చేస్తుంది చిన్నవారినీ, పెద్దవారినీ, వికలాంగుల్నీ అనారోగ్య పరుల్ని కూడా చక్కగా పోషణ చెయ్య గలుగుతుంది. అలసటనూ, నీరసత్వాన్నీ తగ్గిస్తుంది. శరీరంలోని గాయాల్ని మాన్పు చేస్తుంది. విరిగిన ఎముకలు అతుక్కుని మామూలు స్థితి దాల్చేందుకు దోహదం చేస్తుంది. క్షయ వ్యాధితో వున్న వాళ్ళకూ, పాండు రోగులకూ ఎంతో పుష్టిని కలిగించి, రోగాన్ని క్షీణింపుకు తీసుకొస్తుంది. పాలల్లో తయారయ్యే ఘన పదార్థంలో మాంస కృత్తులు, క్రొవ్వు, పిండి పదార్థములు, ఖనిజ లవణములు, విటమిన్లూ వుంటాయి. ఇందులో మాంస కృత్తులు, పిండి పదార్థాలు, క్రొవ్వు – యీ మూడూ శరీరంలో ఆక్సిజనీకరణం చెంది దేహానికి వలసిన శక్తిని సమకూరుస్తాయి. ఆ శక్తే జీవిత గమనానికి జీవనాడి. ఖనిజ లవణములు, విటమిన్లూ అలాంటి శక్తినైతే యివ్వవు కాని శరీరానికి సంబంధించిన యితరత్రా ధర్మాన్ని నిర్వహింప చేస్తాయి.

ఇక పాలల్లో కూడా భిన్నమైన రీతులున్నాయి. మనిషి పాలలో, జంతు పాలల్లో కంటే మాంస కృత్తులు చాలా తక్కువగా వుంటాయి. మనిషి పాలలో మాంస కృత్తులు ¼ వ వంతు మాత్రమే వుంటాయి. కాని పిండి పదార్థం మాత్రం ఎక్కువగా వుంటుంది. జంతు పాలల్లో మాంస కృత్తులూ, క్రొవ్వు పదార్థమూ ఎక్కువగా వుంటాయి. పిండి పదార్థం తక్కువ. క్రొవ్వు పదార్థాలు ప్రత్యేకించి ఫాలో (Falo milk) పాలల్లో ఎక్కువ.

అందువల్లనే పసిబిడ్డలకు తల్లి పాలు సరిపోనప్పుడు జంతుపాలు యిచ్చే సందర్భంలో కొన్ని నీళ్ళు, కాస్త పంచదార కలపడం ద్వారా వాటిని మనిషి పాలతో సరితూగే స్థాయికి తెచ్చి పసిపిల్లలకు పట్టారు. అంటే మాంస కృత్తులు, క్రొవ్వు పదార్థాల ఎక్కువ స్థాయిని నీళ్ళు కలపడం ద్వారా తగ్గించి అందులో లేని పిండి పదార్థాన్ని పంచదార కలపడం ద్వారా ఎక్కువ చేస్తున్నా రన్న మాట:

పాలు ఘన పదార్థంగా ఏర్పడ్డప్పుడు అందులో మాంసకృత్తు లుంటాయి.

పాలల్లో వుండే ముఖ్యమైన మాంస కృత్తి 'కాజీన్' అనేది. అది దాదాపు 80% వరకూ వుంటుంది. మిగతా 20% న్నూ 'లక్టాల్బుమిన్' అనేది. ఈ 'కాజీన్' అనేది నిమ్మరసంతో కలిసిగాని లేదా యాసిడ్‌తోగాని లేదా అదివరకు తయారై వున్న పెరుగులో ఏ కాస్తతో కలిసినా, పెరుగులా అయిపోయి, 'లక్టాల్బుమిన్'తో విడిపోతుంది. ఈ పెరుగులో 'కాజీన్' ఒక్కటే కాదు. క్రొవ్వూ, క్రొవ్వు కరిగే ఏ. డి. విటమిన్లు కూడా వుంటాయి. అలాగే ఖనిజ లవణాల్లో కరిగిపోయే విటమిన్లు బి. సి. విటమిన్లు కూడా వుంటాయి. అందువలన పాలవలన తయారయ్యే మాంసకృత్తులు, క్రొవ్వులకు పెరుగు ప్రసిద్ధి.

శరీరానికి శక్తి నివ్వడానికి క్రొవ్వు పదార్థం కూడా అవసరమే. అలాగే పిండి పదార్థాలు కూడా.

పాలల్లోని పిండి పదార్థాన్ని – పాల పంచదార లేదా లాక్టోజ్ అని అంటారు. అది కూడా మనం వాడుకునే పంచదార వంటిదే. జీర్ణమైపోయాక అది రక్తంలో కలిసిపోతుంది. అప్పుడు శరీరం లోని గ్రంథులు దాన్ని హరింపచేసి తద్వారా శరీరానికి కావలసిన శక్తిని సమకూరుస్తాయి.

ఖనిజ లవణములు : కాల్సియం : ఫాస్ఫరం, ఇనుము.

పాలల్లో ఎక్కువగా లభ్యమయ్యే ఖనిజ

లవణం కాల్షియం. పిల్లల ఎముకలు, పళ్లు (TEETH) బలిష్ఠంగా వుంచేలా చేసే ఖనిజ లవణం కాల్షియం. పాలల్లో భాస్వరంగాని, ఇనుము గాని, తగినంతగా లేవు. అయితే పాలనుండి అవసరమైనంత కాల్షియం పొందగల్గిన వ్యక్తి తన అవసరాలకు తగినంతభాస్వరం పొందగల్గవచ్చును. అలాగే ఇనుము — కూరగాయలు వగైరాలనుండిపొందవచ్చును.

విటమిన్లు : ముఖ్యమైన విటమిన్లు... క్రొవ్వులో మిళితమై వున్నవేమో ఏ. డి. విటమిన్లూ, నీటిలో కరిగి వున్నవేమో $B_1$, $B_2$, C విటమిన్లూ

A విటమిను జంతు క్రొవ్వులో ఎక్కువగా వుంటుంది. అందువలన పాలల్లో A విటమిను ఎక్కువగానే వుంటుంది. కనుక పాలలో A విటమినుయొక్క బలం- తల్లి తినే ఆహారపదార్థాలమీదా, జంతువులు తినే ఆహారంమీదా ఆధారపడి వుంటుంది.

తల్లులు తాజావి ఆకుపచ్చని కూరగాయలు, ఆకు కూరలు, జంతువులు పచ్చగడ్డి తినే పక్షంలో ఆ పాలల్లో విటమిను A ఎక్కువగా వుంటుంది. ఎందుచేతనంటే ఆ కూరగాయల్లోనూ, పచ్చ గడ్డిలోకూడా A విటమిను తయారయేందుకు అవసరమైన 'కరోటీను' అనే పదార్థం వుంటుంది. అది శరీరంలో విటమిను 'A' గా మార్పుచేయబడుతుంది. పాలను ఎక్కువసేపు కాచినా, లేదా ఒకటికి రెండుమార్లు కాచినా అందులోని విటమిన్లు నశిస్తాయి. అలా కాక ఆ కాయడం వేగిరం అయిపోతే విటమిన్ల నష్టం అంతగా వుండదు. అలాగే పాలు పాత్రలో పోసి సూర్యకిరణాల వేడి ప్రసరించేలా వుంచితే (మూతవేయకుండా) విటమిన్ల నశింపు కొంతవరకు జరుగుతుంది అందువలన డైరీఫారముల నుండి సరఫరా చేసే పాలు తెల్లగ్లాసులలో కాకుండా రంగు గ్లాసులలో సరఫరాచేయడం మంచిది. పచ్చిపాలు కాచాక మీగడ తరక తీసిన పాలు లేదా పాలపొడి వగైరాలు నిల్వ వుంచినప్పటికీ వాటిల్లో విటమిన్లు యధాప్రకారంగానే వుంటాయి.

ఆహారంలో A విటమిను లోటున్నట్లయితే రేచీకటి, చర్మం పొదుబారడం వగైరాలు జరుగుతాయి. గర్భిణీస్త్రీ ఆహారంలో A విటమిను లోటున్నట్లయితే చాలా విపత్తులేర్పడతాయి గర్భకోశంలో వున్న శిశువు పళ్లు (Teeth) ఏర్పడే విషయంలో పెద్ద లోపం ఏర్పడుతుంది. అందువలన గర్భిణీ స్త్రీలు, పసిపిల్లల తల్లులు, లేదా జీర్ణశక్తి లోపించిన యితరులుగాని, అనారోగ్యంతో వున్న చిన్న పిల్లలుగాని, A విటమిను తమకు కావసినంత పొందవలసివుండీ యితర ఆహారం ఏదీ తగినంతగా తీసుకోలేని పక్షంలో పాలైనా ఎక్కువగా వాడటంఅవసరం.

పాలలో A విటమిను వున్నంతగా D విటమిను లేదు. ఈ D విటమిను లేనందువలన (రికెట్సు) ఎముక వ్యాధులు వస్తాయి. తత్ఫలితంగా ఎముకలు కొరికినట్లు, నములుతున్నట్లూ, పిల్లలలో అవయవాలు వంకర్లుపోవడం, అలాగే గర్భిణీ స్త్రీలు, బాలింతరాళ్ళకు వ్రేళ్ళవీ కొంకర్లుపోవడం వగైరా దుర్ఘటనలు ఏర్పడతాయి.

అయితే యీ D విటమిను చర్మంలో Dవిటమినుగా రూపొందేందుకు అనువైన 'ఎర్గోస్టెరల్' అనే పదార్థం సూర్యరశ్మిచే D విటమినుగా తయారింప బడుతుంది. అందుకే ఎండలో స్నానం చేసే తల్లుల పాలలోనూ, అస్తమానం నీడన కట్టివుంచే జంతువులుకాక, ఎండలో పసిరిక మేసే జంతువుల పాలల్లోనూ, యీ D విటమిను ఎక్కువగా వుంటుంది. తగినంత D విటమిను వున్న ఆహారం గర్భిణీ స్త్రీలకు యిచ్చే పక్షంలో అది ఆమె కెంతో మంచి చేయడమేగాక శిశువు పెరుగుదల కెంతయినా వుపయుక్తమవుతుంది. చీకటి కొంపల్లో వుండే స్త్రీలకు, లేదా పరదాల మాటున మెసలే గర్భవతులకు కలిగే పిల్లల్లోనే చాలావరకు ఎముక వ్యాధి (రికెట్సు) వస్తూవుంటుంది. పాలలో D విటమిను కొరతను కాడ్లివర్ ఆయిల్ (చేపనూనె) వాడడము ద్వారా తొలగించుకోవచ్చును కాని కాడ్లివర్ ఆయిల్ ఖర్చుతో కూడిందవడం వల్ల, పేదలకు సూర్యరశ్మి తోడ్పాటుతో Dవిటమినును పొందగల్గడం లాభదాయకం.

పాలను ఆంశంగానే వుంచడంవలనగాని లేదా కాచడంవలనగాని అందులోవుండే D విటమిను నశించదు. డబ్బాపాలు, పాలపొడులుకూడా యీ D విటమినును యధాతథంగానే కలిగివుంటాయి.

ఇంక ముఖ్యమైన విటమిన్లు $B_1$, $B_2$, C అనేవి

$B_1$ విటమిను బెరి బెరీ అనే వ్యాధిరాకుండా నివారిస్తుంది పచ్చిపాలు గానీ, నిలువపాలు గానీ, కాచినపాలు గానీ లేదా తియ్యనిపాలు గానీ, వీటన్నిటిలోనుకూడా B విటమిను యధాతథంగానే వుంటుంది. $B_2$ విటమినుకు దేహారోగ్యాన్ని పోషించడంలో చాలా ప్రాముఖ్యతవుంది. తీసుకునే ఆహారంలో$B_2$ విటమిను లేనట్లయితే నోటి పూత, దవడల లోపలి భాగమంతా పుళ్ళు పడడం, ముక్కుమంట, వెలుతురు చూడలేక పోవడం వగైరా బాధలెన్నో కలుగడమే కాకుండా ఒక విధంగా బలహీనతకూడా కన్పిస్తుంది.

C విటమిను స్కర్వీవ్యాధి రాకుండా కాపాడుతుంది. పాలలో C విటమిను వుండే పాలు చాలాతక్కువ. జంతుపాలలోకన్న మనిషిపాలలో C విటమిను అయిదురెట్లు ఎక్కువవుంటుంది. రాగిపాత్రల్లో పాలుగానీ, పాలతో తయారుచేసే యితర పదార్థాలుగానీ నిల్వ వుంచేట్లయితే, అందులో వుండే C విటమినుకాస్తా హరించుకుపోతుంది. అలాగే వేడి తగిలినాను. పాలు వేడిచేసినా లేదా పచ్చిపాలు నిల్వవుంచినా C విటమిను నష్టపోవడం జరుగుతుంది. పిల్లలకు కాచిన పాలుగానీ, లేదా డబ్బాపాలుగానీ పట్టి, పెంచడంచేసే పక్షంలో C విటమినుకొరత లేకుండా వుండేటందుకు పళ్ళరసంకూడా త్రాగించడంమంచిది విటమిను C తక్కువైతే

మిగతా (25 వ పేజీలో)

# వ్యామోహ



ఆ విషయం ఉన్నట్టుండి వూరంతా గప్పుమంది ఇంతింతై, వటువింతై, ఒహావింతై ప్రచారమయింది. ఎవరి నోట విన్నా, ఎవరిచేత కన్నా, వినిపించేదీ, కనిపించేదీ ఆ వింతే। ఎలా జరిగిందన్నారు కొందరు అలాగే జరుగుతుందన్నారు కొందరు మనిషికీ మనిషికీ మధ్య ఎంతో అంతరం వున్నా సృష్టిలో ఎంత వింత జరిగినా అబ్బురపడవలసిన విషయం ఏమీకాదు. కానీ వూరూ వాడా కోడై కూస్తున్నా చెవులుండి వినలేనివాళ్ళు, కళ్ళుండి చూడలేని

కథానిక

డి. రామసుబ్బమ్మ

వాళ్లూ, తాము చేసింది తప్పేమీ కాదన్నట్లు తప్పుకు తిరుగుతుంటారు లోకం కోడై కూసినా నిద్రమత్తులో, కళ్ళు మూతలుపడి, చెవులు దిబ్బెళ్ళెత్తి, నాలిక పిడచకట్టుకుపోయిన వ్యక్తిమాత్రం అదంతా నా కేమీ తెలియదన్నట్లు ఊగుతూనే వుంటాడు

ఈ వింత జరిగి ఇప్పటికి చాలాకాలమయింది ఆంధ్రదేశంలో అనాహతంగా, అడ్డాలు, ఆటంకాలు లేకుండా, ఉన్నా తొలగించుకొంటూ, రెడ్డి రాజులు పరిపాలన సాగిస్తున్న రోజులవి। భయంకరమైన

చీకట్లు తొలగించాలని, శక్తి సామర్థ్యాలు పంచిపెడుతున్న మిణుగురు పురుగులు మిల మిల లాడుతున్న గడియలవి!

ఆనాట ఆంధ్రదేశం అనంత భోగ భాగ్యాలతో తులతూగుతూవుంటే, ఆ సంపదే తాము అనుభవించాలని ఆరాటపడిన-ఎందరో మహానుభావులు — కొందరు ఆర్తులు చూచారు. అందులో ముఖ్యంగా చెప్పుకో వలసింది ఇద్దరువ్యక్తుల్నే! అయితే మూడో వ్యక్తి పానకంలో పుడకలాగా, నిక్కి చూడక తప్పదు. ఆ పుడకే ముక్కుపుడకై ముక్కుపుడకే ముఖమంతా అయి, ఆ ముఖమే, మూర్తి అంతా అయి, ముగ్గురూ ఏకమై, మూడు చెరువుల నీళ్ళు త్రాగి, తల మునకలయిందాకా తైతక్కలాడారు.

బ్రహ్మాజీరావు, పేరుకు తగ్గట్టుగా పరబ్రహ్మ స్వరూపం మాత్రంకాదు. నిద్ర పోయి లేచిన మనిషి కళ్ళు నులుముకుంటూ వుంటే ఎలా వుంటాడో, అతనూ అంతే! ఏడ్చినట్లుముఖం లేకపోయినా, ఏడ్చి ముఖం కడుకున్నట్లుగా వుంటుంది. భారీ విగ్రహం అనిచెప్పకపోయినా, పొట్టివాడు అనలేం. అచ్చం గుమ్మడికాయలాగా వుంటాడు. వదనంలో శాంతం కనిపింప చేయాలని తహతహ వున్నా, స్వతస్సిద్ధంగా కళ్ళల్లో నిప్పులమూటలు, మనిషిక్రూరత్వం కనబడుతుంది. అతన్ని వూళ్ళోవాళ్ళందరూ అనేట్లుగా, అందరికీతెలిసేట్టుగా ఒకే ఒక్క మాట అది జుట్టుపోలిగాడు అంటేనే తెలుస్తుంది.

రామమ్మ, ఆమెసన్నగా,జొన్నాకులాగా, పచ్చగా, మామిడికాయకుమల్లే. వంకరగా, మెరుపుతీగల్లే, నిటారుగా బంగారుకడ్డీలాగా వుంటుంది. ఉన్నామె ఉన్నట్టు ఉండక, వుండుండి ఉత్తిత్తిపనిలో పాలుపంచుకొంది. అందుకే చరిత్రకెక్కింది. ఆమెను పల్లెలో వున్న పిల్లకారు, పిల్లప్పుడు పద్మినీ వగైరా పదాలతోకాక వేరే పదాలతో పిలుస్తూవుండే వాళ్ళు. స్త్రీ జాతిలో వుండే వివిధజాతుల్ని గుర్తుకుతెచ్చుకొని. ఆమెకు పరపురుషుడి మీద వ్యామోహంలేదని ఎవరూ చెప్పలేరు. కాని చిన్నప్పుడే పెళ్ళయి, పెళ్ళయిం తరువాత భర్తగారి జయిల్ ఖానా అయిన జనానాలో వుండటంతో అవకాశం కుంచితమయి పోయింది. ఆమె నందరూ బంగారక్కా అంటూవుండేవారు.

ఇక కేతిగాడి విషయం ముఖ్యం. అతన్ని చాలామంది నక్కలాంటివాడు అంటారు. నక్కజిత్తులన్నీ నాదగ్గరుండగా తప్పించుకు పోతుందా తాబేటిబుర్ర అనే పాటం. ఆపాటం పాటాగాపెట్టి, ఏతాం ఎత్తి, పుర్రచేతితో పురాణంచెప్పే పరమ భాగవతోత్తముడు. ఏ సమయానికామాట చెప్పి, తప్పించుకు తిరుగు ధన్యుడయిన సుమతి! పిల్లికి చిక్కానికీ ఒకటే మంత్రం కాకపోయినా, దాదాపు అటువంటిదే వేరువేరు రూపాలలో చూపించగల నేర్పరి. మనిషి ఆకార రూపురేఖా లావణ్యాదులు చూచి అందాలరాశి అందామంటే ముఖంలో దెయ్యాలూ భూతాలూ నృత్య, నృత్త నాట్యలాస్యాదులుచేస్తూ వేడుకగా కాపురముంటాయి. అతన్ని నీలాద్రిరావు అంటే తెలయని వాళ్ళతో కేతిగాడు అని చెబితే 'ఆ! వాడా' అంటారు.

ఒక ఒప్పో, తప్పో, చేయగలవాడు, దాన్నే మంచో చెడో తెలుసుకో గలుగుతాడు. అది మధ్యేవిధానం. మంచి నిర్వహించగలవాడు చెడ్డ దూరంగా వుంచగలుగుతాడు. చెడ్డమార్గంలో పరిగెత్తేటప్పుడు మంచి తెలుసుకోలేడు అంటాడు, బ్రహ్మాజీరావు, ఉరఫ్ జుట్టుపోలిగాడు.

జీవితం హాయిగా, అమరంగా, మహోన్నతంగా, సాగాలని కోరే లక్షలాది క్షుద్రజీవుల శీలం తుచ్ఛంగా తృణీకరించగలిగిన సౌజన్యశాలి సదా లక్షతప్పులతో, తప్పుల తడక జీవితంతో, జీవితంకోసం, మానవ సంగ్రామ జూదంలో శీలం పందెం కాయగలుగుతాడు అంటుంది రామమ్మ ఉరఫ్ బంగారక్క.

మంచిని మంచితోను, చెడ్డను చెడ్డతోను జయించాలన్నది పాత సిద్ధాంతమయితే మంచిని చెడ్డతోను, చెడ్డను మంచితోను, పశువును మనిషితోనూ, మనిషిని పశువుతో గోల్ మాల్ చేసి జయించవచ్చునేది అత్యంతానందకర నూత్న సిద్ధాంతం. యుక్తేశక్తీ, శక్తేయుక్తీ; యుక్తి ఉన్ననక్క, శక్తివున్న దేవుడూ ఒకటే నంటాడు నీలాద్రిరావు ఉరఫ్ కేతిగాడు.

ఎవరిగురించి అయినా ఏ విషయమయినా ప్రచారం కావటానికి — మంచి అయినా చెడ్డ అయినా ఆ వ్యక్తులూ, ఆ విషయంమీద ఆధారపడి వుంటుంది. పై ముగ్గురినిగురించి ప్రజలలో ఆ పేర్లే ప్రచారంలో ఉండటానికి వాళ్ళ జీవితాలే ప్రతిబింబాలు.

రావు మంచి భూవసతివున్న రైతు. రాగులూ, సజ్జలూ, కొర్రలూ, జొన్నలూ బాగాపండే పొలం చాలావుంది. పల్లెజనం, బీదా, బిక్కి, చెమటతో భూమితడిపి, పంటలు పండించి, ధాన్యం ఇంటికి చేర్చితే కాలుమీద కాలేసుకొని, నోట్లో వేలేసుకొని, కడుపులో చల్ల కదలకుండా కాలక్షేపం చేసేవాడురావు. పొలాన పండినధాన్యం, సావిట్లో పశువులు పల్లెలోజనం అంతా అతనికి ఒకేవిధంగా కనిపించే దృశ్యాలు. బావులక్రింద పొలాల్లో తోటలు పెరిగి, ఆస్తిపెరుగుతూవుండిచెరువు క్రింద పొలాలు వరిపైరు అందిస్తూవుండగా, అంతులేని, అనంతమయిన ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగించటంతో కళ్ళకుపొరకప్పి,

ఇహమూ, పరమూ కనిపించక, విచక్షణా జ్ఞానం నశించిపోయింది.

ఒకనాడు ఒక పడుచుఅమ్మాయి రావు ఇంటికి వచ్చింది. ఆమె ఆ వూరికి కొత్త కోడలు! కాపురానికి వచ్చి ఆరు నెలలు కూడా కాలేదు. వచ్చి, తనభర్త కాలూచేయీ పడిపోయాయని, మంచమ్మీదే పడివుంటున్నాడని, అత్త క్షయతో క్షీణించి పోయిందని రెండు నెలల్క్రితమే మామ మరణించాడనీ, తనకు బంధువులెవరూ లేరనీ, భుక్తికి ఏమీ లేదనీ ఆదరించమనీ బ్రతిమాలుకుంది. ఆయనకు వెంటనే ఆరునెలల క్రిందట విషయం గుర్తుకువచ్చింది. పెళ్ళయి అత్తవారింటికి వచ్చిన కోడలుగానీ, అత్తవారింటికి పోతున్న ఆడపడుచుగానీ, రావుఇంట్లో ఒక రాత్రి నిద్రచేయాలన్న నీతినియమాలు ఆ వూర్లో అందరికీ తెలుసు! తెలిసితెలిసి, బ్రతుకుతెరువుకోసం, ఆ వూళ్ళో వుండటం కోసం ఆ వూరంతా ఆయనదే కావటంతో ఎంతబాధవున్నా ఎవరూ తిరస్కరించిగాని, తిరస్కరించి బ్రతికిగాని లేరనేదిసత్యం!

కానీ తిరస్కరించిన ఈ కొత్త కోడలు బ్రతికే వుందనేది ఎందుకో వూరంతా పొగ లాగా క్రమ్మింది. ఎవరూ కారణం వూహించుకో లేకపోయారు. ఆడవాళ్ళు కొందరు ఆమెను మెచ్చుకొన్నారు. కొందరు దూషించారు. కాని చిన్నాపెద్దా భేదంలేకుండా మగవాళ్ళు అందరూ సంతోషించారు. ఎవరూ సంతోషం పైకి చెప్పుకోలేదు, చెప్పుకుంటే ముప్పుకాబట్టి.

మామ చనిపోవటంతో భర్తకు పక్షవాతం రావటంతో చేతబడి చేయించాడు రావు అని అందరూ కాకపోయినా కొందరనుకొన్నారు. చాలామంది విశ్వసించారు. అత్తకు క్షయ రావటానికిమాత్రం అంతు చిక్కలేదు.

అంతా గుర్తుతెచ్చుకొన్నరావు ప్రశాంత గంభీరంగా 'ఏమన్నావ్' అన్నాడు.

మళ్ళీ తన గోడంతా చెప్పుకొంది.

'అయితే ఏం చేయమంటావు' అన్నాడు.

'గంజికిగింజలు లేవు' అని తన పరిస్థితినే వివరించింది.

'అయితే ఇలారా.

ఆమె బెదురుతూవుంది.

'రమ్మన్నప్పుడు రావాలి కొండమీద కోతైనా, కొండ ముచ్చయినా' అన్నాడు.

ఆమె రెండడుగులు ముందుకు వేసింది.

అంతలో లోపలినుంచి అతని భార్య రామమ్మ వచ్చింది. రామమ్మను చూచి వూరూపేరులేని కొత్తకోడలు మొదట ఎందుకో బెదిరింది. వెంటనే తెచ్చి పెట్టుకున్న కంచుకోటలాంటి వూహతో సంతోషించింది.

భార్య రామమ్మతో బ్రహ్మజీరావు యువతిని చూపించి ధాన్యము కొలపించమని చెప్పాడు. ఆమె 'అలాగే' అంది. లోనికి తీసుకెళ్ళి 'కూర్చో' అంది. యువతి కూర్చుంది. 'పనివాడిని పిలుస్తానుండు' అంటూ రామమ్మబయటకుపోతూ తలుపు బయట గొళ్ళెంపెట్టింది.

యువతి కూర్చునేవుంది. ఆమెకుదిక్కు తెలియకుండా అంతా అయోమయంగా యేదో భీతిగావుంది. చుట్టూచూస్తే అందంగా పడక జిలుగుల సుగంధాలూ విచిత్రమయిన చిత్రాలు అదో వింత వాతావరణం కనిపించింది. ఆమె భయంకర మూర్ఛతను శంకించింది. ఆమె తలుపు తీసుకొని బయట పడదామని చూస్తే బయట గొళ్ళెం పెట్టిందని తెలిసింది. అంతలో వీపుమీద ఎవ్వరో చరిచినట్లుగా అనిపించి వెనక్కి తిరిగిచూస్తే ఏమీలేదు. తలుపుతీసిన శబ్దమై తలుపుదిక్కు చూస్తే రావు నవ్వుముఖంతో వస్తున్నాడు.

ఆమెకు అంతా అర్థమై నోరెత్తి అరవబోతే నోటిమీదే చెయ్యివేసి తలుపు గడేశాడు.

తలుపు తీసింతరువాత ఆమె నెత్తినోరు బాదుకుంటూ పడుతూలేస్తూ దెబ్బతిన్న పాతి వ్రత్యంలాగా ఇంటికిపోయింది. భర్త గుండె మీదపడి వలవల ఏడుస్తూ గిజగిజా తన్నుకుంటూ జరిగిందంతా చెప్పింది.

పక్షవాతంతో బాధపడుతున్న భర్త భగవంతుడే అనుగ్రహించాడా అన్నట్టుగా ఆగ్రహంతో లేచి తడబడే కాళ్ళతో భార్యను వూతగా తీసుకొని కోటకేసి నడిచాడు. తలుపు నెట్టుకొని తూలుతూ రావును సమీపించాడు. చేతిలో కత్తితో భార్య అండగా ఇంటిలోకి వచ్చిన అతన్ని చూచిన రావు చప్పట్లుకొట్టాడు. అప్పటికే మీదికిపోయి కత్తి ఎత్తిన యువకుడు పెళ్ళాం అరుపుకు వెనక్కు చూడగానే గుండెల్లో కత్తి దిగిపోయింది. అక్కడే మరణించాడు. ఆపైన పదిరోజుల్లో యువతి చనిపోయింది అనే కంటే చంపబడింది అంటే ధర్మంగా వుంటుంది.

ఆ వూళ్ళో బ్రతికివున్న ఆడవాళ్ళు బ్రతుకుకోసం పవిత్రతని కోల్పోయినవాళ్ళే! తన హయాంలో తనకు లొంగని స్త్రీలేదు! లొంగనివాళ్ళు చనిపోయివుంటారు. కాలం తీరి యువతులా వూరిలో చనిపోలేదు. కర్మంకాలి చనిపోయారు.

బ్రహ్మజీరావు వ్యభిచారానికే కాదు హత్యలకు అధినేత. రావు చేయించని దొంగతనము, దోపిడీలు, హత్యలూ ఆనాటి చరిత్రలో ఆ ప్రాంతంలోలేవు. అయితే అడిగే దిక్కూదివాణంలేక, అరాచకం చలామణీ అవుతూవుంది.

ఖజానాలో మూలుగుతున్న డబ్బు బీద సాదల చెమట అని రావుకితెలియకపోలేదు. తెలిసి ఏంచేశాడు అంటే ధర్మసత్రాలు

కట్టించాడు. అన్నదానాలు చేశాడు - అందరు పైకి గొప్పవాడు అంటారు, గుండెల్లో రగిలే పొగలలోపల.

డబ్బున్నవాడు ఇంకా సంపాదించాలి అనుకొంటాడు. లేనివాడు బ్రతికేతీరు వెతుక్కొంటాడు. అందరికీ ఈ జీవితంలో ఆనందం అందుకోవాలనే ఆశ ; అన్యత్ర మాత్రం ఆలోచించుకోరు. అధికారం సంపాదించుకోటానికి అనేకమార్గాలు చూస్తారు. కుట్రలు చేస్తారు, కళ్లుమూపుతారు, మోసాలు చేస్తారు, విభజిస్తారు, పరిపాలిస్తారు. సాలెగూడుగా రూపొందిన రావు ప్రభువే కావాలని ప్రయత్నించిన తీరు, తీరుతెన్నులులేని ముళ్ళపొద. ఎవరుహర్షించలేని, ఎవరూవూహించలేని అసందర్భనిధానం విధివిధానంలాగా జరిగిపోయింది. ప్రభుత్వ విస్తీర్ణంలో అనేక సంస్థానాలలో అది ఒక పెద్ద సంస్థానము. అధీశుడు నీలాద్రిరావు. బ్రహ్మాజీరావుకి ఆ సంస్థానాధిపతి కావాలని ఆశ కలిగింది. అయితే అడినెర వేరేమార్గం మాత్రం చాలాకాలం వరకు బోధపడలేదు. ఎన్నో ఆలోచించి ఒక నిర్ణయం చేసుకొని మంచి ముహూర్తం చూచి నీలాద్రిరావు దగ్గరకు పోయాడు. నీలాద్రిరావుకు ఆడవాళ్ళంటే మమకారమేకాదు, కళ్ళు కన్పించవని, ఒళ్ళు తెలియదని విన్నాడు. విన్నది కళ్ళారా చూశాడు. చూసిన తక్షణమే తన కోటకు ఆహ్వానించాడు. ఆహ్వానం అందుకోవటంతో అందెవేసిన చెయ్యి అయిన నీలాద్రిరావు నిప్పున్న పశంగా బయలుదేరాడు.

కాలం కర్మం కలిసిరాక కాంక్షమత్తు నేత్రాలతో వున్న రామమ్మ, చాలాకాలం నుంచి నీలాద్రిరావు రసికత వేనోళ్ళ వింటున్న రామమ్మ భర్త అండదండలు ఆదరువుగా తీసుకొని అతిధిగా వచ్చిన వ్యక్తిని తగు విధంగా సత్కరించింది. అందాల బొమ్మ ఒప్పుల కుప్ప, ఒయారిభామ అయిన రామమ్మ సౌందర్య లహరిలో తలమునకలై నీలాద్రిరావు కోటలో పాగా వేశాడు. వున్నట్టుండి ఈ వార్త నీలాద్రిరావు భార్యకు తెలిసి పల్లకిలో పొరుగూరు వచ్చి బ్రహ్మాజీరావు ఇంట్లో అయన భార్యతో కేళీవిలాసాలతో మునిగి తేలుతున్న భర్తను చూసి ఆడదాని కిదేంబుద్ధి అనుకొని మూలనున్న చీపురుకట్ట తీసుకొని రామమ్మను ఆపాదమస్తకం దులిపేసింది. భర్తకే లోబడి వుండే ఆమె నీలాద్రిరావు కసురుకోగానే తిరిగి స్వసంస్థానానికి వెళ్ళింది.

కోటీశ్వరుడితో మంతనాలాడి వ్యవహారం నడిపించింది రామమ్మ. ఒక శుభ సమయంలో అధికార ముద్ర వేయించింది. ఆక్కడితో నీలాద్రిరావు సంస్థానానికి బ్రహ్మాజీరావు సర్వాధికారి అయ్యాడు.

సంగతి సందర్భాలు తెలుసుకొన్న జనం ముక్కుమీద వేలువేసుకొని వేలున్నచెయ్యి నోటికి అడ్డంగా వుండటంతో నోటి మాట లేక బ్రమానులై పోయి అవ్యవస్థస్థితిలో పడిపోయారు.

పాపంపండినా, బెలూన్ నిండినా వున్నట్టుండి టప్పుమంటుంది. బ్రహ్మాజీరావు సంస్థాన సింహాసనం అధిష్ఠించినా మునుపటి అధీశుడు బ్రతికే వుండటంతో సర్వాధికారం నామమాత్రమేకాని నిజంగా కాకపోయింది. ఆ త్రిశంకు స్వర్గంలో బ్రహ్మాజీరావుకి తలక్రిందులుగా గబ్బిలం బ్రతుకై పోయింది.

కాలం కలిసివస్తే తోక ఆడించాలని బ్రహ్మాజీరావు చూడకపోలేదు. అయితే అలాటి వ్యవహారాలు స్పష్టంగా తెలిసిన నీలాద్రిరావు మత్తు వదల్చుకొని ముందు వెనుకలు చూసుకొని కర్తవ్యోన్ముఖుడయ్యాడు. నాలుగోనాటికే బ్రహ్మాజీరావుని పదభ్రష్టుణ్ణి చేసి మహా ప్రస్థానానికి పంపించాడు. సంస్థానము దక్కక భార్య శీలం మిగలక జీవితంలో శాంతి గిల్లంతైన బ్రహ్మాజీరావు చుట్టుప్రక్కల పాలెగాళ్ళని సంస్థానాధిపతుల్ని పురికొల్పాడు. అంతః కలహాలు ప్రారంభమయ్యాయి. అది అదను చూసుకొని పరాయిరాజు దండెత్తి వచ్చాడు. సంస్థానాలు కూలిపోయాయి. ఆ సంగ్రామంలో నీలాద్రిరావు, బ్రహ్మాజీరావు హతులయ్యారు. రామమ్మతో జనానాలో అందరూ అగ్నికి ఆహుతయ్యారు.

వాళ్ళు ముగ్గురూ పెట్టిన భిక్షే నాటినుండీ వస్తున్న తోలుబొమ్మలాటలో జుట్టుపోలిగాడు, బంగారక్క, కేతిగాడు అనే మాటలే కాదు, పాత్రలఏర్పాటు.

ఇప్పటికీ ఆ వూరు నడివీధిలో వెలిసి వున్న మూడు శిలా విగ్రహాలమీద వూళ్ళో బాలాది వృద్ధులు కారణం తెలియకుండానే వుమ్మి వేసిపోవటం ఆచారమయింది.

---

(20 వ పేజీ తరువాయి)

స్కర్వీవ్యాధి, పాండురోగము, పల్లుకదిలిపోవటం వగైరా అరిష్టాలు కలుగుతాయి.

మీగడ కలవని పాలలో తయారైన పాల పొడిలో మాంసకృత్తులు, పిండి పదార్థం, ఖనిజలవణములు చాలా ఎక్కువగా వుంటాయి. ఈ పాలపొడి వాడకం సర్వ విధాలా సమర్థనీయమైనది.

మన పాఠశాలల్లో పేదవిద్యార్థులకు సరఫరాచేసే నిమిత్తం మనకు విదేశాలనుంచి యీ పాలపొడి చాలా సప్లయి అవుతోంది.

పాశ్చ్యురైజేషన్ పాలు: పాలను పదిహేను సెకండ్లసేపు 161° (ఫారన్‌హీటు)ల వరకు వేడిచేసి, తరువాత 49°ల (ఫారన్‌హీటు)కు చల్లార్చగా ఏర్పడే పాలను పాశ్చ్యురైజేషన్ పాలు అంటారు. వీటిని సీసాలలో నిల్వచేస్తారు. త్రాగడానికి యీ పాలు చాలా శ్రేష్ఠమైనవి. పిల్లలకైతే మాత్రం సీసా తెరిచాక, మళ్ళీ ఆ పాలను వేడిచేసి, ఆ తర్వాత త్రాగించడం మంచిది.

సహజంగా, పాలవల్ల లభ్యమయ్యే శక్తిని కెలరీల ప్రమాణంలో గణించడం జరుగుతుంది. కెలరీ అంటే ఒక కిలోగ్రాము (అంటే 2.2 పౌను). నీటిని సున్నడిగ్రీల సెంటిగ్రేడ్ వుష్ణోగ్రతనుండి 1° సెంటీగ్రేడ్‌కు వుష్ణోగ్రత పెరగడానికి అవసరమైన వేడిని ఒకకెలరీ అని ప్రమాణంగా పరిగణిస్తారు. ఒక కెలరీ పాలయొక్క విలువ ఆపాలు లభ్యమయ్యే తీరునుబట్టి, ఆ కెలరీయొక్క ప్రయోజనం — వ్యక్తియొక్క వయస్సు, బరువు, చేసే పని, ఆ వ్యక్తియొక్క దేహ సౌష్ఠవాన్నిబట్టి వుంటూ వుంటుంది.

ఒక ఔన్సు మనిషిపాలలో 20 కెలరీల శక్తి వుంటుంది. అంటే ఒకపౌను పాలలో 320 కెలరీలశక్తి వుంటుం దనేది స్పష్టం. రెండుమాసాల పసిబిడ్డకు తల్లి పాలమీదనే ఆధారపడటమయితే రోజుకు 20 ఔన్సుల పాలు కావలసి వుంటుంది, లేదా 1¼ పౌన్లు; అంటే రమారమి 400 కెలరీల శక్తి అవసరమన్నమాట. తొమ్మిదిమాసాల బిడ్డకయితే రోజుకు 750 కెలరీలశక్తి అవసరమవుతుంది. తల్లిపాలు 30 ఔన్సులకు మించివుండటం కష్టం గనుక పిల్లవాడికి పాలురూపంలో తక్కువయ్యే లోటును ఏదో ఘనపదార్థం (సాధారణంగా అన్నం పెట్టడం చేస్తుంటారు) పెట్టడం ద్వారా భర్తీచేస్తారు. ఏ పాలలో ఎంతెంత శక్తి వుంటుందో క్రింది వివరాలు స్పష్టీకరిస్తాయి.

| పరిమాణం : | పాలు : | శక్తి (కెలరీలలో) |
|---|---|---|
| ఒక పౌను | గేదె | 528 .. |
| .. | ఆవు | 288 .. |
| .. | మేక | 384 .. |
| .. | పెరుగులో | 224 .. |
| .. | డాబ్బాపాలలో | 128 .. |
| .. | పాలపొడిలో | 1616 .. |

వుంటాయి.

నాలుగైదు సంవత్సరాల బిడ్డకు రోజుకు కావలసిన కెలరీల సంఖ్య 1000. అతనికి అర్ధరోజుకు సరిపడే కెలరీలను ఒక పౌను గేదెపాలు, ¾ వ పౌను ఆవుపాలు త్రాగడం ద్వారా సమకూర్చుకోవచ్చును. మిగతా అర్ధ రోజుకు కావలసిన కెలరీలను యితరత్రా పదార్థాలు తినిపొందవచ్చును.

అదే యువకుడికైతే 2600 కెలరీలు కావలసివుంటుంది. యువతికి 2100 కెలరీలు కావాలి. అదే గర్భిణీ స్త్రీలకుగాని లేదా, పసిపిల్లల తల్లులకుగాని అయితే, మరింకా ఎక్కువ కెలరీలు కావలసి వుంటుంది.

అయితే జంతుపాలు ఎక్కువ త్రాగడం వల్ల అనారోగ్యానికి దారితీసే ప్రమాదమూ లేకపోలేదు. జంతువుపాలు ఎక్కువ త్రాగినప్పుడు, క్రొవ్వు ఎక్కువగా చేరి, తత్పర్యవసానంగా 'కార్నొరీత్రాంబైసిస్' అనే వ్యాధి రావడానికి అవకాశముందనేది సాధారణ అభిప్రాయం. గుండెకు సంబంధించిన రక్తనాళాల్లో రక్తం గడ్డకట్టుకు పోవడం వలన, యిది ఆ క్రొవ్వువలనేనని — అందువలన — ఆ పాలు త్రాగడానికి ఎక్కువమంది యిష్టపడరు

కాని నిజానికి శాస్త్రజ్ఞుల పరిశోధనలవల్ల, పరిశీలనలవల్ల తేలిందేమిటంటే రోజూ తగినంత వ్యాయామంగాని, లేదా తగిన శ్రమగాని చెయ్యకపోవడంవల్లనే ఆ వ్యాధి రావడానికి అవకాశం వుందిగాని జంతుపాలల్లో వుండే క్రొవ్వుమాత్రం ప్రధానకారణం కాదు.

దీన్నిబట్టి ప్రధానంగా తేలేదేమిటంటే, పాలు అన్నివిధాలా అన్నివేళలా, అన్ని వయస్సుల్లో వున్నవారికీ కూడా చక్కని పోషక పదార్థమనీ, అన్ని తరహాలవారికి కూడా సంపూర్ణాహారమనీ, పుష్టికర ఆహారమనీ తేలుతోంది. అది పసిబిడ్డకెంత వుపయుక్తమో, పండుముసలివానికి అంతే ఉపయోగం. వికలాంగునికీ రోగగ్రస్తుడి కెంత ప్రయోజనకారో, యవ్వనవంతునికీ, క్రీడాకారుడికీ అంతే ప్రయోజనకారి.

ఈ ప్రాముఖ్యతను గుర్తెరిగిన బాధ్యతాయుత సంస్థలూ, కొన్ని కార్పొరేషనుల వారు తమ ఆధ్వర్యంలో వున్న విద్యార్థులకు పాలను ఉచితంగా సప్లయిచేస్తుండటం గమనార్హం. అలాంటి సేవే నిరుపేదలైన — గర్భిణీస్త్రీలకు, పసిపిల్లల తల్లులకు క్షయవ్యాధి గ్రస్తులైన రోగులకుకూడా వ్యాపింపచేస్తే అదే మాధవ సేవగా పరిగణింపవచ్చును.

మన ప్రభుత్వంకూడా యీ ప్రాముఖ్యతను గుర్తించే పాలసరఫరా పథకఫ్యాక్టరీ నిర్మాణానికి పూనుకుంది. ఈ ఫ్యాక్టరీ నిర్మాణంవలన పశుపోషణ, పాలసరఫరా, వ్యవసాయదారుని ఆదాయం అభివృద్ధి చెందటానికి ఎంతైనా అవకాశముంది. ఈ ఫ్యాక్టరీ నిర్మాణంవలన సరైనపాలుదొరక్క పట్టణాలవారు పడేబాధలు తొలగిపోగలవు. దీన్ని సక్రమంగా నిర్వహించడం ద్వారా సద్వినియోగం చేసుకుంటే మంచిపాలు తత్సంబంధమైన యితర పదార్థాలు విరివిగా ప్రజలకుచౌకగా సప్లయిచేయడానికి వీలుంది.

ఇక సమృద్ధిగల పశుపోషణ, పశువైద్యం, బర్రెపాడి, ఆవుపాడి పెరుగుదలకు, ఆ విశిష్టగుణసంపదను ప్రజలకు దక్కింపచెయ్యడం ప్రథమకర్తవ్యంగా సంక్షేమసంఘాలు నిర్వర్తించవలసిన కర్తవ్యం.

★

# సింథటిక్ మందుల కర్మాగారం

హైదరాబాదులో నెలకొల్పబడుతున్న సింథటిక్ మందుల కర్మాగారంఏటా 850 టన్నుల సింథటిక్ మందులను, 4560 టన్నుల ఇతర ఔషధాలను ఉత్పత్తిచేయ గలుగుతుంది. వీటి విలువ సుమారు రూ. 8 కోట్లు వుంటుంది. ఈ పథకానికి సుమారు రూ. 20 కోట్లు ఖర్చవుతాయి. ఈ వ్యయంలో సిబ్బంది వసతిగృహాల నిర్మాణానికి అయ్యేఖర్చుకూడా చేరివుంది. ఇందుకు రూ. 2½ కోట్లు ఖర్చవుతాయని అంచనా.

ప్రాజెక్టు పైలట్ ప్లాంట్ బ్లాకు, ప్రయోగశాల భవనానికి రసాయనికాలు, పెట్రోలియం శాఖల కేంద్ర సహాయమంత్రి గత మే నెలలో శంకుస్థాపన చేశారు.

భారతదేశంలో ఈ శతాబ్దారంభంలోనే ఫార్మసుటికల్ పరిశ్రమ ప్రారంభించబడింది. మొదటి 50 సంవత్సరాలలో ఈ పరిశ్రమ పురోగతి మందకొడిగా సాగింది. స్వాతంత్ర్యానంతరం ప్రథమ ప్రణాళికా కాలంలో దీని అభివృద్ధికి తగుమాత్రం ప్రాధాన్యత లభించింది. పింప్రీలో పెన్సిలిన్ ఫ్యాక్టరీని, ఢిల్లీలో డి. డి. టి. ఫ్యాక్టరీని నెలకొల్పడంద్వారాభారతప్రభుత్వం దీనిఅభివృద్ధికి ప్రత్యక్షంగా దోహదంచేసింది.

ప్రథమ పారిశ్రామిక విధానపు తీర్మానంలో భారతప్రభుత్వం, జాతీయ ప్రాముఖ్యతగల 18 పరిశ్రమలలో ఒకటిగా ఫార్మసుటికల్ పరిశ్రమనుకూడా చేర్చింది. ఈ పరిశ్రమ భవిష్యదాభివృద్ధికై తీసుకోవలసిన విభిన్నాంశాలను పరిశీలించే నిమిత్తం ప్రభుత్వం 1953వ సంవత్సరంలో ఫార్మసుటికల్ విచారణా సంఘాన్నొకదానిని నెలకొల్పింది. ఈ సంఘంవారు అనేక అత్యవసర ఔషధాలకుగల గిరాకీని మదింపుచేసి, ఆరోగ్యవంతమైన పద్ధతులలో ఈ పరిశ్రమను శీఘ్రంగా అభివృద్ధి చేయడానికిగాను తీసుకోవలసిన చర్యలను సూచించారు. ప్రభుత్వం కనబరిచిన శ్రద్ధాసక్తులవల్లా, పెట్టుబడిదార్ల కృషిమూలంగా ఈ పరిశ్రమ రెండు ప్రణాళికా కాలాలలో సత్వరాభివృద్ధిని సాధించగలిగింది.

ఈ పరిశ్రమ ప్రైవేటురంగంలో శీఘ్రంగా అభివృద్ధి జెందుతున్నప్పటికీ ముఖ్యమైన అనేక ఔషధాల విషయంలో దేశం ఇంకా స్వయంసమృద్ధం కాలేదనే అభిప్రాయం వుంది. అందుచేత అత్యవసరమైన ఔషధాలు, శస్త్రచికిత్సా సాధనాల ఉత్పత్తికై, సోవియట్ యూనియన్ సహాయంతో ప్రభుత్వరంగంలో నాలుగు సంస్థలను నెలకొల్పడానికి 1959వ సంవత్సరంలోనే భారత ప్రభుత్వం నిశ్చయించింది. భారత ప్రభుత్వసంస్థ అయిన ఇండియన్ డ్రగ్స్ ఫార్మసుటికల్స్ లిమిటెడ్ ఆధ్వర్యంక్రింద (1) హైదరాబాదులో సింథటిక్ మందుల కర్మాగారాన్నీ, (2) హృషీకేశ్‌లో అంటీబయాటిక్స్ ఫ్యాక్టరీనీ, (3) నెరియమంగళం (కేరళ)లో ఫైటోకెమికల్స్ ఫ్యాక్టరీనీ, (4) మద్రాసులో శస్త్రచికిత్సా పరికరాల యంత్రాగారాన్నీ నెలకొల్పే విషయంలో సోవియట్ యూనియన్‌లోని మెసర్స్ టెక్నో-ఎక్స్‌పర్ట్ వారితో జరిగిన ఒప్పందంపై 1962 జూన్ 13వ తేదీన సంతకాలు జరిగాయి. అవసరమైన సాధన సామగ్రిని సరఫరా చేయడానికి ఈ సంస్థవారు అంగీకరించారు. కూకట్‌పల్లిలో సింథటిక్ మందుల ప్రాజెక్టుకు 1962 సెప్టెంబరు 9వ తేదీన అప్పటి వాణిజ్య పరిశ్రమల శాఖామంత్రి శ్రీ. కె. సి. రెడ్డి శంకుస్థాపన చేశారు.

సింథటిక్ మందుల ప్రాజెక్టు మన రాష్ట్రంలో హైద్రాబాదుకు సుమారు 7 మైళ్ళ దూరంలో గల కూకట్‌పల్లి వద్ద సికింద్రాబాద్ — బొంబాయి రోడ్డుపై సనత్‌నగర్ రైలుస్టేషనుకు దగ్గరలోవుంది. సనత్‌నగర్ రైలుస్టేషను నుంచి ఫ్యాక్టరీ స్థలంవరకు రూ. 12 లక్షల వ్యయంతో రైలు మార్గాన్ని నిర్మించారు.

### ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేయూత

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఈ ప్రాజెక్టు పట్ల మొదటినుంచీ అత్యంత శ్రద్ధాసక్తులుకనబరుస్తున్నది. ఫ్యాక్టరీనిమిత్తం 570ఎకరాల స్థలాన్నీ, వసతిగృహాలు మొదలైన వాటి కొరకు 300 ఎకరాల భూమినీ రాష్ట్ర ప్రభుత్వం విరాళంగా ఇచ్చింది. మందుల ఉత్పత్తికీ, నివాసగృహాలకు అవసరమైన మంచి నీటిని సరఫరా చేసేందుకై రాష్ట్ర ప్రభుత్వం మంజీరా ప్రాజెక్టు పనులను కూడా చేపట్టింది. 13000 కె. వి. ఏ. ల విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి రాష్ట్ర విద్యుచ్ఛక్తి వ్యవహారాల మండలివారు చర్యలు తీసుకుంటున్నారు. ఫ్యాక్టరీనుంచి

విసర్జించబడే సీటి నీ.ఎ త్తి పోయడానికి అయ్యే ఖరుస్చు భరించడానికి రాష్ట్రి ప్రభుత్వం అంగీకరించింది. ఈ విధంగా రాష్ట్రి ప్రభుత్వం, మన దేశంలోనే కాక ఆసియాలో కూడా ప్రధాన మైనటువంటి ఈ మందుల ఫ్యాక్టరీని త్వరితగతిని నెలకొల్ప డానికి అవసరమైన సహాయ సహకారాలను అందజేస్తున్నది.

### అంచనా వ్యయం

వసతి గృహాలతో సహా ఈ ప్రాజెక్టు పనులకు రూ. 20 కోట్లు ఖర్చవుతాయని అంచనా. ఈ ఫ్యాక్టరీ ఏటా రూ. 10 కోట్లు విలువచేసే 850 మెట్రిక్ టన్నుల సింథటిక్ మందులు, 4560 మెట్రిక్ టన్నుల ఇతర ఔషధాలను ఉత్పత్తి చేయగలుగుతుంది. విటమిన్లు, పైరెటిక్స్, క్షయ నిరోధక ఔషధాలు మొదలైన 18 రకాల మందులను ఈ ఫ్యాక్టరీలో ఉత్పత్తి చేస్తారు.

### సివిల్ పనులు

కర్మాగారం తాలూకు నిర్మాణ కార్యక్రమం 1962లో ప్రారంభమయ్యింది. మాస్కోలోని టెక్నోఎక్స్పర్టువారు ఈ కర్మాగారం లేఅవుట్ ప్లానును తయారు చేశారు. ముఖ్యంగా ఉత్పత్తి బ్లాకులు పది వుంటాయి, ఇవికాక తత్సంబంధమైన సహాయక సర్వీసులకు, స్టోరులకు, నిర్వహణ, సంక్షేమ కార్యక్రమాలకు అనేకం బ్లాకులు వుంటాయి వివిధబ్లాకుల నిర్మాణ కార్యక్రమంత్వరితగతిని కొనసాగుతున్నది. 1965 సంవత్సరంనాటికి కర్మాగారం భవనాల నిర్మాణం పూర్తి కావచ్చని భావించబడు తున్నది. ఆతర్వాత యంత్రాలు బిగింపు జరుగుతుంది.

### యంత్రాలు, ఉపకరణాలు

రష్యాలోని టెక్నో ఎక్స్పర్టువారు యింతవరకు 60 శాతం యంత్రపరికరాలను అందజేశారు. రష్యానుంచి వచ్చిన యీ యంత్రపరికరాల విలువ రూ 3.74 కోట్లు. రూ 2.5 కోట్లు ఖరీదుచేసే యితర చిల్లర సామగ్రికూడా సేకరించబడుతున్నది.

### ముడి సరుకు

భారతదేశంలోపల నుండే సుమారు 90 పెద్దతరహా రసాయనికాలు సేకరించవలసి వున్నది. ఇంచుమించు 30 పెద్దతరహా రసాయనికాలు దిగుమతి చేసుకోవాల్సి వుంది. భారతదేశంలోనూ, విదేశాలలోనూ యీరసాయనికాలు లభ్యమయ్యే విషయంలో వర్తక సమాచారాన్ని సేకరించే కార్యక్రమం పూర్తయ్యింది.

### స్టోర్స్

కర్మాగారం ప్రాంతంలోను, సిబ్బంది నివాసప్రాంతంలోను నిర్మాణ కార్యక్రమాలకుగాను సుమారు 7,000 మెట్రిక్టన్నుల కట్టడపు ఉక్కు, 30,000 మెట్రిక్టన్నుల సిమ్మెంటు అవసరమవుతుంది.

### వసతిగృహాలవాడ

కర్మాగారంలోని సిబ్బందికి నివాస సౌకర్యాల్ని కల్పించేనిమిత్తం యీ కర్మాగారానికి యించుమించు ఒక మైలు దూరంలో బాలనగర్వద్ద 1,300 గృహాలతోకూడిన అన్ని సౌకర్యాలూగల ఒక చిన్నగ్రామం రూపొందుతున్నది. ఇంతవరకు వివిధరకాలకు సంబంధించిన 275 గృహాలు తయారయ్యాయి. సిబ్బంది యీ గృహాలకు తరలి వెళ్తున్నారు.

రూ. 2.31 లక్షల వ్యయంతో అతిధి గృహం ఒకటి నిర్మింపబడింది. ఈ కర్మాగారం అతిధులకు బసచేయడానికిగాను అన్ని హంగులూ గల చక్కటి ఎనిమిది గదులు ఇందులో వున్నాయి.

రష్యానుంచి వచ్చిన 40 మంది నిపుణులకు భోజన సౌకర్యాన్ని కల్పించేనిమిత్తం రూ. 9.1 లక్షల ఖరీదుతో ఒక హాస్టలు నిర్మింపబడింది.

ఈ చిన్న ఊరిలో పాఠశాలలు, వైద్య చికిత్సశాల, బ్యాంకు, పోలీసుస్టేషను, ఫైర్ స్టేషను, వినియోగదారుల సహకార సంఘాలు, తపాలా కార్యాలయం, వినోద కేంద్రాలు మొదలయిన అన్ని సౌకర్యాలూ వుంటాయి.

### ఉద్యోగావకాశాలు

ఈ కర్మాగారం మొత్తంమీద సుమారు 3,000 మందికి ఉద్యోగావకాశాల్ని కల్పిస్తుంది. వీరిలో సుమారు 300 మంది బాగా విపుణులైన సాంకేతిక పరిజ్ఞానం వున్నవారు. సాంకేతిక శిక్షణ పొందడానికై 1963 లో రష్యాకు పంపించబడిన 26 మంది సాంకేతికవ్యక్తులు శిక్షణ పూర్తిచేసుకుని తిరిగి స్వదేశానికివచ్చి 1964 ప్రారంభంలో కర్మాగారంలో చేరారు.

1964 సం. మధ్యలో మరొక బృందం రష్యాదేశానికి పంపించబడింది. మొత్తంమీద 73 మంది భారతీయ సాంకేతిక పనివారలు రష్యాదేశానికి శిక్షణనిమిత్తం పంపించబడతారు. వీరు శిక్షణానంతరం స్వదేశానికి తిరిగివచ్చి రష్యా నిపుణుల పర్యవేక్షణలో ఈ కర్మాగారం పని చేయడానికి తోడ్పడతారు, సిబ్బందిలో దిగువ స్థాయికిచెందిన ఆపరేటర్లు మొదలయిన వారికి శిక్షణ యిచ్చేనిమిత్తం ఒక ఏడాదిలో శిక్షణ పాఠశాల నొకదానిని స్థాపించాలని ఉద్దేశించబడింది.

సింథటిక్ మందులతయారీసాంకేతికంగా బాగా శ్రమతో కూడుకున్నదిగనుక, ఈ కర్మాగారంయొక్క విజయం ప్రత్యేకమైన

(మిగతా 33 వ పేజీలో)

# మనదే అంతిమ విజయం!

కు॥ జానకిరామ పట్నాయక్

అతిమంచితనం అపాయహేతువు
అది ఏనాటికీ పనికిరాదు;
ఉదార భావాల్ని ఉన్నతాశయాల్ని
ఉత్త చేతకానితన మంటారు-నీచులు!

సత్య, అహింసా, తటస్థవిధానంతో
నిత్యనూతన ప్రణాళికల్తో దేశాన్ని
కడుపులో చల్ల కదలనీయకుండా ప్రశాంతితో
నడుపుకొనివస్తున్నారు ప్రధాని నెహ్రూజీ!

భారతదేశానికి ఉత్తరాన ఉంది
భారీజనసంఖ్య గల చీనారాజ్యం;
తిన తిండికీ, కట్ట గుడ్డకూ దానికి లోపం కలిగింది
జనం అల్లాడి గగ్గోలు చేయ నారంభించింది!

ప్రజావిప్లవం వస్తుందన్న భయంతో
ప్రధానీ రాష్ట్రపతీ తలలు కలుపుకున్నారు;
కరటక దమనకు లిరువురూ నిశ్చయాని కొచ్చి
కార్యాచరణకు పెద్దఎత్తు వేసుకున్నారు!

మేఘంలేని వర్షంలా—చాపక్రింది నీరులా
మంచుమలలు దాటి దొంగచాటుగా
మన భూమిని ఆక్రమించారు-నీచులు!
ఘనమైన శాంతి భద్రతలకు ఆపాటం కలిగించారు!

ప్రాక్పశ్చిమ దేశాల ప్రాజ్ఞులు
పాడి గాదన్నారు ఈ దురాక్రమణకు;
చీనాప్రభువులు పెడచెవిపెట్టారు
చిరసత్య మైన ఈ నీతిసూత్రాలను!

మనస్నేహాన్ని, సుహృద్భావాన్ని
మహాలలుసుగా తీసుకున్నారు—దుండగులు!
చేసిన మేలును విస్మరించారు
చెనట్టులై, పాషండులై. కృతఘ్ను లయారు.

దేశనాయకుడు నెహ్రూజీ పిలుపుతో
దేశవాసు లంతా తయా రయారు;
కుల, మత, పార్టీ తత్వా లన్నిటినీ
కూలద్రోసి, ఏకత్రిత మయారు!

బంగారమూ, డబ్బూ యుద్ధనిధికి
పొంగారే హృదయంతో సమర్పించారు;
యువజను లంతా వేలసంఖ్యలో
యుద్ధభూమికి తరలారు ఉత్సాహంతో!

అలవాటుపడని ఆ హిమాలయాల్లో
చలికీ, మంచుకూ, వానకూ సహిస్తూ
ఒక్కొక్క భారతసింహమూ వీరత్వంతో
చెక్కాడుతున్నాయి పదేసి చీనామృగాల్ని!

సత్యం, ధర్మం, న్యాయం ఏనాటికైనా
సమకూరుస్తుంది—జయాన్ని!
ధర్మచ్యుతులూ కుటిలులూ ఐన చీనావారికి
తప్పదు అపజయం!!...మనదే అంతిమవిజయం!!!

# ఆంధ్ర బౌద్ధవాఙ్మయము - రసార్ణవము

—నిడుదవోలు వేంకటరావు

తెలుగు భాషలో నవీనకాలమున ననగా క్రీ. శ. 1900 ప్రాంతమునుండి బౌద్ధ మత సంబంధములగు పద్యకావ్య రచనలు బయలు వెడలినవి. వానిలో జగద్విఖ్యాత శతావధానులు తిరుపతి వేంకట కవులు రచించిన బుద్ధ చరిత్ర ప్రాథమికమని చెప్పవచ్చును. ఇటీవల ముద్రితమైన [1] కల్లూరి వెంకట నారాయణరావుగారి శాంతి సామ్రాట్టు అశోక చరిత్ర యొకటి కలదు కాని బుద్ధ చరిత్రతో సమకాలికముగ రచితమైన మఱియొక పద్యకృతి కలదు – దాని పేరు "రసార్ణవము" అయినను అది అశోకుని జనకుడగు బింబిసారుని చరిత్రము. అందు బౌద్ధ ధర్మములన్నియు వివరింపబడినవి. కాని అముద్రితము రసార్ణవ కృతి రచయిత గోటేటి జగన్నాథరాయ కవి. ఈతడు నవీనుడే యైనను అనగా ముప్పదేండ్ల క్రిందట కీర్తిశేషుడైనను – కృతి రచన ప్రాచీన కవుల రచనలతో తులతూగుచుండుట చేతను, ఈ కాలమున కానరాని వారి యనుసరణము లుండుటచేతను, బౌద్ధ మత సంబంధమైన కృతి యగుట చేతను, దానిని గూర్చి లోకమునకు నీ క్రింది విషయములు దెలుపుచున్నాను [2]

గోటేటి జగన్నాథ కవి పెద తండ్రి గోటేటి సూరన్న – వీరేశలింగముగారి కవుల చరిత్రలో గోంతేటి సూరన అని వ్యవహృతుడైనాడు. ఈ కవుల వృత్తాంతము చాలాగలదు. కాని గ్రంథ విస్తర భీతిచే నిందు వివరింపలేదు. వీరు వాఙ్మయమునందే కాక, వైద్యమున, లౌకిక వ్యవహారమున, ఒక్కొలి చతురులు. వీరీ కృతిచేకాక, రామాయణ కథను 'రామకథ' అను పేర నొక ప్రశస్త కావ్యమును రచియించియున్నారు. అదియును అముద్రితమే.

## కృతి వివరములు

'రసార్ణవము' అనునది ప్రాచీన ప్రబంధముల రీతిని రచితమైనది. ఇష్ట దేవతా స్తుతి, స్వప్నవృత్తాంతము, అశ్వాసాంత గద్య షష్ఠ్యంత ములు, ఆశ్వాసాద్యంతపద్యములు మొదలైన లక్షణము లిందున్నవి. రసార్ణవము – కావుట పేరుకు తగినట్లుగా నిందు ఆశ్వాసములకు బదులుగా "తరంగము" లున్నవి. వాని సంఖ్య యెనిమిది. అనగా అష్టసంఖ్య. ఈ అష్ట సంఖ్య యందును నొక విశేష మున్నది చూడుడు.

రసార్ణవము గావున అష్ట రసములు స్ఫురించుచున్నవి. ఇక నీ కృతి శ్రీకృష్ణునకు నంకితము శ్రీకృష్ణుడు – అష్టమహిషీ సమేతుడు. ఈ విధముగను నీ సంఖ్య గణనీయమే.

గ్రంథమున నచ్చటచ్చట వచనము లున్నను నిది ప్రాయికముగా పద్యకావ్యమే యని చెప్పవచ్చును. ఇందు 1307 పద్యము లున్నవి. అయినను, నిది కేవలము పద్య రచన కాదు; ప్రశస్త కవితారచన–జగన్నాథ రాయ కవీంద్రుడు, నైసర్గికముగ ననర్గళ ధారా సంపన్నుడు. ఉభయ భాషారచనాభి శోభితుడు, చతుర్విధ కవితా విశారదుడు– ఈ గ్రంథమున నెచ్చట జూచిన కవి ప్రతిభ విస్పష్టముగ గోచరించుచున్నది. ఈ కావ్య రచన, శ్రీకృష్ణుని యనుగ్రహముచేతనే గాని స్వకీయ ప్రతిభచే సాగలేదని గద్యయం దీ విధముగా జెప్పుకొనుచున్నాడు.

"శ్రీ నందనందన సుందరపాదార విందా మంద మందమరంద బిందుసందోహ సేవాసమాసాదిత కవితా చాతురీ ధురీణ భారద్వాజ పవిత్ర గోత్ర గోటేటి వంశ క్షీర పారావార నీరజామిత్ర రామచంద్ర యతీంద్ర పౌత్ర, లింగమూర్త్యమాత్య పుత్ర బుధజన విధేయ, జగన్నాథరాయ ప్రణీతంబైన రసార్ణవమను. మహా ప్రబంధంబున – ప్రథమ తరంగము" – ఇట్లు శ్రీకృష్ణ పరమాత్మ సేవయే కాక, ప్రాచీన కవులగు పోతన, రామరాజభూషణుల రచనలను నీతడు కూలంకషముగ పఠించి యున్నాడు. ఈ కావ్యమున వా రిరువురి

1. చూడుడుభారతి – సెప్టెంబరు 1959 పుటలు 88–92.

2. ఈ గ్రంథము, కవి స్వయముగా లిఖించుకొనిన ప్రతిని నాకు విశాఖపట్టణ వాస్తవ్యులు – సుప్రసిద్ధకవయిత్రులును నగు శ్రీమతి బుర్రా కమలాదేవిగారిచ్చిరి – ఆ ప్రతికి వేఱుప్రతిలేకపోవుటచే, దానినే యాధారముగా పైవ్యాసము వ్రాసితిని. అందులకు వారికి నా కృతజ్ఞత –

ప్రభావము స్పష్టముగ గోచరింపగలదు కొన్ని మాత్రమే చూపుదును.

పోతన — ఎత్తుగడలు - రసార్ణవము —

అటగాంచెన్ గరిణీ విభుండు — 8-86

అటగాంచెన్ ధరణీ విభుండు — 1-140

రామరాజభూషణుడు — వసుచరిత్ర —

ఒకచాయ న నపాయ,పికగేయసముదాయ

మొకవంక నకలంక సకలనికుర — 3-86

రసార్ణవము —

కమలా ష్టకుముదా ప్త సమదీ ప్త వరత ప్త

కాంచనహర్మ్యస మంచితంబు — 1-67.

ఇట్లెన్నియేని చూపవచ్చును.

ఇట్లు ప్రాచీనుల ననుసరించుటయే గాక కవి, కావ్యోత్కృష్టత — నీతడు, తనకావ్యమున ప్రత్యేకముగ నుద్ఘాటించియున్నాడు.

1. కృత్యాదిని పూర్వకవిస్తుతి చేయ లేదు. ఒక్క పద్యమున కవిప్రతిభ వ్యక్తము చేసియున్నాడు.

చ. సకల విశుద్ధ లక్షణ వి

చక్షణ తీక్ష్ణ కుశాగ్రశేముషీ

నికర మహాప్రబంధకృతి

నిర్మల పూర్ణతరంగిణీ నవో

ద కవిసర ప్రసారకవి

తా వచనామృత ధోరణీ లస

త్సుకవితతి న్నుతింతు మృదు

సూక్తినమంచితధార మీరఁగన్ — 1-5

2. కవితా ధర్మముగల పద్య లేఖ ను గూర్చిన పద్యము హృద్యము.

చ. సరస సుధారస ప్రకర

సామ్యము జెందిన ముద్దుపల్కులన్

పరమ సువర్ణత త్త్వము వి

భాసితభావము భూర్యలంకృతుల్

సురుచిర వృత్తమున్ మిగుల

సుందర పాదము లొప్పమీఱగా

తరుణికి మాఱువచ్చితివి

తద్దయు లేఖ యనుగ్రహించుచున్.

3. ఉద్యానవర్ణన —

కవిత పాదప మహాకావ్యరాజం బౌట

వితతమంజరులిందువెలయుచుండె—2-65

4. పద్మాకర వర్ణన —

కవి నిరంతర వాక్యకలితమై చెలువొందు

దనుజాధిపతి శుభాస్థానమట్లు 2-71.

కవితనుగూర్చి చెప్పుటయేకాక కవితా చమత్కారములను చూపియున్నాడు. స్త్రీ వర్ణన - యంతయు కకారాది పదములచే కూర్చబడినది.

మ. కనియెన్ కన్నుల కాంక్షదీఱఁ గలికిన్

కాదంబినీ కైశికన్

కనకాంగింగ మలాక్షిఁ గంబుసుగళన్

కంజాక్షగండస్థలన్

కనదబ్జారికళాస్యఁ గందుకశుభా

కారి స్తనిన్ గామినిన్,

కనకామోద కరీంద్రయానఁ గల వా

క్కౌశల్యఁ గల్యాణినిన్

పద్యమున మొదటి రెండుమూడు పాదము లొకేసమాసముగా గూర్చి చెప్పుట యిందలి కవితా లక్షణములలో నొకటి.

శా. నీలోద్యానవనాంతరోల్లసిత కే

కీధామకుడ్యస్థలీ

హాళీనిర్మిత సాలభంజికల ...

ఉ. మాళవ కేరళ ద్రవిడ

మత్స్య శకాంగ కళింగ వంగ నే

పాళ పుళింద సింధు కురు

పాండ్య విదర్భ విదేహ గౌళ భూ

పాళ కరూశ కోసల సు

బాహ్లిక సింహళ కుంతలంబులన్

జోళ మహోత్కళప్రముఖ

సుందరరాజ్యము లేగిచూచితో.

ఇందలి సీసపద్యములు సమతగలవి — అందును చాలపద్యములలో నన్నయభట్టార కునివలె, సర్వ యతి, ప్రాసనియమములను పాటించియున్నారు. మచ్చునకొకటి.

సీ. ఆలీసమాలీఢ నాళీక శుభముఖీ

వ్యాలోల వీక్షాప్రవాహుఁడగుచు

లీలాసమాయత్త బాలావియోగాగ్ని

కీలా పరంపరా క్లిష్టుఁడగుచు

కాలానిలోజ్జ్వల జ్వాలాప్రకోపన

మాలోల పాద విన్యాసుఁడగుచు

నాలోచనా హీన హేలాప్రలాపనా

సాలావళీ మార్గ చారుడగుచు.

ఇత్యాది రచనలు పెక్కులు. ఇంకను అనుప్రాసములు — ముక్తపదగ్రస్త రచన లిందు మెండుకొనియున్నవి. సంస్కృత సమాసము లున్నను, నవి ప్రసన్నములై శ్రవణ మనోహరములై యుండును. సీసపద్యముల పాదములు చాలవఱకు నేకసమాసములే.

'కవిత నేరుపు యతికూర్పు కైపుదెలుపు' అన్నట్లు నిందలి కవిత, నియమబద్ధమయ్యు నిరతిశ యాహ్లాదకారి. ఎన్ని పద్యములనైన యుదాహరింపనగును.

ఈ గ్రంథమున ఛందో విశేషములలో చెప్పదగినది దండకము. అట్టిది యింత వఱకు లేకుండుటచే నిందు పూర్ణముగ నిచ్చుచున్నాను.

బుద్ధదేన దండకము

శ్రీ మన్మహానంద సందోహ సౌందర్య ధుర్యా నివార్యార్య మాథుర్య సర్వప్రభాగర్వ నిర్వాప భూరిప్రకాశావళీ భాసుదాస్వాంత నిష్యంద కారుణ్య పుణ్య స్వరూపా! విప ద్వైక భూత ప్రపంచ ప్రభూ తార్త మర్త్య ప్రకృష్ట ప్రమాద ప్రవృద్ధ ప్రవృత్తి ప్రదోషా విలాత్మాంధకారాయతోప ద్ర వ ని దర్శి గేహ ప్రదీపా! రుజాధీన నానా జగజ్జీవి రాజీ విరాజన్మహామంజు సమ్యగ్దయా స్నిగ్ధ దుగ్ధాబ్ధి రీతీ విశాలాంచితా చంచలస్వాంత నిష్కాంత శాంతి ప్రహర్ష ప్రకర్షాప హృద్దీప నాటోపకోపా! సదా సత్యసంధాన శోభా సముద్భాషితాశేష భాషాతుషారాంబు

గంభీర భుంభున్నదీ శైత్య సంభార విర్భిన్న
సంసారి హృద్వీక వాస్తోక తాపత్రయా
ఖీల దావాగ్ని కీలకలాపా! భవద్దర్శనా
వాప్తిఁ దృప్తుండ నైతిన్ మదీయంబు
లైయున్న ఘోరాఘముల్‌పాజె పేరాసలుం
దీజె.

శ్రీ శాక్య సద్వంశ సంజాత భూనాథ
శుద్ధోదన ప్రాప్త పుత్రుండవై, సాక్య
సింహుండవై, వాంఛితైశ్వర్య భోగప్రపూ
ర్ణుండవై, స్వార్థమున్ వీడి లోకోపకారా
ర్థమే దేహ మర్పించి ప్రారబ్ధ సంబద్ధులై
పుట్టుచున్ గిట్టుచున్ దుష్టులై యైహిక క్లేశ
సంతప్తులై ముక్తి మార్గాంధులై యుండు
నాబోటి పాపాత్ములం గాంచి ధర్మ ప్రబో
ధంబు గావించి మోక్షంబు జేకూర్తు వెంతో
ప్రశంసార్హమైయున్న నీశక్తి సామర్థ్య
ముల్ దెల్పగానౌనె నాకున్ ననున్ బింబి
సారావనీశున్ కృపాపూత దృష్టిన్, విలో
కించి, సుజ్ఞానిగా జేసి కావంగదే, శాశ్వతా
నూన నిర్వాణమొందింప వేడెదన్ సన్నుతా
ఖండ విజ్ఞాన సంపన్న యాభోగ భాగీరథీ
శుద్ధ భావా ప్రబుద్ధ ప్రభావా మహా బుద్ధ
దేవా నమస్తే నమస్తే నమః

ఈ గ్రంథమందలి వైద్య విజ్ఞానము నొక ప్రత్యేకత గలది.

సాధారణముగ ప్రబంధముల యందు కానరాని వైద్య విజ్ఞానము నిందు ప్రస్ఫుటమగుచున్నది. బింబిసారుడు మునీశ్వరాశ్రమము కాంచునపుడు కవి తన వైద్య విద్య నెట్లు ప్రకటించియున్నాడో చూడుడు.

క॥ ఇలమీద నెన్ని వ్యాధులు
గలిగెడినో వానినెల్ల ఖండించుటకై
కలవీ యోషధు లిచ్చట
నిలరాయఁడవానిమహిమలేర్పడవినుమీ.

భృంగరాజము — సుగంధి

క॥ అరయు మిదె భృంగరాజము
సరగున దీర్ఘ జ్వరాళి సమయించుఁ జుమీ
యురుమేహ మణపఁ జాలెడు
ధరణీధవ! యీ సుగంధిఁ దగ సేవింపన్

చిత్రమూలము — నేలవేము

ఆ. వాతరోగములకు పంజాయుధముఁ బోలు
చిత్రమూల మిది విచిత్రముగను
పైత్యరుగ్మతలను బరిహరింపఁగఁ జాలు
నేలవేము గనుము నేలఱేండ!

రత్నపురుష — తిప్పతీగె

క॥ ఇది రత్నపురుష మధిపా!
ముదిమిని బోగొట్టిధాతుపుష్టి నొసంగున్
ముదిరిన పైత్య జ్వరముల
విదళించెడు తిప్పతీగె విత మేమందున్.

నిద్రకన్ని — గొబ్బి

క॥ కనులలోని పువులఁ గరగించు నీ నిద్ర
గన్ని మొలక శక్తి నెన్నఁదరమె
యుబ్బువెతలనెల్ల గొబ్బునఁ బోఁగొట్టి
గొబ్బిమొక్క దీని గొప్ప వింటె

దుంపరాష్ట్రిము — తివ్వతల

ఆ. దుంపరాష్ట్రిమిద్ది దుర్భర శ్లేష్మంబు
దుంపఁద్రెంపి రోగి కింపునింపు
గాయములను బూడ్చికడు వేగమాన్చును
తివ్వతలము దీనిఁ దెలియు మధిప.

గాంజ గింజలు

గీ. గాంజ గింజలు దినుటచే కైపు గల్గ
గనుల నఱమోడ్చియుండెడు శుకంబొకండు
సకలమును విడి ధ్యానించు శుకువిధమున
జూడు మిచ్చోటననె సంగడీడు దొరకు.

కొన్ని ముక్త రచనలు :

పనస గున్న — వేశ్య వాటిక

సీ. కలుకుగింజలతోడవరలుతియ్యని తొనల్
కఠినాంతరంగలౌ గణికలట్ల
జిగురుతో బెరసి చిక్కఁగనున్న యేసెలు
మాయ గల్గిన వృద్ధమాతలట్ల
విచ్చి హెచ్చుగ శోభవెలయించుఫలములు
తెఱచిన వేశ్యమందిరములట్ల
మాటికి ముసరెడు మధుమక్షికలగుంపు
చేటీ కవిత విట కోటులట్లు
గీ. తనర పల్లవ రాజితో బెనఁగియున్న
కొమ్మల జెలంగి యొక సానిగూడెమట్లు
గొనబు మీఱుచుఁ బండిన పనసగున్న
యొడయునికి నేత్రపర్వంబునొనరఁ గూర్చె

నియోగులు :

ఉ. భోగులు, రాజ సంశ్రయ వి
భూతి సుయోగులు, లౌకికప్రభా
భోగులు, దీనలోక పరి
పూర్ణ సరాగులు, నర్థిసంతత
త్యాగులు, మానసద్గుణవి
తాన వివిక్త సుఖోప జీవ పు
న్నాగులు, ధీరతాప్రమద
నాగులుగారె నియోగులుద్ధతిన్.

## కథాసంగ్రహము

గిరివ్రజమను పురమును బింబిసారుడనే రాజు పాలించుచుండెడివాడు. కొంతకాలమున కాతనికి విరక్తి గలిగి, రాజ్యము మంత్రుల కప్పగించి, వినయశీలు డనుతననెచ్చలితో శీతవనమున కరిగెను — అచ్చట, అగ్ని జ్వాలలో దగ్ధము కానున్న ఒక బ్రాహ్మణుని రక్షించెను. ఆ బ్రాహ్మణుడు, తనకు చేసిన యుపకృతికి రాజు కేదైన ప్రత్యుపకారము చేయబూని యిట్లు చెప్పెను– నేను శారదా భట్టను రాజ పురోహితుడను. వైశాలినగర రాజునకు కుముదిని యను కూతురు గలదు. ఆమెకు వివాహము నిముత్తము, రాజ కుమారులను వెదకుటకు నన్ను పంపినారు. ఆమె పటము నాచేతికిచ్చి, పగవాడైన బింబిసారుని నగరముతప్ప తక్కిన నగరములు దర్శింపమని చెప్పిరి. అందుచేత త్రోవతప్పి వచ్చుచుండగా నీయగ్నిబారి పడితిని – నన్ను రక్షించితివి. ఇదిగో యీపటము చూడుము– అని పటమునిచ్చి, యామె సౌందర్యము

వర్ణించెను. రాజునకు కుముదినియందు మోహము గలిగెను. కాని యామె తనకు పగవాని కూతు రగుట తాను బింబసారుడ నని చెప్పక — ఆమె తనను చేపట్టునా-యని విప్రు నడిగెను. ఆతడును ఏమ్ముకంటె నెవ్వరిని నామె వరింపదని చెప్పెను. బింబసారుడు, విప్రునికి తానే బింబసారుడని చెప్పి, తన పటమామె కిమ్మని కోరెను...

ఆ బ్రాహ్మణుడును ఆ పటమును వైశాలి నగరమునకుబోయి కుముదినికి చ్చెను. ఆమెయు బింబసారునియందు బద్ధానురాగ యయ్యెను. ఇంతలో వినయశీలుడు యోగి వేషమున నామెహృదయము నరసివచ్చెను. తిరిగి మరియొకమారు తలిదండ్రుల యంగీకారమునకై బయలుదేరెను. రాజు అందుకు అంగీకరించెనుగాని తానునునచ్చెద ననెను. ఇరువురును అచ్చటకేగిరి. కుముదిని పూర్వ పరిచయమున యోగివద్దకు వచ్చెను. కానిరెండవయోగిని చూడగానే యామె మనస్సుఆతనియందు లగ్నమయ్యెను. యోగి కుముదిని నాతనికి పరిచర్య యొనర్ప నియోగించెను — వారిరువురును నొక కుటీరమున గలిసికొనిరి. కాని వెంటనే కుముదిని చెలికత్తెలామెను తోడ్కొనిపోయిరి. కుముదినికి విరహవేదన ప్రారంభమైనది. దిన దినము ఆమెక్షీణింపనారంభించెను—చెలికత్తెలుభయపడి, కుముదినితల్లితోనీ వృత్తాంతమంతయు చెప్పిరి. ఆమెయు, కూతురు క్షేమము కోరి నదిగావున వా రిరువురును గాంధర్వ విధిని వివాహము చేసికొని వచ్చునని, యిది అతి రహస్యముగ జరిపింపవలెనని యాజ్ఞయిచ్చినది — కుముదినీ బింబసారులకు, పెండ్లి జరిగెను — ఇంక నచట యుక్తముకాదని ఆమెను దోడ్కొని బింబిసారుడు గిరివ్రజమునకు వచ్చి సుఖముగనుండెను —

ఈ సంగతి కుముదిని తండ్రి వైశాలి రాజు బింబసారుడూర లేడనితెలిసికొని గిరివ్రజముపై దండెత్తెను — శీతవనమున నున్న బింబసారుడు తక్షణమేవచ్చి, ఆతని నోడించి బంధించెను — బింబసారునితడు శరణువేడగా, నాతని విడిచిపెట్టెను కాని వైశాలి రాజసైనికులు గిరివ్రజమునంతను పాడుచేసిరి. అచటివారందరు కోరగా, బింబసారుడు, తానున్న శీతవనమున రాజగృహము అను నొక పట్టణము గట్టించి, దానిని తన రాజధానిగా చేసికొనెను—కుముదిని కొంతకాలమునకు గర్భవతియై యొక పుత్రునిం గనెను. ఆతడే చారిత్రిక ప్రసిద్ధుడగు అశోకచక్రవర్తి.

బింబసారు డొకనాడు వేటకు వెడలగా, అతడు దారితప్పి తథాగతు డగు బుద్ధదేవుడున్న గృధ్రకూటమునకు వచ్చెను. అచ్చట వేలకొలది శిష్యులకు బుద్ధుడు బౌద్ధధర్మముల నుపదేశించుచుండెను - ఆత డహింసాతత్వమును బోధించుచుండగా, బింబసారుడు తాను చేసిన జీవహింసాపాప మెట్లు తొలగునని ప్రశ్నించెను .. బుద్ధుడు బౌద్ధధర్మము స్వీకరించుటయే మార్గ మని బౌద్ధధర్మము లాతని కుపదేశించెను — బింబసారుడును బౌద్ధ ధర్మావలంబియై, గృధ్రకూటమున, బౌద్ధ చైత్యములు, ఆరామములు, భిక్షుకులు నివసించుటకు వసతు లేర్పరచి తాను భిక్షు వయ్యెను.

### బౌద్ధమత ధర్మములు

ఈ ప్రబంధమున అష్టమ తరంగమున 63 వ పద్యమునుండి 169 వ పద్యమువరకు నూరు పద్యములలో బౌద్ధమత ధర్మములు వివరింపబడినవి.

### ప్రకృతి

కారణముగల్గ గార్యంబు గల్గకుండ
నెట్టుపెట్టుట నెవరికి నే విగాదు;
అట్లుసేయుట కంతరాయంబదె ప
ప్రకృతి తత్త్వంబు మారదు వికృతివలన.

### కారణకార్యములు

కారణ కార్యములూహను
కారణమై ప్రకృతివంక గనబడుచుండన్
కారణమేదో కలదని
యారయుటను వరిత మేలు యడియాసకదా.

### కర్మఫలము

ఒకని కర్మఫలము వొకడొందగారాదు
దుష్కృతంబు ఫలము త్రోసివేయ
నలనుగాదు మంచిపను లెన్నిచేసిన
దేనిఫలము దానిదే కొనంగ.

### నిర్వాణపదవి

స్పష్టముగ సర్వసత్యముల్ జననజీవ
మృత్యు పరమరహస్యంబు లెఱుగగలిగిన
జ్ఞానసందీపికా దీప్తమానసాంత
పటుతరస్థితి సుమ్ము నిర్వాణపదవి.

### నియమము

న్యాయమునందు దృష్టియు, ఘ
నంబగు యత్నము, శ్రావ్యసద్దయా
ప్యాయిత సత్యభాషణము
వక్రతలేని సువర్తనంబు, ప్ర
జ్ఞాయుతధీర చింతన, వి
నమ్రసగౌరవ జీవనంబు పు
ణ్యాయత కార్యదీక్షయును
ధ్యానము శిష్య ముఖ్యనియమముల్.

### విషయవాంఛ

మానవుల వీడనివియు, మనల వీడి యవి
ద్వివిధ గతుల నుండు విషయతతులు
[illegible] నొప్పెడు సంతృప్తి
కడమ [illegible] నొసగు.

### బౌద్ధధర్మ ప్రశస్తి

అష్టాంగ మార్గంబు ననుసరించు [illegible]
శిష్టంబు లొందటన్ గల్గకుండు
సల్లమైన [illegible] యోగంబు
లొసగ [illegible] మంచిని నొందవకుండు

గంగాది సన్నదీ గాఢగాహన మొప్పఁ
గాఁ జేసిన వేఁడిన గదురకుండు
కాశీ ప్రయాగాది ఘనయాత్రలకు బోయి
మొక్కిన నింతేని జిక్కకుండు
నట్టి నిర్వాణ పదవి రాఁబట్టి నీకు
నిచ్చె రాఁబట్టుటకు గల పొట్టి త్రోవ
గుట్టు బోఁగొట్టి ప్రేమ జూపెట్టి యుంటి
పట్టుదలపట్టి దానిఁ జేపట్టు మెల్లా.
అఖిల జనములు సుఖవుగా నభ్యసింప
దగిన యీ బుద్ధ ధర్మసూత్రంబు నీవు
సర్వ సర్వం సహాంత సంస్తూయమాన
మాననీయంబుగ నొనర్పు మానవేంద్ర.
ఆత్మశిక్షకింటె నధిక మే ఘనశిక్ష
యరయ మఱియు లేదు ధరణినాథ
యిట్టి దుష్కృతంబు లికముందు చేయక
పుణ్యశాలి వగుచు బొమ్ము భువిని.

అని బింబిసారుని కహింసాతత్త్వము, ఆత్మశిక్షను బుద్ధుడు బోధించినాడు. బింబ సారుడును,

శారిసుత ప్రబోధిత సు
శస్త సమస్త స వి స్తరప్రజా
తారక బుద్ధదేవ ఘన
ధర్మ పరిగ్రహణోగ్రదక్షుఁడై
శ్రీరమణీయ భోగముల
శేషముగా విడనాడి భిక్షువై
భూరి సుశాంత చిత్తుఁడయి
బోద్ధయు బుద్ధుడునయ్యె నయ్యెడన"

ఆంధ్రబౌద్ధ వాఙ్మయమునకు సంబంధించిన యిట్టి కావ్యమునకు ముద్రణ భాగ్యము నందజేయుటకు భాషాపోషకులు సాహిత్య ప్రియులు పూనుకుందురుగాత —

ఈ కావ్యము ముద్రితము గాకున్నను, దీనిని విద్వాంసులు మెచ్చి తమ యభిప్రాయములను వ్రాతమూలముగాఁ దెలిపిరి. వారిలో ముఖ్యులు.

1. కీ. శే. శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు—"అధునాతన కవితా సృష్టియం దిది యద్వితీయమైయున్నది"
2. కీ. శే. శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రిగారు— "కవితాశైలి మనోహరము - భాష సలక్షణము, సులభము. నవీన కవులలో నీరీతి కవిత్వ - మరుదు."
3. కీ. శే. కూచిమంచి సాంబశివరాయకవి "అన్ని విధముల నీకృతి ప్రాచీనకృతినిఁ బోలియున్నది."
4. దేవరకొండ రామజోగి శాస్త్రిగారు. బౌద్ధమత ధర్మములిందు సుబోధకముగ నున్నవి ముద్రితము కావలసినకృతి."
5. ఆచార్య పింగళి లక్ష్మీ కాంతముగారు— "నవీన రచనలో నుత్తమముగానున్నది. ముద్రణార్హము."

---

(27 వ పేజీ తరువాయి)

నైపుణ్యంగల వ్యక్తులులభించే విషయంమీద ఆధారపడివుంది. అందుచేత కేంద్రకార్యాలయంలోను, కర్మాగారపు కార్యాలయంలోను నిపుణతగలవారిని, అనుభవంగలవారిని తీసుకొనే విషయంలో సక్రమమైన పద్ధతులుకొనసాగించ బడుతున్నాయి. కేంద్ర, ప్రాజెక్టు కార్యాలయాలు రెండింటివద్దా సెలెక్షన్‌కమిటీలు పనిచేస్తున్నాయి. అన్ని వుద్యోగాలకు, అఖిలభారత స్థాయిలోఢిల్లీలోని కేంద్రకార్యాలయంలో చేర్చుకోవడం జరుగుతుంది. యిక్కడ చేర్చుకునే వాటిలో గరిష్ట నెలసరి జీతం రూ 410లను మించుతుంది.

సిబ్బంది సంక్షేమం

ఈ కర్మాగారపు సిబ్బందికి కేంద్రప్రభుత్వానికి సంబంధించిన ప్రాథమికనియమాలు వర్తిస్తాయి. 1963 ఏప్రిలు 1నుండి ఎంప్లాయీస్ ప్రావిడెంట్ ఫండ్ పథకం ప్రవేశపెట్టబడింది. సిబ్బంది తమ అసలుజీతంలో 8½శాతం విరాళంగా యిస్తే, కంపెనీవారు అంతే మొత్తాన్ని విరాళంగా చెల్లిస్తారు. వైద్యం విషయంలోను, సెలవులు, పర్యటనల విషయంలోను కేంద్ర ప్రభుత్వోద్యోగులకు లభించే రాయతీలు యీ కర్మాగారం సిబ్బందికికూడా వారి సంక్షేమం దృష్ట్యా వర్తింపజేయడం జరిగింది. ఈ కర్మాగారం పట్టణానికి చాలా దూరంగా వున్నందువల్ల, కర్మాగారం దగ్గర వెలసిన చిన్నవాడలో వసతి సౌకర్యం లభించని సిబ్బందికి ఉచిత రవాణా సౌకర్యం కల్పించే నిమిత్తం యీ కర్మాగారం రెండు బస్సులను కొనుగోలు చేసింది. ఈ వసతిగృహాల వాడలో వుంటున్న సిబ్బంది పిల్లలు నగరంలోని పాఠశాలలకు వెళ్ళడానికి ఈ బస్సుల్లో నామ మాత్రపు ఛార్జీ వసూలు చేయబడుతుంది.

కర్మాగారంవద్ద పనిచేస్తున్న సిబ్బంది కొరకు యీ ప్రాంతంలోలాభనష్టాలులేనిపద్ధతిపై ఒక కేంటీను నిర్వహించ బడుతున్నది.

తొలి పెద్దకర్మాగారం

ఈ రకపు కర్మాగారాలలో దేశంలో యిది మొట్టమొదటిదేగాక పెద్దదికూడాను. బహుశా ఆసియాలోకెల్ల పెద్దదికావచ్చు. హైదరాబాదులో యీ సింథటిక్ మందుల కర్మాగారం ఏర్పాటు చేయడంవలన దేశంలోని యీ ప్రాంతపు ఆర్థికాభివృద్ధికి క్రొత్త ప్రోత్సాహం లభ్యమై, ఒక క్రొత్త ఆర్థిక శకాన్ని ప్రారంభిస్తుందనడంలో ఏ మాత్రం సందేహంలేదు. ఈ కర్మాగారంలో ఉత్పత్తయ్యే మందులు 1966 నాటికి మార్కెటులోకి వస్తాయి. దీనితో భారతదేశంలో మందులతయారీ పరిశ్రమలలో క్రొత్తప్రమాణాలు స్థాపించబడతాయి.

# వ్యాసం

— చాగంటి తులసి

దిన, వార, మాస పత్రికల సంఖ్య అపరిమితంగా పెరిగిన రోజుల్లో వ్యాసరచన వైపు అందరి దృష్టి మరలింది. పత్రికల పేజీలు నింపవలసిన అవసరం వ్యాసకర్తల సంఖ్యని పెంచింది. ఏదో ఒక విషయం తీసికొని, తమకు తోచిన రీతిలో దానిని చర్చించి వ్యాసరూపంలో ప్రకటించడం సర్వసాధారణమైంది. అయితే ఈ విధంగా వ్రాయబడిన వ్యాసాలు వ్యాసాల క్రింద పరిగణించబడవు. వాటికి సాహిత్య ప్రక్రియారూపంలో గౌరవమూ, స్థాయిత్వమూ లభించవు. సాహిత్యశాఖగా రసానందాన్ని ప్రసాదించే వ్యాసాలు మిగిలిన సాహిత్యశాఖలు, కథానిక, గేయం, నాటకం వలె ప్రతిభాసంపన్నులైన రచయితల చేతనే వ్రాయబడతాయి. కాలచక్రం ఆ వ్యాసాల్ని రూపు మాపలేదు.

సాహిత్య గౌరవముతో అలరారే ఈ వ్యాసం మిగిలిన సాహిత్యశాఖలవలె ప్రాచీన కాలంలో మానవుని అనాగరికమైన దశలో ఉత్పన్నమవలేదు. కథానిక, గేయం మొదలైన సాహిత్య ప్రక్రియలు అనాది కాలంనుండీ, మానవుని అనాగరిక స్థితినుండీ సంఘంలో సహజంగా ఉత్పన్నమై శిల్పపు ఔన్నత్యాన్ని పెంపొందించుకుంటూ వికాసాన్ని పొందేయి. వ్యాసం ఉత్పన్నమయే స్థితికీ పై సాహిత్య ప్రక్రియ లుత్పన్నమయే స్థితికీ భేదం స్పష్టంగా కనడుతుంది. బుద్ధి సంపన్నతను పెంపొందించుకొని, వివేచనా పరులై, వివేకముతో జీవితమును విశ్లేషించుకొనే నేర్పును గడించుకొన్న మేధ గల్గిన మనీషుల సృజనాశక్తి ఫలింతగా వ్యాసమన్నది జన్మించింది. అందుచేత ఏ భాషా సాహిత్యంలో నైనా ఈ ప్రక్రియ ప్రారంభం అధునిక యుగంలో సంభవమైనది.

కథానిక, నవలవలె వ్యాసంకూడా గద్యరచనే. గేయ సాహిత్యం, పద సాహిత్యం వలె వ్యక్తిగతానుభవంనుండీ వ్యాసం జనిస్తుంది. స్వానుభవాన్ని ఆధారంగా తీసికొని, ఏదైనా విషయాన్ని భావానుభూతుల మేళవింపుతో రూపకల్పన చేసినప్పుడు సాహిత్యాత్మకమైన వ్యాసరచనగా రూపొందుతుంది. సాహిత్య ప్రక్రియలన్నిటి ప్రయోజనం మూలంలో ఒకటే అయిన కారణంచేత మిగిలిన సాహిత్య శాఖలతో వ్యాసానికి సంబంధం కన్పడుతుంది. కొన్ని కథలు భావాత్మకమైన వ్యాసాలుగా వ్రాయబడతాయి. కావ్యాత్మకమైన సౌందర్యంతో విలసిల్లే వ్యాసాలు గద్యకావ్యాలుగా అమరత్వాన్ని పొందుతాయి.

కొన్ని భావాలు వ్యాసరచనకి ఎంతో అనుగుణ్యంగా ఉంటాయి. ఆ భావాలు గేయరచనకి కాని, కవిత్వానికి కాని, కథానికకు కాని అంతగా ఉపచరించవు. అటువంటి భావాల్ని వ్యాస ప్రక్రియద్వారా అందంగా కళాత్మకంగా రూపొందించబడతాయి. కొన్ని భావాలు కావ్యరచనకి ఉపయుక్తా లయినప్పటికీ వ్యాసరచనకి ఉపచరిస్తాయి. అటువంటి భావాలతో రచించబడిన వ్యాసమే గద్యకావ్య మౌతుంది.

కొందరు సాహిత్యవేత్తలకు కవిత్వం చెప్పడంలో నిపుణతైతే ఉండదు కాని వారిలో భావనాశక్తీ, కల్పనాశక్తీ, బుద్ధి వైశాల్యం ఎక్కువగానే ఉంటాయి. అటువండివారు వచన రచనలో విశిష్టతను సంపాదించుకో గల్గుతారు. సాహిత్యాత్మకమైన వ్యాసం అటువంటి సాహిత్యవేత్తలకు అమోఘమైన, అత్యుత్తమమైన సాధనంగా వినియోగపడుతుంది.

సామాన్యంగా పత్రికల్లో కన్పడే వ్యాసానికి ఈ వ్యాసానికీ తేడా స్పష్టంగా కనప్పడుతుంది. ఈ వ్యాసం వ్యక్తిగతం; విషయగతంకాదు. వ్యాసకర్త యొక్క వ్యక్తిత్వం అడుగడుగునా వ్యాసంలో కన్పడుతుంది. వ్యాసకర్త తన దృక్పథంలో నుండీ, తన అనుభవంలోనుండీ విషయాన్ని చెపుతాడు. కథానిక ఏవిధంగా జీవితానుభవంలోని లేశమాత్రం చిత్రీకరిస్తుందో అదే విధంగా వ్యాసం జీవితానుభవంలోని ఒకదృక్పథాన్ని మాత్రమే పాఠకుని ఎదుట పెడుతుంది. వ్యాసంలో చెప్పే విషయం సంక్షిప్తంగా, కళాత్మకంగా చెప్పబడుతుంది.

ఈరోజుల్లో రాజకీయ సమస్యల గురించి

సాంఘిక దురాచారాల గురించీ, స్త్రీలోకపు సమస్యల గురించీ వ్యాసాలైతే అధిక సంఖ్యలో వస్తున్నాయి. కాని వాటిలో వ్యక్తిగతమైన దృక్పథం కన్పడదు అవి విషయగతాలు. వాటిలో స్వానుభవం పూజ్యం. అంచేతే అవి సాహిత్య ప్రక్రియయైన వ్యాసకోటిలో పరిగణించబడవు. ఉత్తమమైన వ్యాసం వ్యాసకర్త యొక్క ఆకర్షణీయమైన వ్యక్తిత్వంతో అలరారుతుంది. అతని అనుభూతులు, భావనలు పాఠకునిలో చైతన్యాన్ని కలగచేస్తాయి. సూక్ష్మ పరిశీలనా శక్తితో కూడిన జీవిత విమర్శ పాఠకునిలో పరివర్తన తేగగ్లుతుంది. బుద్ధి వైశాల్యం ఎక్కువగా లేకపోయినా జీవితానుభవంలో నుండీ, సర్వ సామాన్యమైన ఘటనలనుండీ అత్యుత్తమమైన సాహిత్య పరమైన వ్యాసం రచించిన రచయితలు కన్పడతారు. వారి వ్యాసాలు గద్యరచనకి నికషాలుగా వారి తర్వాత రచయితలకు మార్గదర్శకాలుగా ఉంటాయి.

మిగిలిన సాహిత్యశాఖల ఇతివృత్తాల ఎన్నికకి ఏవిధంగా వ్యాపకమైన క్షేత్ర ముందో అదేరీతిని వ్యాసానికికూడా ప్రతి విషయమూ ఉపయుక్తమైనదే అవుతుంది. అయితే తీసుకున్న విషయాన్ని వ్యక్తిగతమైన అనుభవంతో మేళవించి జీవితాన్ని విమర్శిస్తూ, సరళమైన శైలిలో రసానందాన్ని అందచేసే రచనగా రూపొందించాలి. లేనట్లయితే ఆ వ్యాసాలు మరీ తేలికైన, నగణ్యమైన రచనలుగానైనా ఉంటాయి, లేదా పాండిత్య ప్రకర్షతో బరువుగా క్లిష్టంగానైనా రూపొందుతాయి.

ఏ సాహిత్యశాఖ ప్రయోజనమైనా ఒకటే. ఆనందాన్ని కలగచేస్తూ, జీవితాన్ని సరిదిద్ది, జీవితానుభవాన్ని అందజేయడమే వాటి పరమావధి. అదే కారణంగా మన ప్రాచీనులు కాంతా సమ్మితంగా విషయాన్ని చెపుతూ రస పోషణకి ఎక్కువ ప్రాధాన్యాన్ని యిచ్చేరు.

వ్యాసంలో ఏరసమైనా పోషించవచ్చును. కాని వ్యాసరచనకి హాస్యరసం ఎక్కువ ఉపయుక్తమైనది. పాశ్చాత్యుల వ్యాసరచనలో మిగిలిన రసాలకన్నా హాస్యరసానికి ఎక్కువ ప్రాధాన్యం యివ్వబడ్డది.

హాస్యరసానికి మిగిలిన రసాలకన్నా ఎక్కువ ప్రాముఖ్యముంది. నవ్వు నాలుగేనుగుల సత్తువ నిస్తుందన్న నుడి అసత్యం కాదు. ఆధునిక జీవ శాస్త్ర రీత్యా కూడా హృదయపూర్వకమైన హాసం మానవునికి మంచి ఆరోగ్యాన్ని చేకూరుస్తుంది. ఆరోగ్యకరమైన నవ్వు ఇటు జీర్ణ శక్తికి దోహద పడ్తుంది అటు మనస్సునీ, బుద్ధినీ క్షాళితం చేసి నిర్మల పరుస్తుంది.

పాశ్చాత్యుల రచనల్లో పై ఉద్దేశాన్ని దృష్టిలో పెట్టుకుని హాస్యరసం పోషించబడుతుంది. కేవలం కడుపుబ్బా నవ్వించడమే రచయితల పరమావధి కాదు. ఇది అడుగడుగునా పాఠకుని నవ్వేటట్లు చేస్తుంది. పాఠకుడు తనకు తెలియకుండా తన్మయుడౌతాడు. ఈ హాస్యం వ్యక్తిని ఏ విధంగానూ హింసపెట్టదు. హింసపెట్టకుండా సున్నితంగా వ్యక్తి దోషాల్ని బహిర్గతం చేసి తనలో ఉన్న లోటుపాట్లకు తానే నవ్వుకునేటట్లు చేస్తుంది.

మనిషిలో మార్పు తీసుకు రాగల్గే గుణం ఈ హాస్యంలో ఉంటుంది. ఈ పద్ధతిలో ఉత్తమ హాస్యరచన చేసే రచయిత తనను తాను విమర్శించుకొంటూ, తన లోటుపాట్లకు తానే నవ్వుకునే స్థితినుండి రచన చేస్తాడు. రచనికి మూలభూతమైన ఈ పద్ధతి కారణంగా ఈ హాస్యరసపోషణ వ్యాస ప్రక్రియకి ఎక్కువ అందాన్ని చేకూరుస్తుంది.

పాశ్చాత్యుల హాస్య రచనలు కేవలం హాస్యాన్ని పోషించటానికి మాత్రమే రచించబడవు. నవ్వుని నవ్వుమాత్రంగా తీసుకొని నట్లైతే మీద చెప్పిన ప్రయోజనం సిద్ధించలేదు. అందుచేతకొందరురచయితలు హాస్యంతో పాటు కరుణరసాన్ని కూడా మేళవించి వ్రాశారు. వారి రచనల్లో హాస్యం వెనకాతలే కరుణ దాగి ఉంటుంది. హాస్య కరుణాలు రెండూకలిసి పాఠకుణ్ణి అభిభూతుణ్ణి చేస్తాయి. ముందు పాఠకుడు ఫకాలుమని నవ్వుతాడు. నవ్విన వెంటనే దాని వెనక దాగి, దానిలోనుండి ఉత్పన్నమయే కరుణవల్ల వలవలా కన్నీరు కారుస్తాడు. నవ్వడం, నవ్విన వెంటనే విషాదమైన పరిస్థితికి కన్నీరు కార్చడం అప్రయత్నంగానే జరుగుతాయి. ఈ రెండు రసాల మేళవింపుతో రచయిత యదార్థ పరిస్థితుల స్వరూపాన్ని పాఠకుడికి సుబోధకం చేస్తాడు. పాఠకుడు చదువుతూ ఆనదిం స్తాడు. జీవితాన్ని తీవ్రంగా తర్కించుకోనూ తర్కించుకుంటాడు. హాస్యంతోపాటు కరుణముండి తీరాలని కాదు. హాస్యంతోపాటు రచనలో గంభీర భావం యిమిడి ఉంటుంది. ఆ గంభీరమైన భావం పాఠకునిలో ఆలోచనాశక్తిని రేకెత్తించి యదార్థ పరిస్థితుల జ్ఞానాన్ని కలగ చేస్తుంది.

పై విధమైన హాస్య రసపోషణ వ్యాసానికి ఎక్కువగా ఉపయోగ పడుతుంది. వ్యాసరచనా ప్రయోజనం దీని వల్లే సాధించబడుతుంది. మన సాహిత్య వేత్తలు వ్యాసరచనా ప్రాముఖ్యాన్నీ, దాని విశిష్టతనీ గుర్తిస్తూ, దానిని అత్యుత్తమ మైన సాధనముగా వినియోగించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

తెలుగులో వ్యాసాలు రావడం లేదా

అంటే వస్తూనే ఉన్నాయి. వ్యాసకర్తలుగా వ్యవహరించబడే వారి వ్యాసాలు పై విధమైన, సాహిత్య పరమైన వ్యాసాలు కావు. ఈ రోజుల్లో సాహిత్యంపై చేసిన విమర్శనా వ్యాసాలను కూడా వ్యాసాల శ్రేణి కింద లెక్కగట్టడం పరిపాటి అయింది. విమర్శనా వ్యాసాలకీ, విషయ సేకరణ చేసి రాసిన వ్యాసాలకీ, విషయ పరిజ్ఞానాన్నిచ్చే వ్యాసాలకీ. సాహిత్య పరమైన వ్యాసాలకీ ఎంతో భేదముంది. సాహిత్యపరమైన వ్యాసం మిగిలిన సాహిత్యశాఖలవలె సృజనాత్మకమైన ప్రతిభతోనే వ్రాయబడుతుంది. కల్పనాశక్తి, భావనాశక్తి లేని రచయిత ఈ వ్యాసాన్ని రచించలేడు. కేవలం విషయ సేకరణ చేసి వ్యాసరచన కుపక్రమించే రచయితకీ, భావుకుడూ, కల్పనాశీలి యైన రచయితకి ఎక్కడా పోలిక ఉండదు. ఈ విషయాన్ని అటు రచయితలూ ఇటు పాఠకులూ కూడా గుర్తించాలి. అప్పుడే సాహిత్య ప్రక్రియయైన వ్యాసరచన ఎక్కువగా చేయబడుతుంది.

సాహిత్య పరమైన వ్యాసరచన పాశ్చాత్యుల రచనల్లో ఉత్తమస్థాయిని చేరుకుంది. మన దేశభాషలలో వ్యాస రచనవైపు రచయితల దృష్టి ప్రసరించడమైతే ప్రసరించింది కాని ఉత్తమశ్రేణికి చెందిన వ్యాసాలు ఎక్కువగా రాలేదు. తెలుగు సాహిత్యంలో కూడా ఈలోటు కన్పడుతోంది. కొద్దిమంది రచయితలు ఈ ప్రక్రియను తమ సాధనంగా చేసికొని రచనా వ్యాసంగం చేసినా అది ఉత్తమ ఫలితాల్ని యివ్వలేదు.

సాహిత్యశాఖగా వ్యాసరచన నేటిపత్రికా ప్రచురణకి అవసరం. పాఠకులకీఅవసరమే. విపరీతంగా పత్రిక లున్నా, పాఠకులున్నా వ్యాసరచన కొనసాగించ బడటంలేదు. ఇది సాహిత్యవేత్తలందరూ చింతించవలసిన విషయమే.

వ్యాసరచనకి ప్రధానమైనది బుద్ధి వైశాల్యం. బుద్ధి వైశాల్యం కలిగి మంచి జీవితానుభవాన్ని జీర్ణించుకొన్న రచయితలు లేకపోవడమే వ్యాసరచనాదారిద్ర్యానికి కారణంగా కన్పడుతుంది. ఉత్తమమైన వ్యాసరచన ఏనాడైతే మన భాషలో వృద్ధి పొందుతుందో ఆనాడు మన రచయితల బుద్ధి వైశాల్యం పెరిగిందని భావించ వచ్చును.

---

# ప్రతిన

మామిడి

క్రూరులు చైనా దొంగలు
కృతఘ్నతను నెఱపిరని
కొడుకుల మేమంత యుండ
కుమిలి ఏడ్వ నేలనే ?

భయము వలదు భారతీ
జయము మనదె భారతీ

మొన్న మొన్న జేసినట్టి
మనమేలుల మరచినట్టి
మిత్రద్రోహి చౌఎన్‌లైని
మెడబట్టి నేల గొట్టి

మాతృదేవినీ స్వేచ్ఛకు
మా ప్రాణము లొడ్డెదము

తథాగతుని సిద్ధాంతపు
తోలును పైగప్పికొన్న
దగాకోరు చైనీయుల
దారుణ కృత్యా లిటుపై

సాగవులే మనపైనా
దాగనీయ మికపైనా

దర్ప మన్న దెరుగనట్టి
తటస్థ మా రాజ్యముపై
సర్పమువలె కాటు వేయ
సమకట్టిన చైనీయుల

సర్పవైరి పగిది మేము
దర్ప మణచి తీరెదము

సత్యశాంతి భారతినీ
సరమునందు సమర మనే
సర్పము వై చిన నీచుల
తక్షకుడు దహించుగాక

పంచశీల వంచకులను
పాలాక్షుడు నోపడులే

రెట్టించిన బల మనచును
పొట్టివారు ప్రగల్భాలు
కొట్టినంత మాత్రాననె
కొదువ లేదు నీ కేమి

"కడవడంత గుమ్మడైన
కత్తికి లోకువయేగా"

కండలు తిరిగిన యోధులు
గుండెల చెండాడువారు
గండర గండలు వేయిలు
కొండల మిండెలు కోట్లు

అక్షయమ్ము నీదు బలము
వీక్షింపవె వెను దిరిగి

చెండాడి చీల్చిద్రుంచి
గుండెల రక్తము త్రాగె
బెండుబోని వీరు లంత
దండిగ నీ కండ యుండ

గుండె లదరి పోవునటుల
కుమిలి ఏడ్వ నేలనే ?

కుందేల్లే మగటిమితో
కుక్కల తటిమెను యిచ్చట
అందల మెక్కెను వీరత
ఆంధ్రరాజ్య పాలనలో

కేంద్రములే మన భూమి
కలకాలము వీరులకు

అరివీరుల శిరసులతో
ఆడి రిచట నీ బిడ్డలు
చిరుపాపలె కత్తి బట్టి
చిరస్థాయిగ నిలచినారు

కరువు లేదు వీరులకు
కలకాలము నీకు తల్లి

పంచ మహాపాతకుడై
వంచన చేసిన నీచుడు
చౌఎన్‌లైని గుండె జీల్చి
చిందెడి రక్తముతోడ

పంచశీల పాంచాలిరో
పట్టుకురులు విప్పెదము

మన్ను మిన్ను ఏకమైన
మనుగడలే మారినా
కలకాలము నీదు స్వేచ్ఛ
కాపాడగ మే మంతా

నిక్కమునీ పదములాన
నిలచి "ప్రతిన" చేసెదము

# బహుముఖ విజ్ఞాని సాంఖ్యాయన శర్మ

(1864–1933)

— దేవగుప్తాపు విశ్వేశ్వరరావు

ఇటీవల శతజయంత్యుత్సవములు చేయవలసినదిగా విజ్ఞప్తి ముప్పయి మందికి పైగా విజ్ఞుల తరఫున ప్రచురణ అయిన కీ.శే. మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారెవరా అని నేటి తరము ఆంధ్రులకు సందేహము గలుగ వచ్చును. నేటికి 30 సం॥ క్రితం స్వర్గస్తులైన ఈ మహావ్యక్తిని గూర్చి నేడు చాలా మంది ఎరుగక పోవటం ఆశ్చర్యంలేదు. ఆంధ్రదేశ జీవితంలో పిమ్మట కలిగిన మార్పులలో ఇట్టివి స్మరణలు సహజమే కావచ్చును. కాని, 1933 నాటికి అర్ధ శతాబ్ది తక్కువ గాకుండా దేశంలోని కళా విజ్ఞాన రంగంలో వీరవిహారం చేసిన ఆంధ్ర భీష్మలీయన అని నాటి తరములవారికి బాగా గుర్తున్న విషయమే. బహుముఖ విజ్ఞానిగా, మహా మేధావిగా, ఉపన్యాస కేసరిగా, చమత్కారిగా, వాక్చతురునిగా, పత్రికా సంపాదకునిగా సాంఖ్యాయన శర్మగారు ఆంధ్రజాతిని, సేవించి, పాలించి, లాలించి దివంగతులైన మాన్యజీవి. ఇటీవల ఢిల్లీలో ప్రచురణమైన ఆంధ్రప్రదేశ్ దశాబ్ద సమీక్ష సంచికలో దివంగతులైన ఆంధ్ర సుప్రసిద్ధుల వర్గీకరణంలో 'చమత్కారు' లుగా వర్ణింపబడిన నలుగురి (సాంఖ్యాయనశర్మ, వేదం వేంకటరాయ శాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కట్టమంచి రామలింగారెడ్డి) లోనూ మన సాంఖ్యాయన శర్మ ప్రప్రథములుగా విజ్ఞులఏకాభిప్రాయంగా నమోదు కాబడింది. ఇంకా, సంభాషణ చతురుల ఐదుగురిలోనూ, శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ప్రథములుగానూ, సాంఖ్యాయనశర్మగారు రెండవవారుగానూ అభిప్రాయం తేలినది. మిగతావారు వరుసగా ఆంధ్రరత్న గోపాలకృష్ణయ్య, చిలకమర్తివారు, రామలింగారెడ్డిగారున్నూ! ఇట్టి స్థాయికి ఏనాడో వచ్చిన మన మహోపాధ్యాయుని ఆంధ్రజాతి ప్రగతిలో నేటి స్థితిలో తగువిధంగా సంస్మరించి గౌరవించడం జాతి పురోభివృద్ధికి, సంప్రదాయ గౌరవానికి దోహదకారి యని వేరే చెప్పనక్కరలేదుకదా.

పశ్చిమ గోదావరిలోని ఆచంట గ్రామం నుంచి వీరి పూర్వీకులు నాగావళీ తీరం ఏనాడో వచ్చేశారు. వీరు రక్తాక్షి సం॥ ఆశ్వీజ బహుళ పంచమి మృగశిర నక్షత్రంలో జన్మించారు. చిన్నప్పుడే మిడిల్ స్కూల్ పరీక్షలో ప్రెసిడెన్సీలో ప్రప్రథములుగా ప్యాసయినారు. పిమ్మట 1880 ప్రాంతంలో నడిచిన శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారి 'ఆంధ్రభాషా సంజీవని' 'మందార మంజరి' 'ప్రబోధ కల్పవల్లి' మొ॥ పత్రికలు చదివి 'సుజన ప్రమోదిని' ని 10.6.1881 తేదీ నాడు తన 18 వ ఏటనే ప్రారంభించి దేశంలో చాలా గుర్తింపు సంపాదించారు. 1885 లోనే శతావధానము ప్రారంభించారు. ప్లీడరుగా పార్వతీపురం మున్సబు కోర్టులో చేరారు. వీరు బహు స్ఫురద్రూపులు — ఆకారము, ప్రజ్ఞ, వాక్చాతుర్యము అన్నీ ఒకటి మించి మరొకటి ఈయన ముందు స్ఫురీకరించెడివి. సమయస్ఫూర్తి, పరేంగిత జ్ఞామున, హాస్య సంభాషణలు వీరి సొమ్ములు. ఆ రోజులలో పరవస్తు వెంకట రంగాచార్యులు, కొక్కొండ వేంకటరత్నం పంతులుగార్లు మంచి సంభాషణా చతురులుగా పేరు పొందారు. వారి కోవలో శ్రీ సాంఖ్యాయనశర్మగారు చెంద గలిగినవారని చెప్పవచ్చును. పండిత రంజకమైన వకృత్వమేగాక, సామాన్య ప్రజాగ్రహితమైన మాటనేర్పుకూడ ఈయన కుండేది. ఈ విశిష్టశక్తివలన ఈయన ఎంత మహా సభలోకూడ శ్రోతలను విసిగించక ఉల్లాస పరచి ఎంతో ఉత్సాహ పరచేవారట.

1892 లో వీరి ఆంధ్ర పద్యావళి ప్రచురింపబడినది. "రహస్య దర్పణము"లో అదృశ్య ప్రపంచ రహస్యాలూ, క్రిమికీటక పక్షి జంతు యాత్రారహస్యాలు అపూర్వ పరిశోధనలూ ఉన్నవి. "కల్పలత" వైజ్ఞానిక పత్రికగా 1903 లో ప్రారంభించి కొన్నేళ్ళు నడిపి అది తిరిగి 1919 లో ప్రారంభించారు. 1908 లో వేంకట పార్వతీశ్వర కవుల జంటగా కలియక వీరి పత్రికలోని ఒకానొక సమస్యా పూరణము వలననే. 'కల్పలత'లోని సమస్యలకు సమాధానంలో మొదటిబహుమానం ఓలేటి పార్వతీశంగారికీ మూడవ బహుమతి బాలాంత్రపు వేంకటరావుగారికి రాగా, ద్వితీయ బహుమతి పొందిన నడుకుదుటి వీరరాజ కవిగారు బంధువులైన వీరిద్దరిని అనుసంధానము చేసిరి. శ్రీ సాంఖ్యాయన శర్మగారు కవిత్వ, శిల్ప, నాటక, చిత్రకళాది లలిత కళారంగాలలోనే గాకుండా, భూ వృక్ష, క్రిమి,

కీటక, ఖనిజ, లోహ, వైద్య భౌతిక రసాయన శాస్త్రాలలో కూడా అసాధారణమైన పరిజ్ఞానం సంపాదించి పరిశోధనలు చేసినవారు. స్వర్గీయులైన ఆంధ్ర ప్రజా విజ్ఞాన రంగంలోని మహారథులలో శ్రీ శర్మగారి మిత్రులు, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు, గిడుగు రామమూర్తి పంతులు, గురజాడ అప్పారావు, మారేపల్లి రామచంద్రకవి, వేదం వేంకటరాయశాస్త్రి, శ్రీ విక్రమదేవవర్మ, ఉమరాలీషాకవి, బుర్రా శేషగిరిరావు, సెట్టి లక్ష్మీ నరసింహం ప్రభృతులు. ఆయనను బాగా ఎరుగుండి, సహచరులై ఉన్నవారిలో ప్రముఖులు శ్రీ గిడుగు సీతాపతిగారు, చట్టి చిన పూర్ణయ్య పంతులు (శ్రీకాకుళం), అయ్యగారి నారాయణమూర్తి (బొబ్బిలి) గార్లు. వీరి జీవిత విశేషాలు, ఉదంతాలు బాగా తెలిసున్నవారు శ్రీ ఆచార్య నిడదవోలు వెంకటరావు, పురిపండా అప్పలస్వామిగారు, కీ. శే. కోన వెంకటరాయశర్మ, మల్లాది విశ్వనాథశర్మగార్లు. స్థానికంగా వీరి అభిమానులు శ్రీ నడిమింటి పతంజలిశాస్త్రి, చీకటి పరశురామనాయుడుగార్లు (M.L.C.). వీరిరువురూ పార్వతీపురం వాస్తవ్యులు. నేడీయన శతజయంత్యుత్సవాల పట్ల ఉత్సాహులైనవారు శ్రీ తెన్నేటి విశ్వనాథం, బండారు తమ్మయ్య, శివశంకరస్వామిగార్లు. శ్రీ శర్మగారిని లోగడనుంచి ఇతోధికంగా ఎరుగున్నవారే!

1923 లో గుంటూరు జిల్లా నండూరులో జరిగిన ఆరవ ఆంధ్ర సారస్వత సభలలో ఈయనకు మహోపాధ్యాయ బిరుదు ప్రదానము జరిగినది. 1924 లో తణుకులో జరిగిన 13 వ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వార్షిక సభలకు అధ్యక్షతవహించి శర్మగారు చూపిన చాకచక్యం వలన అక్కడ జరిగిన వివాదములు తేలి ఒక కొలిక్కి వచ్చినవి. వీరి అధ్యక్షోపన్యాసము చాలా పొగడబడి శారద పత్రిక 2 సంచికలలో పడినది. పిమ్మట నిడదవోలు, పెదచెఱుకూరు సభలలో వీరు చేసిన మహోపన్యాసములు వీరి కెంతో ప్రశస్తి, ప్రశంసా చేకూర్చినవి. 1929 లో తెనాలిలో నేటి ఆంధ్రనాటక కళా పరిషత్తు స్థాపింపబడిన సందర్భంలో వీరి ప్రథమ అధ్యక్షోపన్యాసము, సభానిర్వహణము బహుకాలము సంస్మరించ దగినవి. నాటక కళా పరిషత్తును స్థాపించిన ఇతర సహసభ్యులు, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు, విశ్వనాథ కవిరాజు, వనారస గోవిందరావు, కొత్తపల్లి లక్ష్మయ్య, నేటి శ్రీకాకుళం వాస్తవ్యులు శ్రీ చట్టి చిన పూర్ణయ్య పంతులుగార్లు.

శ్రీ శర్మగారి తండ్రి బాపిరాజుగారు; తల్లి నరసాంబ వీరి కవిత్వము రసస్ఫోరకము; సరళ పదభరితము. వీరి సంస్కృతానువాద నాటకాలు విక్రమోర్వశీయము, ఉత్తరరామ చరితము రావలసిన గణనలోనికి రాలేదు. స్వతంత్ర నాటకాలు: సుధానిధి, మనోరమ, పార్థపరాజయము, అవధూత కలభకము నాలుగు. చాల కాలము చినకిరంగి ఏస్టేటు దివానుగా ఉన్నారు. వీరి మనమరాలు శ్రీమతి ఊటుకూరి వెంకటరత్నమ్మగారు హైద్రాబాద్‌లో నివాసం. విశాఖలోని తమ్ముని కుమారులైన శ్రీ బాపిరాజుగారు 70 ఏళ్ళవారు; పట్టభద్రులు — ఆంధ్రాంగ్లభాషల్లో పండితులూ, బహుకావ్య కర్తలు. వీరు రచించిన గ్రంథములు అనేకములు అముద్రితముగా ఉన్నవి... శ్రీ శర్మగారు శ్రీముఖలో (3 ఆగస్టు తేదీని) శ్రావణ శుద్ధ విదియ మంగళవారంనాడు దివంగతులైరి.

శ్రీ శర్మగారి కవిత్వంలో కొన్నిపద్యాలు ఉదాహరణకు :—

పట్టిన దెల్లఁ బైడియగు
 భంగిని పల్కిన పల్కుపద్యమై
యుట్టి పడంగఁ జెప్పినదె
 యొప్పిన వేదము కాగ సత్కథల్
కొట్టిన పిండిగా గవిత
 గూర్చిన ధన్యులు లోకమాన్యులన్
బుట్టను దిప్పనుం బొడమి
 పూజ్యత గాంచినవారి నెన్నెదన్ —
"సుధానిధి"

ఆటవెలదులన్న తేటగీతములన్న
మనసు కరఁగిపోవు మంచుపగిది
ఆటలేక తేట పాటయు లేకున్న
వెలఁదు లున్నఁ జాలు వేవరాలు.
"ఆట వెలదులు — తేటగీతములు"

బిందె చిందెడు కాఫీకి పిడుగు తునుక
కట్ట చుట్టలఁ కాల్చెడి పుట్టు భోగి
బుట్టె డాకుల నమలెడి పుణ్యభోగి
నాగరికు లన్న వేఱె యున్నారె, వీరె.
"సంఘ సంస్కరణము"

"బహిస్సర్వాకార ప్రవణ రమణీయం వ్యవహరన్" అనే భవభూతి శ్లోకానికి తెనుగు సేత :—

మన సెటు లుండనీ పయికి
 మాటలఁ జేతల చేత లోకరం
జన మొనరింపుచున్ దనరు
 స్వల్పపు దోషములైన దాచుచున్
జనులను, మోసపుచ్చి యొరు
 చాడ్పున నేర్పరి తాఁ దటస్థుడై
తన పని చక్కఁ బెట్టుకొనుఁ
 దాల్చును బిమ్మట మౌనముద్రయున్.

ఇట్టి శ్రీ సాంఖ్యాయనశర్మగారిని మిత్రులు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు తమ 'ఆంధ్ర నలంద' శతకము (114) లో ఇట్లు స్తుతించిరి :—

కం. "అనుపమ మేధాశాలిని
 మనవప్రతిభాంకు సద్విమర్శకమణినిన్
ఘనుని యాచంట సాంఖ్యా
 యను నుతియించెద సతంబు
నాంధ్రనలందా!

# ఊరగొండ

నాయని సుబ్బారావు

(పొదిలెకొండ ప్రత్యంత పర్వతం, ఊరగొండ. ఊరివారికి అన్నివిధముల అందుబాటులో నుండుటచే ఊరగొండ. ఆ కొండలో 'బుచ్చి' యను నవ్వ యున్నది. 'ఊరగొండ బుచ్చీ' యని పిల్చినచో 'ఓ' యని మారుపల్కును.)

కొండ యన్న నూరగొండయే కొండ త
త్తాళవనము దాటి దక్షిణమున,
గుండె చెదరి నరులు కూ పెట్టినంతలో
బండ లెల్ల నభయవాక్కు పలికి.

పొదిలె పశుగణమ్ము పోవు నా కొండకు
కడుపునిండ పచ్చిగడ్డి మేయ,
పొదిలె బీదజనము పోవు నా కొండకు
పొట్టకొరకు కట్టెపుల్ల లేర.

కలివెపండ్లు జానపండ్లు గారపండ్లు తరపి వె
న్నెలలు విరియు పాలపండ్లు నెమ్మిపండ్లు కొమ్మిపం
డ్లలరు బలుసుపండ్లు నాదియైన వన్యఫలము లే
కొలదివెట్ట కిచ్చు నూరగొండ పొదిలె కెప్పుడున్.

పాలు పెరుగు త్రావు పట్టున, ముప్పొద్దు
కుడుచువేళ, కొసరి కొసరి కొనెడు
కాలమందు పండ్లొ కంటికి రెండుగా,
నూరుగొండ మెచ్చు నూరి జనము.

కక్కిరిబిక్కిరై పొదలు కంపలు చెట్లును చేమ లంతటన్
మిక్కిలిమూగి సావయవనిశ్చయమేదిన యూరగొండయున్
చిక్కులు జీరులౌ కురులచే తల యెల్ల ముసుంగు వడ్డదై
ముక్కు మొగమ్ము వేర్పడని ముత్తవగా కనిపించు కంటికిన్.

ఊరగొండ యవ్వ యొక బూచివోలె క
న్పడిన నేమి కరుణపట్టెడంద,
పొదిలె జనులు కుతుక పూర్ణాంతరంగులై
పిలిచినంతలోన పలికి తీరు.

అవ్వ రాజసము మహారాజులకు లేదు,
తలలు మార్చు మంతురులకు లేదు,
అంత కొమ్ము తిరిగినట్టివాడును ముందు
పలుకవలయు, పలుకవలయు నవ్వ !

ఏయెడ నెవ్వరేని గళమెత్తి తటాలున నూరగొండ బు
చ్చీ యన, నో యటంచు, వివశీకృత సర్వ దిగంతరమ్ముగా,
శ్రీ యమృతత్వ సంపిహిత చిన్మయ శబ్దవలన్మహాగభీ
రాయతిమారు మ్రోయునగమంతయు, నందలి
బుచ్చి యెవ్వరో !

పండ్లుకో యగవచ్చు పడతులు పసుల కా
పరులు కట్టెలు కొట్టువారు నడవి
మెకముల భీతి నాయక బిల్చి తదభయాయ
తశబ్దఝురి స్తిమితాత్ములగుదు,
రనువత్సరము నృసింహస్వామి తిరునాళ్ల
దరిసింప పొదిలె భూధరము నెక్కు
వారు వేబోక తత్పాదస్థమగు పర్వ
తాల బావి సమీపధరణి విడిసి,

మొగములను గుంజి, చలుదుల ముద్దు తీర్చి,
తరము నుత్సాహమున రేగి, తరిమి తరిమి
ఒక్కమెయి పిల్పుటరపుల నూరగొండ
బుచ్చి నుసికొల్పెదరు పంతమచ్చుపడగ.

కోకిలకూతకుం బ్రతిగకూయు మనుష్యులకోహటించి యా
కోకిలనోరు మూతవడు కొంచియమున్న దొకప్పుడైన, శ
బ్దాకృతి బుచ్చి తన్గదుపునయ్యలనోళ్లు ప్రతిధ్వని ప్రభా
వాకలనావిచేష్టముగ నప్పటికప్పుడు నొక్కు నెప్పుడున్ !

ఎవరా బుచ్చి ! పరార్థసాధన దురంతేచ్ఛాప్రభూతాంచిత
వ్యవసాయ ప్రవణాంతరంగమున నిత్యమ్మైన ఓంకార మం
త్ర వివేకమ్ము శివార్థహీనమయి, తద్వ్యాఘాతనిష్పీడితా
యువుగా దూరిన దూరగొండ యెదలోనో కారసర్వస్వమై!

కడు పాపాత్ములకెల్ల నోళ్లుపడగా కండల్ తెగం బెంచుచున్
బడిదయ్యమ్ములలీలకాయములుతీర్పం భూమికిం భారముల్,
కడుపుణ్యాత్మికబుచ్చికండలరుగన్ కాయమ్మపాయమ్ము పా
ల్పడియున్ కంఠగతైకశబ్దమయ తత్వస్ఫూర్తిదీపించెడున్!



అప్పుడు మేం చాలా చిన్న పిల్లలం. ప్రయిమరీ స్కూలులో చదివేవాళ్ళం. ఎవరైనా ఎక్కడి కెళ్తున్నా రని అడిగితే స్కూలు కని రొమ్ము విరుచుకుని ఎంతో గొప్పగా చెప్పేవాళ్ళం. పాఠశాలకనటానికి ఏమిటో సిగ్గేసేది. మా మాష్టారిని ఊళ్ళోవా ళ్ళందరూ 'పండిత్‌జీ' అనేవారు.

రాయ్‌బాబుగారి వరండాలో మా క్లాసు జరిగేది. చాపలమీద కూర్చునేవాళ్ళం కాదు. కుర్చీలు, బెంచీలు వుండేవిమాకు. స్కూలు కెదురుగా ఒక చిన్న చెరువుండేది. అది ఎప్పుడు తవ్వారో తెలియదు కాని దాంట్లో నీ రెప్పుడూ మురికిగానే వుండేది. ఆ చెరువులో చటర్జీగారి గౌరి తలలో వున్నట్టు

బెంగాలీ కథ

మూలం :

రమాపద చౌదరి

అనువాదం :

కలగర సాంబశివరావు

ఎప్పుడూ అయిదారు అడివిపువ్వులు పూసేవి. వాటి వంకాయరంగు మాకెంతో బాగుండేది.

పండిత్‌జీ మా కొక లెఖ్ఖ యిచ్చి బయటకు వెళ్ళిపోయేవారు, ఆయన వెళ్ళగానే అల్లరి మొదలుపెట్టేవాళ్ళం. పండిత్‌జీ భార్య రావటంచూస్తే చాలు కిక్కురు మనకుండా కూర్చునేవాళ్ళం. ఆమె సిద్ధూ కొట్టుకు వెళ్ళి ఒక చటాకు నూనో, ఉప్పో, మిరపకాయలో తెమ్మనేది. తెమ్మన్నవన్నీ తెచ్చిపెట్టి చెరువువైపే చూస్తూ "ఈ చెరువులో ఎంత పెద్దచేప లున్నయ్యో" అనుకుంటూ కూర్చునేవాళ్ళం.

అనువాదభారతి

ఆంధ్ర ప్రదేశ్

సెలవు రోజుల్లో గేలం తీసుకుని చెరువు ఒడ్డున కూర్చునేవాళ్ళం. ఎంత తిప్పలు పడ్డా మాకు చేపలు దొరికేవికాదు. ఎప్పుడైనా ఆ చెరువు నెవరైనా బాగుచేయించిన పాపాన పోతేనా! చేప లెక్కడినుంచి వస్తాయి? చేప లున్నా లేకపోయినా మాకు మల్లే చటర్జీ కుటుంబానికి చెందిన అవనీ కాకా కూడా గేలంపట్టుకు వచ్చేవాడు. మేము ఆయనను 'జంగలీకాకా' అనేవాళ్ళం. ఆయనకు 'జంగలీకాకా' పేరెందుకొచ్చిందో మాలో ఎవరికీ తెలియదు. ఆయన గడ్డం, మీసాలు బాగా పెరిగిపోయి వుండేవి బట్టలు బాగా మాసిపోయివుండేవి. అందుకే ఆ పేరు వచ్చిందేమో?

చెరువుకు అవతలిపక్క 'దివాన్‌పుర్' వుండేది. చటర్జీ వంశంలోని వారెవరో దీవాన్ అయినప్పుడు ఆ యిల్లు కట్టించారట. అంత పెద్దయిల్లు ఆ ప్రాంతంలో ఎక్కడాలేదు. ఆ యింటి ద్వారాలు ఎంత పెద్దవో అంత గట్టివని అంటుంటారు. కాని చూసే నాధులెవరూ లేకపోవటంవల్ల ఆ యింట్లో సగం అడివిలో కప్పడిపోయింది. ఎక్కడపడితే అక్కడే చెట్లు మొలిసిపోయాయి. ఇటికలు నల్లబడిపోయాయి. అర్ధరాత్రి చూస్తే భయంవేసేది.

భయం వేయటానికి కారణంకూడా ఉంది. ఆ యింట్లో ఎప్పుడూ వెల్తురే వుండేదికాదు. ఆ యింటి కిప్పుడు అవనీ కాకా యజమాని. ఆయనకు భార్య, ఇద్దరు కొడుకులు, ఒక కూతురు వుండేవారు. కూతురుపేరు గౌరి ఇంతమంది ఆ యింట్లో వున్నా ఎప్పుడూ వెల్తురే వున్నట్టు కన్పించేదికాదు. ఎప్పుడైనా లైటు వెలిగించేవారో లేదో! ఎప్పుడూ టక్, టక్ మనే శబ్దంమాత్రం వినిపించేది.

కొందరు దెయ్యమనే వారు. కొందరు గుడ్లగూబలనేవారు. ఎవరేమన్నా సాయంత్రమయితేచాలు, మేమెవరం ఆ దారిన వెళ్ళే వాళ్ళంకాదు. పగలుమాత్రం మా కేమీ భయం వేసేదికాదు. అప్పుడప్పుడూ ఒక రిద్దరు మనుషులు ఆయింటికి వస్తూ పోతూ వుండేవారు. పగలు జంగలీకాకా, గౌరి మాకు కనిపించేవారు.

గౌరి పెద్దన్న పట్నంలో చదువుకునేవాడు. అక్కడే హాస్టలులో వుండేవాడు. శలవుల్లో మాత్రం యింటికి వచ్చేవాడు. గౌరి చిన్నన్న చదువు మానేసి గోళీబిళ్ళలాడటం, బీడీలు తాగటం, జూద మాడటం చేసేవాడు.

గౌరి నాకు చాల బాగుండేది. ఎప్పుడూ చక్కని బట్టలు, చేతులకి గాజులు, చెవులకు లోలాకులు పెట్టుకునేది. కాని ముక్కు మాత్రం కొంచెం పెద్దదికావటంవల్ల మోటుగా కనిపించేది. తన బట్టలను చూసుకుని గర్వపడేది. అందుకే అప్పుడప్పుడూ "మేం గొప్పవాళ్ళం" అంటూవుండేది.

గొప్పవాళ్ళని ఎవరి నంటారో, ఎంత డబ్బుంటే గొప్పవాళ్ళో మాకు ఆ రోజుల్లో తెలిసేదికాదు. అంతపెద్దిల్లు ఆ ప్రాంతంలో ఎక్కడా లేకపోవటంవల్ల వాళ్లు గొప్పవాళ్ళని నాకూ అనిపించేది. పాతదైనా అది రెండంతస్థుల యిల్లు. అదీకాక ఆ యింటి గోడల్లో బంగారం పెట్టె లున్నవనేవారు. వాళ్ళవంశంలో ఎప్పుడో, ఎవరోనవాబుగారి దివాను అయ్యారనీ, అప్పటినుంచి వాళ్ళు గొప్పవాళ్ళయ్యారని అనేవాళ్ళు.

ఈ మాట లన్నిటిమీద నాకు నమ్మకముండేదికాదు కాని జంగలీకాకా చాలా పీనాసి అని నాకు అనిపించేది. అంత డబ్బున్నా చిరిగిపోయిన మురికిబట్టలు కట్టుకునేవాడు. ఇల్లుపడిపోయినా మరమ్మత్తు చేయించేవాడుకాదు.

జంగలీకాకా అస లివన్నీ పట్టించుకునేవాడుకాదు. ఆయన పొలాలు చూడటానికి కూడ వెళ్లేవాడుకాదు. "నేను దివాను వంశపువాడిని. ఇవన్నీ నేను చేయవలసిన పనులుకావు" అనేవాడు. విని అందరూ నవ్వేవారు. చాటుగా వేళాకోళం చేసేవారు. కాని జంగలీకాకా ఇవన్నీ పట్టించుకునేవాడు కాదు గాలంవేసుకుని చెరువుగట్టునకూర్చుంటమో లేక యింటిముందు అటూ ఇటూ పచార్లు చేయటమో చేసేవాడు. ప్రతిరోజూ ఉదయం ఇటుకల పోగులో ఏదో వెతుకుతూ వుండేవాడు.

* * *

ఒకరోజు నేను జంగలీకాకా దగ్గరికి వెళ్లాను. ఆయ నేదో వెతకటం చూశాను. నన్ను మొదట ఆయన చూడలేదు. దగ్గరికి వెళ్ళగానే పాదాల శబ్దం విని ఉలుక్కుపడి చూశాడు. నన్ను చూసి కొంచెం భయపడ్డా డనిపించింది. క్షణం సేపట్లో మనిషి మొహంలోని కళా కాంతులు ఇంతగా మారతాయని నాకు అంతకుముందు తెలియదు. ఆయన కళ్ళు అసలే ఎర్రగా వుండేవి. నన్ను చూడగానే ఇంకా ఎర్రబడ్డాయి. "పో, ఇక్కడి కెందుకొచ్చావ్?" అన్నాడు నన్ను చూసి కోపంతో. నా నోటి నుండి మాట రాలేదు. ఒక్కక్షణం ఆగి "కాకా. నేను నితూని" అన్నాను.

కాని ఆయన మొహంలో ఏమీ తేడా రాలేదు. నన్ను బయటకి తోసేశాడు. నేను ఇంటి కాంపౌండులోనుంచి బయటకు వచ్చేశాను. వెనక్కి తిరిగి చూసే టప్పటికి గౌరికూడ కనిపించింది. నన్ను వెళ్ళిపొమ్మన్నట్టు చేత్తో సైగ చేసింది. నేను అక్కడినుంచి వచ్చేశాను. కాని జంగలీకాకా ఎందుకు నన్ను చూసి భయపడ్డాడో అనేది రహస్యంగానే వుండి పోయింది. పల్లెటూరి

వాడిని. చిన్నప్పటినుంచి దెయ్యాలు, హత్యల కథలు వినటం అలవాటయింది. అందుకే 'జంగలీ కాకా ఎవరినో హత్య చేశాడు; ఆ శవాన్నే ఇటుకల కింద దాచి పెట్టా' డనిపించేది,

ఎవరిని హత్య చేశాడు? భార్యనా?? చాలా సార్లు దూరంనుంచి ఆమె బ్రతికుందో లేదో, కనిపిస్తుందేమో నని చాల ప్రయత్నించాను. ఎక్కువరోజు లీ విషయాన్ని దాచి వుంచలేక పోయాను. ఇద్దరు ముగ్గురు 'స్నేహితులకీ విషయాన్ని చెప్పేశాను. వాళ్ళకూడా ఆశ్చర్యం వేసింది. 'జంగలీ కాకా భార్యను నే నివ్వాళ ప్రొద్దున్నే చెరువుదగ్గర చూశాను. మరెవరినైనా హత్య చేసివుంటా' డని మాలో ఒక రన్నారు. ఏమన్నా కానీ ఆ యింట్లో దెయ్యముందో, భూతముందో, రాత్రికి వెళ్ళి అసలు విషయం తెలుసుకుందా మని నిశ్చయించుకున్నాం.

రతి నా క్లాస్ మేట్. నాకన్నా నాలుగైదేళ్ళు పెద్దవాడు. చాటుగా మంగలి దగ్గరికెళ్ళి గడ్డంకూడా చేయించుకునేవాడు. వాడి మొహం కూడా పెద్దది. రెండు పూటలా కసరత్తు చేసేవాడు. నానవేసిన శనగలు తినేవాడు. "నే నీ రాత్రి దీవాన్ ఘర్‌లోకి ప్రవేశించి అసలు విషయం తెలుసుకుంటా'' నన్నాడు రతి.

రాత్రి భోజనాలయ్యాక అందరూ నిద్రపోయారు. అమ్మ వంటింట్లో పాత్రలు కడుగుతోంది. తరువాత వంటిల్లో కడుగుతుందని నాకు తెలుసు. ఇంతలో పని చూసుకుని వచ్చెయ్యటానికి అవకాశం వుంది. ఈ ఐడియా రావటంతోనే బయలుదేరాను. కొంచెం దూరం వెళ్ళే టప్పటికి నా కోసం వస్తూన్న రతి కన్పించాడు. ఇద్దరం కలిసి దీవాన్ ఘర్ వైపుకు నడక సాగించాం. రతి తనతో ఒక దుడ్డుకర్ర తెచ్చాడు. నేను కూడా ఒక దుడ్డుకర్ర తెస్తే బాగుండేది. కాని నా నిక్కరు జేబులో పెన్సిలు చెక్కుకునే చాకు తప్ప మరేమీ లేదు. అయినా ఇనుము దగ్గిరుంటే దయ్యాలు, భూతాలు దగ్గిరికి రావని తెలియటం వల్ల యిదీ మంచిదే ననిపించింది.

ఇద్దరం దీవాన్ ఘర్‌వైపు వెళ్తున్నాం. ఇంతలో అకస్మాత్తుగా ఏదో కాంతి కనిపించింది.

"కనపడుతోందా?" రతి నా భుజం తట్టి అన్నాడు.

"ఊఁ, కనపడుతోంది."

ఇటికల పోగు దగ్గర లైటు అటూ యిటూ కదలటం కనిపించింది. మసకగా కనపడే కాంతిలో లైటు ఎవరి చేతులోనో వున్నట్టు మాత్రం తెలుస్తోంది. కాని ఆ మనిషెవరు? జంగలీకాకా యేనా??

లైటు వెలుగునే చూసుకుంటూ మేము ముందుకుపోతున్నాం. దగ్గరౌతున్నకొద్దీ టక్ టక్ మనే శబ్దం వినిపించడం మొదలుపెట్టింది. మేం కొంచెం దూరంలో నిలబడి చూస్తున్నాం. జంగలీకాకా మొహం భయంకరంగా కన్పిస్తోంది. కళ్ళు చింత నిప్పుల్లా చీకట్లో మెరసిపోతున్నాయి. కాని ఆయ నేం చేస్తున్నాడో మొదట మా కర్థం కాలేదు.

దీవాన్ ఘర్‌కు తూర్పు వైపున్న గోడను జంగలీకాకా గడ్డపలుగుతో పడగొడ్తున్నాడు. ఇటుకలు విరిగి పడుతున్నాయి. మధ్య మధ్యలోచెవిగోడదగ్గరపెట్టి ఏదోవినటానికి ప్రయత్నిస్తూ మళ్ళీగట్టిగా తవ్వేవాడు. రతి చెయ్యి నా వీపుమీదపడగానే నేను ఉలుక్కుపడ్డాను. "నడువు" అన్నాడు రతి చెవిలో.

"ఎక్కడికి?"

''ఇంటికి"

''నాకు తెలిసింది'' దారిలో రతి అన్నాడు.

''ఏం తెలిసింది?"

"జంగలీకాకా బంగారపు పెట్టెలకోసం వెతుకుతున్నాడు" రతి నవ్వుతూ అన్నాడు.

తరవాత పదిరోజులు గడచిపోయాయి. ఒకరోజు నేను యింట్లో కూర్చుని ఏదో చదువుతున్నాను. ఇంతలో ఎవరో వచ్చి దీవాన్‌ఘర్‌ది ఇంకొకగోడ పడిపోయిందన్నారు. ఇది విని అమ్మా, నాన్నా 'యిది పెద్ద విశేష మేమి, టన్నట్టుగా నవ్వారు. "ఒకదాని తరవాత ఒకటి అన్నీ పడుపోతాయి. ఎప్పటియిల్లు ఎప్పటిమాట. అవసరమైనప్పుడైనా మరమ్మత్తు చేయించక పోతే పడిపోకేం చేస్తుంది." నాన్నగా రన్నారు.

"తాపీ మేస్త్రీనిపిలిచి మనింటి మరమ్మతు చేయించండి.'' అమ్మ అందుకుంది. చర్చ మాయింటి విషయంలోకి దిగింది. వాళ్ళిద్దరి మధ్య వాగ్వివాదం చినికిచినికి గాలివానయ్యే సూచనలు కనిపించాయి. నేను అసలు విషయం వాళ్ళతో చెప్పేద్దామా, వద్దా అని ఆలోచిస్తున్నా "మీ కేం తెలియదు. జంగలీ కాకాయే గోడలు పడగొడ్తున్నాడు.'' ఆఖరికి నేను చెప్పటానికే నిశ్చయించుకుని అన్నాను.

"జంగలీకాకా నీ కావిషయం చెప్పాడా?" అమ్మ అంది.

"లేదు. మేం చూసొచ్చాం. నామాట నమ్మకపోతే రతిని అడిగిచూడు. జంగలీ కాకా బంగారపు పెట్టెలకోసం వెతుకుతున్నాడు" అన్నాను నేను.

"కావచ్చు. దివాన్‌ఘర్‌లో బంగారపు పెట్టెలున్నాయని అందరూ అనుకుంటారు. అతని తండ్రికో, తాతకో ఒకసారి బంగారం

దొరికింది." నాన్నగారు ఆలోచిస్తూ అన్నారు.

మేమంతా ఆడుకుంటానికి పోగయినప్పుడు జంగలీకాకా తెలివితేటల్నిగురించి వేళాకోళం చేసేవాళ్ళం. ఒకరోజు యిదే మాట వేళాకోళంగా అన్నాను. గౌరికి కోపం వచ్చింది. "ఇంట్లో రత్నాల కుండలుండటం మేం అడుక్కుంటూ తిరగటమూనా" అంటూ యింటికెళ్ళిపోయింది. కాని కొంచెం సేపట్లోనే మళ్ళీ వచ్చింది. ఈసారి అసలు కోపమే లేదు. మొహం మార్చుకొచ్చిందా అన్నట్టు వుంది. వస్తూనే "నితూ. ఈసంగతి ఎవరితోనూ చెప్పకేం" అంటూ చెవిలో చెప్పింది.

"ఏమిటి?'' నాకేం అర్థంకాక అడిగాను.

"ఆ రత్నాలసంగతి. నేను నీకు చెప్పాననుకుంటాడు నాన్న. తరవాత..."

ఇది తెలిస్తే గౌరిని చంపేస్తాడు జంగలీకాకా. ఈ విషయం నన్ను ఇంట్లోనుంచి బయటకు తోసేసినప్పుడు తెలిసింది. కాని ఈ విషయం ఎవరికీ చెప్పే అవకాశమే రాలేదు. ఇది జరిగిన కొద్దిరోజులలోనే మా చిన్నాన్న వచ్చాడు. పల్లెటూళ్ళో చదువు సరిగా చెప్పరని తనతో కలకత్తా తీసుకుపోయాడు.

* * *

కలకత్తా వదలబుద్ధికాలేదు. అందుకే సెలవుల్లో కూడా యింటికి వెళ్ళేవాడినికాదు. పల్లెటూరు వెళ్ళితే చదువులో వెనుకబడిపోతాననే వంకతో అక్కడేవుండేవాడిని. ఒకవేళ రెండుమూడు రోజు లుండటానికి వెళ్ళినా యింట్లోనుంచి బయటికి వెళ్ళేవాడినికాదు. రతి, ఖాను లాంటి వాళ్ళతో కలవటం మంచిది కాదనుకున్నాను. దీవాన్‌ఘర్ గోడలు ఎన్ని పడిపోయినయ్యో, ఇటికలు ఎన్ని పోగయినయ్యో కూడా పట్టించుకునేవాడినికాదు.

మెట్రిక్ పాసయిన తరువాత మావూరు వెళ్ళాను. అప్పటికి దీవాన్‌ఘర్ షుమారు అంతా పడిపోయింది. ఇటికదాళ్ళు పర్వతంలా గుట్టపడ్డాయి. ఒకమూల రెండు గదులుమాత్రం మిగిలివున్నాయి. చూడగానే ఎంతో విచారం కలిగింది. జంగలీకాకాఅంటే ఎంతో జాలికలిగింది. గౌరిగుర్తురాగానే మనస్సదో విధంగా వికలమై పోయింది. వాళ్ళగురించి అమ్మను అడిగాను.

"అవనీచటర్జీ కూతురు పెళ్ళి ఏం చేస్తాడో ఏమో పాపం; కట్నం లేకుండా ఎవరూ చేసుకునేవాళ్ళే లేరు. గుప్త ధనం వుందంటే ఎవరు చేసుకుంటారు?" అమ్మ అంది.

ఇది వినగానే గౌరిని చూడాలనిపించింది. ఎన్ని రోజులైంది గౌరిని చూచి! నన్ను గుర్తుపడుతుందోలేదో? ఒకసారి వాళ్ళింటికి వెళ్ళి జంగలీకాకాని, గౌరిని, గౌరి అమ్మని చూసొద్దా మనిపించింది. కాని, వాళ్ళింటికి వెళ్ళి చాలరోజు లవటంవల్ల ఎందుకో సిగ్గనిపించింది. అమ్మతో చెప్పి గౌరినే యింటికి పిలిపిద్దా మనిపించింది. కాని అదీ బాగుండదేమోనని వూరుకున్నాను. పిలిచినా వస్తుందో రాదో; ఈ ఆలోచనలతోనే ఏమీ నిశ్చయించుకోలేక వూరుకున్నాను.

సాయంత్రం షికారెళ్లి తిరిగొచ్చేటప్పటికి ఎవరో ఒక అమ్మాయి అమ్మదగ్గర కూర్చుని కబుర్లు చెబుతోంది. మొదట ఎవరో పొరుగింటివా ళ్ళమ్మా యని అనుకున్నాను. కాని మొహం చూడగానే గౌరి అని తెలిసింది.

"అదృష్టవంతురాలిని. చూడగానే గుర్తుపట్టారు" తలొంచుకునే అంది గౌరి.

అమ్మా నేనూ నవ్వాం.

"కలకత్తాబాబు పల్లెటూరివాళ్ళను గుర్తుపడతారో లేదో అనుకున్నా" అంది మళ్ళీ తలొంచుకునే.

"సిగ్గుపడుతూనే బాణాలు ఒదులుతున్నావే," అన్నా నేను. "పాపం నిన్ను చూడటానికి వస్తే అట్లా కోప్పడతా వెందుకురా" అని నన్ను మందలిస్తూ ఏదో పని చూసుకుంటానికి లోపలి కెళ్ళి పోయింది అమ్మ.

గౌరీలో ఎంతో మార్పు వచ్చింది. ఒకప్పటి చిన్న పిల్ల గౌరి శరీరపు ప్రతి అవయవం పరిపూర్ణత్వంతో నిండుకుంది. గౌరి తన చల్లని చూపులతో నన్ను చూసింది. ఆ చూపులలో ఏముందో తెలియదుకాని నా నాలుగువైపులా వలపన్ని నెమ్మదినెమ్మదిగా నన్ను తనవైపు లాక్కుంటోందా అనిపించింది. నా శరీరమంతా ఏదో తెలియని విచిత్రానుభూతితో జలదరించింది. నేనేదో కొత్త విషయాన్ని కనిపెట్టా ననిపించింది.

దీనిని ప్రేమ కాదు బహుశ మోహమంటారేమో? పొంగి పొరలే యవ్వనం వైపుండే ఆకర్షణ. నా తీక్షణమైన కళ్ళు ఆమె శరీరంలోని ప్రతి వంపును వెతకనారంభించాయి. ఆవేగంతో కూడుకున్న కంఠంతో ఏమైనా అనేసేవాడినేమో కాని ఈ లోపునే అమ్మ మళ్ళీ వచ్చింది. అప్పటివరకు నిలబడే వున్నా మన్న సంగతే మేము గమనించలేదు. తరవాత కొంచెం సేపు మాట్లాడి గౌరి వెళ్ళిపోయింది. ''నువ్వు ఒకపని చేయాలి నితూ'' గౌరి వెళ్ళిపోగానే అమ్మ నాతో అంది.

''ఏమిటి?"

"గౌరి నాన్నకు నచ్చచెప్పాలి. ఆయన ఊళ్ళో ఎవ్వరి మాట వినరు. నువ్వు ఇప్పుడు కలకత్తా మనిషి వయ్యావు. పైగా

మెట్రిక్ కూడా పాసయ్యావు. కనుక నువ్వు చెబితే వింటాడేమో నంటోంది గౌరి.''

"ఏం నచ్చచెప్పాలి!" ఆశ్చర్యంతో

"దాని తండ్రి పిచ్చివాడు. ఇల్లంతా పడగొట్టి పోగులెట్టాడు. రెండు పూటలా తింటానికి తిండి లేకపోయినా దీవాన్‌గిరీ ఆలోచన లింకా పోలేదు. బలరాంపురం స్టేషన్‌లో టీకొట్టు పెట్టుకున్న అనాదికి గౌరినిద్దామనే ఉద్దేశం వాళ్ళింట్లోవాళ్ళకుంది. ఇది దాని తండ్రి కిష్టంలేదు. ఈ విషయంలో ఎట్లాగైనా ఆయనను వొప్పించాలి''

"అనాదితోనా! ఒంటిమీద చొక్కాయినా లేకుండా లుంగీ గుడ్డ కట్టుకుని టీ అమ్ముకునే అనాదితోనా గౌరి పెళ్ళి? వాడు పల్లెటూరి......" నే నన్నాను.

"నీ బుద్ధికూడా అట్టాగే వున్నట్టుంది. గౌరి దీవాన్ వంశపు పిల్ల అయినమాట నిజమే. కాని వాళ్ళదగ్గ రిప్పు డేముంది? అసలు మీ జంగలీకాక గౌరి పెళ్ళి చెయ్యగలడా?'' అమ్మ నవ్వుతూ అంది.

"గౌరి ఉద్దేశం?''

"ఇది చెప్పటానికే వచ్చింది. దానికి పూర్తిగా యిష్టమే. రెండు పూటలా తినటానికి వుంటే చాలంటోంది. పెళ్ళి కాకపోతే దాని అన్నలు యింట్లో వుండనిచ్చేటట్టు లేరంటోంది.''

ఇది వినేటప్పటికి నాకు సహానుభూతి కలగలేదు సరిగదా. పైగా అకారణంగానే కోపం పుట్టుకొచ్చింది.

"సరే. ఇంటికెళ్ళి జంగలీకాకకు నచ్చజెపుతాలే." అన్నాను.

కాని నా కొక విధమైన ఆనందం కలిగింది. అట్టాగే కావాలి. అనాదిగాడితో పెళ్ళి అవ్వాలనే అంత యిష్టపుంటేం కానీ. మంచి శిక్షే పడుతోంది.

ఒక్క క్షణం చూసినంత మాత్రాన ప్రేమిస్తున్నా నని గౌరి తెలుసుకోగలుగుతుందా? వయసులో నున్న అమ్మాయి ఎవరికి అందంగా కనిపించదు! ఒక క్షణం ముగ్గుణయి ఆమెవంక చూసి ప్రేమించేస్తున్నానా! నా ఆలోచనలు నాకే నవ్వు పుట్టించాయి. ఇదంతా పాపం గౌరి ఏమి ఆలోచించి వుంటుంది. అనాదిని పెళ్లి చేసుకుని రెండు పూటలా తిండి సమస్యకు సమాధానం ఆలోచించుకొని వుంటుంది.

* * *

తరవాత ఒక రోజు సాయంత్రం టార్చిలైటు తీసుకొని దీవాన్ ఘర్‌కు వెళ్లాను. ఇక దాంట్లో రెండు గదులు మాత్రం మిగిలి వున్నాయి. నా కంఠ స్వరం వినగానే గౌరి తల్లి బయటకు వచ్చి ''రా బాబూ రా''అంది.

గదిలో ఒక మూల కుంపటి రాజుతోంది. గౌరి అన్నం వండుతోంది. నాకు కూర్చుంటాని కొక కుర్చీ వేసింది, జంగలీకాకా అప్పుడు ఎక్కడికో బయటకు వెళ్లాడు. కొంచెంసేపు కబుర్లు చెప్పుకున్నాం.

''సితూ. నువ్వాయనకు నచ్చజెప్పాలి. నీ మాటైనా వింటారేమో. అందుకే నిన్ను తీసుకురమ్మని గౌరిని పంపాను'' అంది గౌరి తల్లి.

"అందుకే వచ్చాను'' అని గౌరి వైపు తిరిగి నవ్వుతూ "గౌరి పెళ్లికి సెలవుపెట్టి తప్పక వస్తాను."

తల్లికంటె ఈ విషయంలో గౌరే ఎక్కువ ఉత్సాహంగా వుందనిపించింది. తండ్రి వస్తున్నాడేమోనని అడుగుల చప్పుడు వినిపించినప్పుడల్లా గుమ్మంలోకి వెళ్లి చూసి వచ్చింది. చాలా పొద్దుపోయినా జంగలీకాకా రాకపోవటంవల్ల 'మళ్లీ వచ్చి కలుస్తాను' అని చెప్పి బయలుదేరాను. గౌరి లైటుతీసుకుని దారి చూపించటానికి బయలుదేరింది.

''టార్చి లైటుంది" అన్నాను.

లాంతరు అక్కడే వుంచి గుమ్మం వరకూ వచ్చి "రేపు తప్పక రావాలి సుమా'' అంది.

"తప్పకుండా వస్తాను. మరి వెళ్లిరానా...'' అన్నాను గాని కాళ్లు ముందుకు సాగలేదు. ఆగిపోయాను. భయంకరమైన చీకటిలో ఎక్కడ ఏ ముందో తెలియటంలేదు. రెండు శరీరాల నీడ మాత్రం దగ్గరదగ్గరగా నిలబడి వున్నట్లు కనిపిస్తోంది. మా ఇద్దరిలో ఎవరి నోటివెంటా మాట రావడంలేదు. ఇద్దరం ఒకటే ఆలోచిస్తున్నామేమో. బహుశ ఇద్దరం ఏదో చెప్పాలనుకుంటున్నాం కాని చెప్పలేకపోతున్నాం. హఠాత్తుగా గౌరి చేతిని నా చేతిలోకి తీసుకున్నాను. నా శరీరమంతా వణకటం మొదలుపెట్టింది. గౌరి చెయ్యి కూడా వణకుతోందని తెలిసింది. మూగభాషలో మే మేం వాగ్దానాలు చేసుకున్నామో తెలియదు.

''నే నున్నాను.'' అని బహుశ అని వుంటాను.

"నే నుంటాను.'' అని బహుశ విని వుంటాను

తరవాత చేయి విడిపించుకు గౌరి లోపలికి పరిగెత్తుకు పోయింది. గౌరి కళ్లు కన్నీటితో నిండి వున్నాయో, సిగ్గుతో నిండి వున్నాయో ఆభయంకరమైన చీకటిలో నాకు తెలియదు. బహుశ ఇక తెలియదు కూడా. రెండవ రోజు కావాలనే నేను జంగలీకాకాను కలసుకోవటానికి వెళ్లలేదు. తరవాత కలకత్తానుంచి వుత్తరం రావటం, నేను వెళ్లిపోవటం జరిగింది. నెమ్మది నెమ్మదిగా ఊరి మాట, గౌరి మాట మర్చిపోయాను.

* * *

రెండేళ్ల తరవాత ఇంటికి వచ్చినప్పుడు గౌరి మాట గుర్తుకొచ్చింది. అమ్మను అడగటానికి సిగ్గేసింది. మూడవ రోజు దీవాన్‌ఘర్‌లో మిగిలిన రెండు గదులు కూడా కనబడలేదు. ఇటిక రాళ్ల గుట్టలు, ఎత్తుగా ఎదిగిన రావి మొక్కలు, మర్రి మొక్కలు కనిపించాయి. ఇంటికి వచ్చాక దీనిని గురించే అమ్మను అడిగాను.

"నీకింకా తెలియదురా!" అమ్మ ఆశ్చర్యం ప్రకటించింది.

"నాకేమీ తెలియదు" అన్నాను.

"ఎవరికీ తెలియదు ఎక్కడికెళ్ళిపోయారో. దీవాన్‌ఘర్ పడిపోయిన తరువాత రాయ్‌సాహబ్‌గారు తమ వరండాలో వుంచారు. స్కూలు కొత్తయింటికి మార్చివేశారు..." అమ్మకంఠంలో సానుభూతి ధ్వనించింది.

"తరవాత?"

దీవాన్‌ఘర్ పరువు ప్రతిష్ఠలన్నీ పోయాయి. రాయ్‌సాహబ్ వరండాలో వుండవలసివచ్చినందుకు అవనీకాకా తలెత్తుకు తిరగలేకపోయాడు. ఒకరోజు రాత్రి అకస్మాత్తుగా ఎవరికీ ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయారు. ఎక్కడికి వెళ్ళిపోయారో ఎవరికీ తెలియదు"

నేనేమీ మాట్లాడలేక అలాగే నిలబడిపోయాను. గౌరి పెళ్ళయిందోలేదో ఆనాడితోనే అయిందో, యింకెవరితోనైనా అయిందో అడుగుదా మనిపించింది — కాని అడగలేకపోయాను. ఈ ప్రశ్నవల్ల నా హృదయపు గాంభీర్యమంతా నష్టమైపోతుం దనిపించింది. గౌరి పెళ్ళి కాకపోవటంకాదు, గౌరీ పెళ్ళికి ఒప్పుకోలేదంటే జీవితమంతా నాముందు నేనే అపరాధిగా నిలబడాల్సి వుంటుం దనిపించింది. అందుకే హృదయంలోని మంట సంతటినీ ఆరోజు నిశ్శబ్దంగా వుండి సహించాను. కాని మంటలన్నీ నెమ్మది నెమ్మదిగా చల్లబడిపోతాయి. స్మృతులు కాలచక్రంక్రింద పడి అణగారిపోతాయి. కాలక్రమాన గౌరినీ, జంగలీకాకాను మరచిపోయాను. జంగలీకాకాను మళ్ళీ కలుస్తానని నేనెప్పుడూ అనుకోలేదు ఒకసారి మిత్రుడొకడు తన గొప్పతనాన్ని ప్రదర్శించటం కోసమైనా కానీండి, మరెందుకైనా కానీండి తను కట్టిస్తున్న మూడంతస్తుల భవనాన్ని చూపించటానికి తీసుకెళ్ళాడు. ఇంటిని అన్నికోణాలనుంచి చూపించి మూడవ అంతస్థుమీద చేస్తున్న నగిషీని చూపించటానికి దగ్గరికి తీసుకెళ్ళాడు "అదిగో అక్కడ పనిచేస్తున్న మేస్త్రీని చూశావ్. ఇంత వయస్సొచ్చినా పనిమానడు. కాని ఎంత అందంగా పని చేస్తా డనుకున్నావు" అన్నాడొక మూలగా పనిచేస్తున్న డెబ్బయిఏళ్ళు దాటిన ఒక ముసలివానిని చూపిస్తూ — అటుచూశాను. ఒక్కసారి ఉలిక్కిపడ్డాను. ఆశ్చర్యం! అదేముఖం. అదేగడ్డం, మీసం. అటువంటిదే లుంగీ — ఏమీ అనుమానంలేదు. అటువైపే వెళ్తూ 'అవనీకాకా' 'జంగలీకాకా' అని అరిచాను. ఎంతగట్టిగా అరిచానో నాకే తెలియదు. పనిచేయటంలో మునిగిపోయిన అవనీకాకా నన్నుచూసి గుర్తుతెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ ఆశ్చర్యంగా "నితూ. నువ్వేనా, బాబూ" అంటూనా వేపు రావటానికి ఒక్క అడుగు వెనక్కువేశాడు. అంతే. మూడంతస్థులపైన పనిచెయ్యటానికి వేసిన పరంజామీదనుండి క్రిందికి తలక్రిందులుగా పడిపోయాడు.

# పద్యముత్యాలు

సప్తగోదావరము భీమశంకరునిని
నాకులేశ స్వయంభుఁ బినాకపాణి
రుద్ర పాదంబులును సమారాధ భక్తిఁ
దలఁతు రెవ్వారు వార పోధన్యమతులు

శ్రీనాథుడు :

కప్ప మొకటి పూని గడగడఁ జదివిన
లోనియర్థమెట్టు తా నెఱుంగు
నెరుక మాలు చదు వికేటికో తెల్పరా
విశ్వదాభిరామ వినురవేమా
తీర్పనార్ప లేని తీర్పరితన మేలఁ ?
గూర్ప విప్ప లేని నేర్పదేల ?
పెట్టి పోయ లేని వట్టి బీరములేల
విశ్వదాభిరామ వినుర వేమా ?

వేమన

కనియెఁ గపీంద్రుఁ డంత ఘన
గర్జన నస్వనవీతనిద్రమున్
ఘనతిమినక్ర చంక్రమణ
కల్పితవీచికదంబ భద్రముం
గనదురు రత్నరాజిభుజ
గవ్రజసంచరణాతి రౌద్రమున్
జనిత మరాళ ఫేన విల
సన్నవ ముద్రము నాసముద్రమున్

భాస్కరరామాయణము

స్వైరా కుంచిత భాగ్యమేఘచపలల్
సంపత్తులన్ నిల్ప నె
వ్వారుంజాల రసుప్రయాణ పటహ
ధ్వానంబు శాంతింపఁబో
దీరల్ కీర్తి మయాంగముల్
కృతిసుధా
వృష్టిన్ నిలంజేయుత
ద్ధీరాగ్రేసరులన్ మదంబుడిగి యెం
తేఁ గొల్వుఁడీ ! భూభుజుల్ !

ఆంధ్ర విల్హణ

పోము హిరణ్యాదానముల
బుచ్చుకొనంగ ; ధనంబు లేమియుం
దేము ; సవంచనంబులుగ
దీవన లిచ్చుచు వేసరింపఁగా
రాము ; వనంబులన్ గృహ వి
రాములమై నివసింపఁ జెల్లరే
పామును వైవఁగా దగు నె
బ్రహ్మ మునీంద్రు భుజార్గళంబునన్ ?
పుడమిఁ గల జనులు వొగడఁగ-
గుడుతురు గట్టుదురు గాక
కువలయ పతులై
యడవుల నిడుమలఁ బడియెడి
బడుగుల మెడ నిడఁగఁ దగు నె
పన్నగళవమున్?

పోతన

అదరెం గొండలతోడ భూమి;
గ్రహ తా
రానీకముల్ మింటిపై
బెదరెన్ ; దిక్కుల మారుమ్రోత
లెసఁగెన్
భీతిల్లి లోకంబులుం
గదలంబాఱెను ; వజ్ర భిన్న గిరి రే
ఖంబూర్వ దేహంబు తోఁ
ద్రిదశధ్వంసిని గూలి, కుయ్యిడినఁ ద
ద్ఘోరఘోషంబునన్.
హరి రింఖారథ నేమి సద్భట పద
వ్యాఘట్ట నోద్ధూత దు
స్తరధూళీ పటల ప్రభూత నిబిడ
ధ్వాంత ప్రవిధ్వంస కృ
త్కర శాతా సిగదాది హేతిరుచు లా
కాశంబు నిండన్, వియ
చ్చరదృక్కుల్ మిఱుమిట్లు గొల్ప,
సమరో
త్సాహంబు సంధిల్లఁగన్.
తలకొని సైనికుల్ గవిసి
తాఁకొని, పేర్కొని పాసి డాసి, యం
కిలిగొన కెమ్ములమ్ములఁబ
గిల్చి, నొగిల్చి, తరేతరుల్ తలల్
నలియఁగ మొత్తి, యొత్తి నయ
నంబుల నిప్పులు రాల, లిల నొఁ
దలలు, లలాటముల్ ఘన గ
దాహతినొంచి కలంచి పోరఁగన్.

పోతన

జూన్ 27 వ తేదీన ముఖ్యమంత్రికి లక్ష రూపాయల చెక్కును సమర్పిస్తున్న ప్రముఖ సినీనటుడు శ్రీ ఎన్. టి. రామారావు. ఈ డబ్బు విజయవాడ అగ్ని బాధితులకు పునరావాస సౌకర్యం కల్పించేందుకు వినియోగించబడుతుంది.



గవర్నరు శ్రీ పట్టం ఎ థాను పిళ్లై జూబ్లీహాలులో జూన్ 25 వ తేదీన రాష్ట్ర శాసనసభ సంయుక్త సమావేశంలో ప్రసంగిస్తున్న దృశ్యం

జూన్ 18 వ తేదీన జూబ్లీహాలులో వివిధ రాష్ట్రాల సహకార మంత్రుల వార్షిక సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తున్న ముఖ్యమంత్రి.



హైద్రాబాదుజిల్లా యర్వాల్ గ్రామంలో మంత్రి డా. ఎం. ఎన్. లక్ష్మీనర్సయ్యా 1964 మే 12 వ తేదీన విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం జరిపారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నూతన ప్రధాన కార్యదర్శి శ్రీ అనంతరామన్‌కు స్వాగతం చెప్పటానికీ, ప్రధాన కార్యదర్శిగా పదవీ విరమణ చేస్తున్న శ్రీ పాయ్‌కి వీడ్కోలు చెప్పడానికీ రిడ్జ్ హోటలులో ఏర్పాటుచేసిన విందులో ప్రసంగిస్తున్న ఒక పాత్రికేయుడు.



మహిళా పంచాయతీ: హైదరాబాదు జిల్లా చేవెళ్ళ బ్లాకులోని మహారాజపేట పంచాయతీకి నూతనంగా ఎన్నికయిన సభ్యురాండ్రు. ఈ పంచాయతీకి అంతా మహిళలే ఎన్నికయ్యారు.



టర్కీ సమాజవికాసం, గ్రామీణ ప్రదేశాల మంత్రి శ్రీ ఎం. లెబిట్ యుర్దోగ్లూ 1964 మే 4 వ తేదీన అప్పటి రాష్ట్ర ప్రణాళికా మంత్రి డాక్టర్ ఎం. చెన్నారెడ్డిని హైదరాబాదులో కలుసుకొని సమాజాభివృద్ధి సమస్యలను గురించి చర్చలు జరిపారు.

ఆంధ్రప్రదేశ్ [illegible]

# పారిశ్రామిక విశేషాలు

### కేంద్ర రంగం:

బైలదిల్ల – విశాఖపట్నం ప్రాంతంలో ఉక్కు యంత్రాగారాన్ని స్థాపించడానికి అవకాశాలను గురించిన నివేదికను సిద్ధం చేయడానికి గాను నియోగించ బడిన హిందుస్తాన్ స్టీల్ లిమిటెడ్‌వారు తమ నివేదికను సమర్పించినట్లూ, అది ఇప్పుడు భారత ప్రభుత్వంవారి పరిశీలనలో వున్నట్లూ తెలుస్తున్నది. ఈ యంత్రాగారాన్ని విశాఖపట్నంలో స్థాపించడానికి గల అనుకూల పరిస్థితులను గురించి రాష్ట్ర ప్రభుత్వం అవసరమైన భోగట్టాను లభింపజేసింది.

### రాష్ట్రరంగం

రాష్ట్ర ప్రభుత్వ సంస్థ అయిన ఆంధ్ర ప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషను (లిమిటెడ్), సంవత్సరానికి 600 మైళ్ళ నిడివిగల పవర్ కేబుల్స్ ఉత్పత్తిని చేపట్టడానికి ఒక యంత్రాగారాన్ని నెలకొల్పే నిమిత్తం లైసెన్సు కొరకు దరఖాస్తు చేసింది.

సమీకృత గాజు ఫ్యాక్టరీ కొరకు, బాల్ బేరింగ్, సిలండ్రికల్ రోలర్ బేరింగ్, జర్నల్ బేరింగులు మొదలైన వాటి కొరకు ఇదివరకే లైసెన్సులు పొందిన ఈ కార్పొరేషను, పై పరిశ్రమలను నెలకొల్పేందుకై కొత్త కంపెనీలను స్థాపించే యత్నం చేస్తున్నది.

### ప్రైవేటురంగం

అజమాబాదు లోని బయొలాజికల్ ప్రొడక్ట్స్ సంస్థకు వార్షిక ఉత్పాదకశక్తిని 30 టన్నులకు పెంచుకోడానికి భారత ప్రభుత్వం అనుమతి ఇచ్చింది.

హైద్రాబాదులో టైపురైటర్ల ఉత్పత్తి సంస్థ నొకదానిని నెలకొల్పడానికి ఢిల్లీకి చెందిన రాయ్ అండ్ సన్స్ సంస్థకు లైసెన్సు లభించింది. ఇక్కడ నెలకొల్పబడగల యంత్రాగారం ఏటా 10,000 టైపురైటర్లను ఉత్పత్తి చేయగల శక్తిని కలిగి వుంటుంది.

3000 టన్నుల వార్షిక ఉత్పాదక శక్తితో విశాఖ పట్నంలో స్ట్రా బోర్డులు, డుప్లెక్ బోర్డుల ఉత్పత్తి సంస్థ నొకదానిని నెలకొల్పడానికి భారతప్రభుత్వ లైసెన్సు మంజూరు చేసింది.

ఖమ్మంజిల్లా రామవరంలోని బేరియం కెమికల్స్ లిమిటెడ్ వారికి 30 శాతం హైడ్రోక్లోరిక్ ఆసిడ్, నైట్రిక్ ఆసిడ్, సల్ఫ్యూరిక్ ఆసిడ్‌ల ఉత్పత్తిని కూడా చేపట్టడానికి భారత ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ఈ సంస్థవారు బేరియం కెమికల్స్ ఉత్పత్తి నిమిత్తం తమ ఫ్యాక్టరీని నెలకొల్పుతున్నారు. దేశంలో ఇటువంటి తొలి ఫ్యాక్టరీ ఇదే.

కాగజ్‌నగర్‌లోని సర్‌సిల్క్ సంస్థకు అసిటేట్ రేయాన్ దారం ఉత్పాదక శక్తిని సంవత్సరానికి 1.8-కే. జీ. లకు పెంపొందించుకోవడానికి భారత ప్రభుత్వం అనుమతి ఇచ్చింది.

### నూలు మిల్లులు, టెక్స్‌టైల్స్

కొంత కాలం క్రితం రాష్ట్రంలో లైసెన్సు పొందిన 18 నూలు మిల్లులు చాలా వరకు గమనార్హమైన అభివృద్ధిని సాధించాయి. హైద్రాబాదులోని తెలంగాణా నూలు మిల్లులకు, కర్నూలులోని ఎమ్మిగనూరు నూలు మిల్లులకు, నంద్యాలలోని వెంకటలక్ష్మి నూలు మిల్లులకు కదుళ్ళ సంఖ్యను 12,000 ల నుంచి 25,000 లకు పెంచుకోవడానికి టెక్స్‌టైల్స్ కమీషనరు అనుమతి ఇచ్చారు. హిందూపురంలోని సూపర్ నూలు మిల్లులకు కదుళ్ళ సంఖ్యను 12000.ల నుంచి 18,000 లకు పెంచుకోవడానికి అనుమతి లభించింది.

శ్రీ జి. ఐ. కొఠారి సహకారంతో నెలకొల్ప దలచిన సిమెంటు ఫ్యాక్టరీకి "అరుణ సిమెంటు కార్పొరేషన్ లిమిటెడ్" అని పేరు పెట్టుకోవడానికి హైద్రాబాదులోని భారత ప్రభుత్వపు కంపెనీల రిజిస్ట్రారు ఆమోదించారు. కంపెనీ నియమ నిబంధనలు మొదలైనవాటి ప్రతులను ముద్రిస్తున్నారు. తరువాత కంపెనీని నమోదు చేస్తారు.

బోనకల్లు జగ్గయ్యపేటల మధ్య రైలు మార్గాన్ని నిర్మించడానికి గల అవకాశాలను అందువల్ల సిద్ధించగల ప్రయోజనాలను పరిశీలించ వలసిందిగా రైల్వే బోర్డువారినీ మంత్రినీ అభ్యర్థించడం జరిగింది. వారు ఈ విషయంలో పరిశీలన జరిపి దాని పై ఒక నిర్ణయాన్ని గైకొనడానికి సూత్రప్రాయంగా అంగీకరించారు.

### బొగ్గు ఉత్పత్తి

సింగరేణి బొగ్గుగనులలో 1964 మార్చి

నెలలో 333,202.7 టన్నుల బొగ్గును త్రవ్వి తీశారు. 1963 మార్చిలో ఈ గనులలో 272,225.9 టన్నుల బొగ్గును తీయడం జరిగింది. 1963 మార్చి నెలాఖరు నాటికి 3232,187.0 టన్నుల బొగ్గును త్రవ్వి తీయగా 1964 మార్చి మాసాంతం వరకు 3,470,090.2 టన్నుల బొగ్గును తీయడం జరిగింది.

బొగ్గు గనుల పరిశ్రమకు సంబంధించిన కేంద్రవేతన నిర్ణాయక మండలి సభ్యులు 1964 ఏప్రిల్ 19 వ తేదీన కొత్తగూడెం కాలరీస్‌ను సందర్శించారు. వారు 1964 ఏప్రిల్ 23 వ తేదీన కొత్తగూడెం నుంచి బయలుదేరి వెళ్ళారు.

## ప్రైవేటు రంగం

తమ ఫ్యాక్టరీలో కదుళ్ళ సంఖ్యను 7,000 ల నుంచి 12,000 లకు పెంచుకోవడానికి మెసర్స్ హేమలతా టెక్స్‌టైల్స్. నటరాజ్ స్పిన్నింగ్ మిల్స్‌కు అనుమతి లభించింది.

తణుకులోని ఆంధ్ర షుగర్స్ కర్మాగారంలో సోడియం ఆక్సెటేట్ ఎథిలేసెటేట్‌ను కూడా ఉత్పత్తి చేయడానికి అనుమతి ఇచ్చారు. ఈ కర్మాగారంలో మొలాసెస్‌నుంచి ఆల్కహాల్‌ను ఉత్పత్తి చేసే నిమిత్తం డిస్టిలరీని ఇదివరకే నెలకొల్పడం జరిగింది. భారీ రసాయనికాల కొరకు యంత్రాగారాన్ని కూడా స్థాపిస్తున్నారు మెసర్స్ ఫుడ్స్, ఫాట్స్, ఫెర్టిలైజర్స్ సంస్థలో సబ్బు (సంవత్సరానికి 720 టన్నులు), శుద్ధిచేసిన క్రొవ్వు ఆమ్లాలను, గ్లెసెరిన్ (వరుసగా 3000 టన్నులు, 336 టన్నులు) ను కూడా ఉత్పత్తి చేయడానికి అనుమతి ఇచ్చారు.

# తంజనగర పతనము

శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి

కలువ పడంతి రంగాజమ్మ; ఆమెను
పులకింపజేయు జాబిలి విభుండు!
కవితాలతాంగి రంగాజమ్మ; ఆమెలో
భావ మాధుర్యంబు క్ష్మావిభుండు!
కలకంఠకంఠి రంగాజమ్మ; ఆమె కు
త్సాహమ్ము గూర్చు మాధవుడు విభుడు!
కనకంపు బొమ్మ రంగాజమ్మ; ఆమెకు
చేతనత్వ మొసంగు శిల్పి విభుడు!

ఆమె పద మాత దర్థమై, ఆమె పూవు
పరిమళం బాతడై తదావాసమందు
కాపురం బుండి నిజ రాజకార్యములను,
సుతుని, పట్టపురాణిని జూడ డెపుడు.

రంగాజమ్మ మనోహరాకృతినె ఆరాధించి నిత్యమ్ము త
త్సాంగత్యమ్ము సమస్త పూర్వభవ పూజాలబ్ధ భాగ్యమ్ముగా
శృంగారాంబుధి నోలలాడు రసిక శ్రేష్ఠుండు భూపాలు డ
ర్ధాంగిన్, జ్యేష్ఠకుమారునిన్ మఱచి కాలక్షేపముం జేయగా

పతిదరిజేర తత్ప్రియయ భాగ్యము సుంతయు పొందలేని జీ
వితపు టెడారిలోన ప్రభవించు జలాశయమో యనంగ సం
తతతిమిరావృతంబగు నెదన్ వెలుగుల్ విరజిమ్ము జ్యోతియై
సుతుపయి రాణి ఆశలిడి చూచెను మంచి దినాలకోసమై.

ఇదె యదనంచు నెంచి మధురేశుడు తంజపురాధినాథుపై
నెదగల తొంటి వైరమున నెన్నియొ కుట్రలు పన్నె, సద్గుణా
స్పదుడగు రాకుమారుడు ద్విషద్ధరణీశుల చెల్మి చేసి ఆ
పద తలపెట్టుచుండె నను భ్రాంతి జనింపగజేసి తండ్రికిన్.

దేశద్రోహము చేయబూనెనని యుద్రిక్తాంతరంగుండు ధా
త్రీశుం డంతట రాజ్యవర్ధిత మహోర్చిష్మంతుడుం బోలె శి
క్షా శాస్త్రోక్త విధిన్ కఠోరముగ నాజ్ఞాపించె వాత్సల్యపుం
బాశంబున్ తెగగొట్టి పుత్త్రునకు యావజ్జీవ కారాస్థితిన్.

పట్టపుదేవియా జనని భర్తృనిరాకృతయై మనోవ్యథన్
బిట్టు కృశించుచుండ విలపించెడు రాకొమరుండు కారణం
బెట్టిదొ యిట్టిశిక్ష కొక యించుకయుం దెలియంగ లేక యి
ప్పట్టున తోడ్పడం గలుగువా రెవరోయని కుందె నెమ్మదిన్.

పరవనితానురక్తుడయి ప్రాణవిభుండు నిరాకరింపగా
నరకపు యాతనం బడి మనంబున క్రుంగి కృశించుచున్న దు
ర్భరతర జీవితంబు తన పాలబడన్, యువరాజు వార్త భీ
కర పవిపాతమయ్యెను ప్రకంపిత దేహకు రాణి కయ్యెడన్.

తనపూర్వ జన్మ వ్రతమ్ము లన్నిటి పంట
తన గర్భ శుక్తి ముక్తాఫలమ్ము
తన దుఃఖమయ జీవితమున కాశారేఖ
తన కన్నుదోయిలో మనెడు వెలుగు
తన తప్తహృదయాని కెనలేని అమృతంబు
తన ముద్దులొలుకు కుందనపు బొమ్మ
తన మనస్తిమిర సంతతి బాపు జాబిల్లి
తన జీవితంపు ప్రమోదునకు చిగురు

తనదు మురిపాలమూట, అందాలరాశి
కల్ల కపటాలు లేని బంగారుకొండ
ఘోర పాతకు లుండెడు కార లోన
తల్లడిలుచుంట తెలిసి యే తల్లి సైచు?

ఏపాపం బొనరించి పుట్టితివొ తండ్రీ! నాదు గర్భంబునన్
భూపాలోచిత గౌరవంబు లసలేపూజ్యంబు; సామాన్యులున్
జూపెట్టంగల ముద్దు ముచ్చటలు నిచ్చో నీకు ప్రాప్తించెనే?
ఏపుత్త్రుండును తండ్రిచే ఖయిదులో నీరీతిగా క్రుగ్గెనే ?

బంగరుడోలలందు నునుబాన్పున నిద్రిలుచుండువేళ నొ
వ్వంగలదేమొ దేహ మని పల్మరు దాదుల హెచ్చరించి, పు
త్త్రుంగని తృప్తి చెందుతొలిరోజులు పూర్తిగ విస్మరించి,కా
రం గుములంగ జేసెను ధరాధిపు డాత్మజు నశ్మచిత్తుడై.

తన తర్వాత మహీజన ప్రియముగా తంజాపురీ రాజ్య పా
లనముం జేయ సుశిక్షితుండు సుగుణాలంకారుడౌ జ్యేష్ఠ పు
త్త్రుని చేజేతుల నిర్విచారముగ ఖైదుంజేయుతండ్రిన్ జగం
బున నెందైనను గంటిమే యని జనంబుల్ విస్మయం
బందగన్.

నిన్న మొన్నటిదాక నీయాట పాటల
నరసి జన్మమ్ము ధన్యముగ నెంచి,
యువరాజుగా నీవు వివిధ జన ప్రశం
సల పొందగల వంచు కలలు గాంచి,
నీ పాలనమున తంజాపురీ లక్ష్మి నూ
తన శోభ లందు నంచును దలంచి,
ఉత్తమాన్వయ జాత యువతీ వతంసంబు
కోడలై గృహ మేలు కోర్కె నించి,

మఱచిపోయితి విభు నిరాదరణ మెల్ల
మానవతి యెవ్వతెయు పొందరాని పాట్లు
కలిగియును, మేను వాయక నిలిచి యుంటి;
అయయొ! నీ స్థితి నేడు గుండియను చీల్చె.

పలుమార్లిట్లు తనూజు నిం దలచి దైవ ప్రాతికూల్యంబు ప్రా
ప్తితె నంచున్ విలపించుపట్టమహిషిన్ వీక్షించి ఆర్ద్రాంతరం
గులు పౌరుల్, సచివుల్ సుహృజ్జను లనేకుల్ ధైర్యముం
గూర్చు ప
ల్కుల నర్థించిరి రాజ్యపాలనము నైకొమ్మంచు దేశార్థమై.

ఆపద ధైర్య సాహస గుణాదిక మెల్ల పరీక్ష సేయు శా
ణోపల; మన్ని కష్టములు నొక్క తరిన్ దను నావరించియున్
కాపుర ముండబోవు కలకాల మటంచును ధైర్యమంది తం
జాపురితొంటి ప్రాభవము జార గరాదని యెంచె రాణియున్.

ఏ నరపాలు కొల్వు కవయిత్రిగ 'నుత్తమ గౌరవాస్పదా
నూన సువర్ణ సేచన మహోత్సవ భాగ్యము తాను పొందెనో
ఆ నృపు క్షేమ మారసి రవంతయు జంకక మేను వాసె న
మ్మానిని తొంటి నిశ్చయము మారక సర్వజనుల్ నుతింపగా.

కమనీయాకృతి నృత్యగానముల రంగాజమ్మ లేనట్టి లో
కము సర్వస్వము శూన్యమై నృపతికిన్ కన్పట్ట గాఢాంధకా
రము వ్యాపింపగ జీవితాధ్వమున భార్యాపుత్త్రులన్ రాజకా
ర్యములన్ లెక్కగొనండొకింతయును, నిద్రాహార
దూరుండునై

కనులన్ విప్పిన మూసినన్ తనకు రంగాజమ్మ సాక్షాత్కరిం
చినయట్లై అధరీకృతోడు పతి రోచిః పూర్ణమౌ మోముతో
తన వీనుంగవ తన్మనోజ్ఞ కవితాధారామృతాసేచనం
బునపావిత్ర్యముచెందినట్లై తలచున్ భూనేత మోహాంధుడై

కమనీయ రూప రేఖా విలాసముల రం
గాజమ్మ చూడని కన్ను లేల ?
మధుర పీయూష నిర్మల వచశ్శ్రీల రం
గాజమ్మ లేని లోకం బదేల ?
మోహన మృదుల కపోలభాగముల రం
గాజమ్మ దరి లేని కలిమి యేల ?
సరస మందస్మిత చంద్రికా రుచుల రం
గాజమ్మం బొందని క్షణము దేల !

నిత్య నూతన సౌందర్య నిధి, మనోజ్ఞ
గాన కవితా విలాస శృంగార లక్ష్మి
హృదయ రాజ్ఞిరంగాజమ్మ నెట్లు విడిచి
బ్రతుక గలనని తలపోసె రాజు మదిని.

అటు నిటు దిరుగు శయ్యామందిరము నందు
నలుదెసల్ శూన్యదృక్కులను బఱపు
పరి వారమును క్రొత్తవారిగా పరికించు
పటుదుఃఖమున బాష్పవారి గురియు
కాల్యమ్ములను యాంత్రికమ్ముగా నొనరించు
ఉమ్మలికాన నిట్టూర్పుచుండు
మంత్రు లేతేరగా మౌనమ్ము వహియించు
ఆననమ్మందు దైన్యమ్ము నించు

తన హృదయ సింహపీఠిపై ననవరతము
కొలువు దీర్చు రంగాజమ్మ తొలగిపోవ
విజయరాఘవ ధారుణీవిభుడు కుమిలి
క్రుంగి నిజ మనస్స్థైర్యమ్ము గోలుపోయి.

ధరణీనాథుని దుస్థితిం గనిమనో ధైర్యమ్ముతో రాజ్యమున్ పరిపాలించెడు రాణి దక్షత ద్విషద్వర్గమ్ము గుర్తించి : నిష్కరుణన్ రాణియె హత్య చేసినది రంగాజమ్మ నంచున్ నరేశ్వరు నమ్మింపగ నాత డుగ్రతర రోషావేశ సంతప్తుడై.

తన రాజ్యవ్యవహారముల్ స్వయముగా తానే పరిష్కారముం బొనరింపం గల నింకమీద నని కొల్వుం దీర్చె ; తంజాపురీ జనులెల్లన్ ముదితాంతరంగులయి రాశల్ మొల్క లెత్తంగ : ప్రాక్తనశోభల్ పునరుద్ధరింపబడు భాగ్యంబబ్బునంచెంతయున్.

కాని, అమాత్య వర్గమును కాదని పాలన చేయుచున్న భూజాని వివేక శూన్యమగు శాసనముల్ ప్రకటింప సౌఖ్యముల్ గానక తత్ప్రజల్ తమకు గానిదినమ్ములు వచ్చెనంచు లో లోన దపింపసాగిరి విరోధి నృపాలురు సంతసింపగా.

అలనాటి నిత్య మృష్టాన్న భోజన తుష్ట
పృథ్వీసుర సహస్ర వేద వాక్కు
అలనాటి సానురాగాయాత పరిసర
ప్రాంత రాజన్య విద్వత్సదస్సు
అలనాటి దివ్య గానామృత మాధురీ
ప్లావిత శ్రోతృ సభ్యప్రశంస
అలనాటి వివిధ కావ్య ప్రబంధాదిక
నిర్మాణ చణ కవి నికర గోష్ఠి

నిర్జరేశ్వరు సభను తృణీకరించు
బహువిధైశ్వర్య సద్యశః ప్రాభవంబు
నేటి కొలువున మృగ్యమై చాటుచుండె
క్షీణదశ నొందు రాజ్యలక్ష్మీ విభవము.

ఒక క్షణమైన నన్విడువ నోపక నా సహవాసమే పురా సుకృతఫలంబొ యంచు కనుఱాపులలో గల కోర్కె దీర్చ నుత్సుకుడయి సంతతాభ్యుదయ శోభల దేలెడి రాజు నేడిటుల్ వికలమనస్కు డౌటకు ద్రవించును రాణియెడంద అక్కటా.

రాజైనంతనె హద్దుమీఱి పవలున్
రాత్రుల్ కళారాధన
వ్యాజమ్మున్ గయికొంచు ధర్మముల ని
ర్వర్తించుటల్ మాని రం
గాజమ్మన్ పరమార్థ దాయినిగ జా
గ్రత్స్వప్న నిద్రాదులన్
పూజింపన్ వలెనే ? తదీయ ఫల మా
భూపాలునిన్ చెందదే ?

మోమున తొంటి చిర్నగవు
మొల్కలు మచ్చునకైన లేవు, బ్రా
హ్మీ మహనీయ మూర్తులయి
ముంచెడి మంత్రులయందు గౌరవ
ప్రేమలు లేవు ; పౌరు లొన
రించెడు ప్రార్థన లాలకించి తత్
క్షేమము గూర్చు యత్నములు
చేయుట లేదు నృపాలు డింతయున్.

అసమప్రజ్ఞ నడంచి సభ్యజగతిన్
హాస్యాస్పదుం జేయు దు
ర్వ్యసనం బొక్కటి చాలు మానవు నధః
పాతాళముం జేర్ప మా
నసమున్ మోహమునందు ముంచి ; పరకాం
తాసక్తులౌ నెందరో
వసుధాధీశుల ప్రాభవం బుడిగిపో
వన్ మున్ను వీక్షింపమే ?

*

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1964 మార్చిలో రాష్ట్రంలోని ఈ క్రింద పేర్కొన్న గ్రామాలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు:

హైద్రాబాదు జిల్లా: కీశర, వికారాబాదు, సోమనగంతి, మాధవరం, బడంపల్లి, సుభానుపూర్, మసాన్‌పల్లి (గట్టెపల్లి) శింగిరిపూర్, పంగగూడ, దాచెగూడ, చోశికోట, అచ్యుతాపూర్.

మెదక్ జిల్లా: బోడపల్లి, తూల్‌కాల్, దోమూర్, పుల్క్రన నడిగడ్డ, రాయ్‌పర్తి, లింగాయ్‌పల్లి, అల్కానపల్లి, సికింద్లపూర్, దౌలతాబాద్, నర్సంపల్లి, కూచవరం.

నిజమాబాదు జిల్లా: కల్లూరు, తొర్ప్ప, కొల్లడి, మద్దికుంట, ఇస్సాయ్‌పేట, బుస్సాపూర్, తల్మెడియ, సంగమేశ్వరం, పెదమల్లారెడ్డి, భగీరధిపల్లి, ఎలుపకొండ, అక్కాపూర్, గుండెరం, బుర్గల్, తిమ్మారెడ్డి, దెరిమళ్ల, పెట్పల్లి.

ఆదిలాబాదు జిల్లా: వడిమాల్, కామకోల్, కొట్ల, అక్కాపూర్, వెంగ్వపేట, ఆదిలాబాదులోని జిల్లా సమాచార కేంద్రం, కొలూరు, పెద్దూరు, పెదంపేట, మెట్పల్లి, కుంచెవల్లి, డబెగాం, జనకాపూర్, నమ్మూర్, నాస్పూర్, ధోర్పల్, ఇంధని, ఖమన, మవడ్.

వరంగల్ జిల్లా: ఘుజుల్‌ఘాట్, బొంతగట్టునగరం, ఆక్కరాజుపల్లి, రాంపూర్, చిల్లంచర్ల, జంగలికొండ, చర్లపాలెం, తిమలాయ్‌పల్లి, కొత్తపేట, జానకిపురం, వెల్లంపల్లి, తిర్మలగిరి, పాఖాల, పల్లగుట్ట, మంచిఉప్పల్, మొగిలిచర్ల, ఉయ్యాలపాడ, సోడషిపల్లి.

విశాఖపట్నం జిల్లా: సీతానగరం, మామిడివాడ, తంగేడు, రేగ అగ్రహారం, రాపులింగాపురం, అలమంద, తానవరం.

తూర్పుగోదావరి జిల్లా: ఐ. పోలవరం, ద్వారపూడి - III, పేకేడు - II, ఇందుకూరుపేట, దీవిపట్నం - II, కలవచెర్ల, జల్లిమడి, ఉట్రుమిల్లి.

పశ్చిమగోదావరి జిల్లా: కరగుపాడు, పైడిపాక, వెల్లచింతలగూడెం - II, కరిచెర్లగూడెం - II, తిరుగుడమెట్ట, కొవ్వూరు - III, గణపవరం - IV.

కృష్ణా జిల్లా: గుర్రాజపాలెం, వెంకటాపురం, వీరలపాడు, వేములపల్లి, వుయ్యూరు - III, వేద్రాద్రి, నందిగామ - IV, బండిపాలెం - II, సంగపాడు, పామర్రు - II, అరిపిరాల - II, భూసనగుల్ల, భీమవరం - II, అనిగండ్లపాడు - II, సకంర్సనపురం, పెదతుమ్మిడి - II, ప్రొద్దువాక - II, లింగాల - II, లక్ష్మీపురం, చిత్రాయ్, తుమ్మగూడెం, అగిరిపల్లి - II, చిల్లబోయినపల్లి, పిన్నమరెడ్డిపల్లి, బందరు, జక్కంచెర్ల, కొవ్వల్లె, పెనుమల్లె, పాగోలు - III, కమ్మనమోలు, సుల్తాననాగారం, గొల్లపాలెం, మంత్రిపాలెం - II, తెంపల్లి - II, కొత్తగూడెం - III, వెలేరు - III, తోట్లవల్లేరు - VI, తోట్లవల్లేరు - VII, తేలప్రోలు - II, తేలప్రోలు - III.

గుంటూరు జిల్లా: తుమ్మపూడి, చేబ్రోలు - I, మంత్రిపాలెం - III, కరప - II, కొమరనేనివారిపాలెం, గండిగనూముల, అయ్యన్నపాలెం, కొచ్చెర్ల - III, కొండయ్యపాలెం, చింతలచెర్వు, పుచ్చనూతుల, అన్నవరప్పాడు, అన్నవరం, సంతగుడిపాడు, రాజాపేట, జె. పంగులూరు, కొర్సిపాడు, వెంకటాపురం, మంగినపూడి.

ఖమ్మం జిల్లా: తోటకలింగన్న పేట, కృష్ణవరం, చిరునోముల, ఎర్రగుంట.

పశ్చిమగోదావరి జిల్లా: గవళ్ళపేట, ముత్తలపాలెం, ఇనపర్రు, రాయన్నపాలెం, వల్లంపట్ల ఎర్రంపల్లి, ధర్మాజీగూడెం, తేపూరు, ముప్పర్రు, కామవరపుకోట - II, గుండుగొలను, సీతంపేట.

నెల్లూరు జిల్లా; యామంతిపాడు, ఉప్పలమర్తి, బ్రహ్మదేవం IV (HW) (సెట్టు లింగాయపాలెంలో నెలకొల్పబడింది) మకామలూరు (సెట్టు రామస్వామి పల్లిలో నెలకొల్పబడింది), రేమారు - II, (సెట్టు ఇసాకపాలెంలో నెలకొల్పబడింది), కరతంపాడు, సర్వేపల్లి లిట్ - IV, (సెట్టు దెబ్బలమిట్టలో నెలకొల్పబడింది), నువ్వూరుపాడు, అనందాపురం, ఆముదాలదిన్నె.

చిత్తూరు జిల్లా : మర్రిమాకులపల్లె, గుడిబండ, చిన్నెటిపాకం, యేనాది వెట్టు, ఇరుగులం, అగ్రహారం, ఎర్రగుంట్ల పాలెం, మొరదనపల్లె, కల్లూరు పల్లి, పెర్రిందేశం, రాయపాడు, చర్లపల్లి, అర్వ కొత్తూరు, ఎస్. బండ్లపల్లి, చింత మాకులపల్లి, చినగొల్లపల్లి, వెగ్గిలిపల్లి.

అనంతపురం జిల్లా : నాగినాయ చెర్వు, సింగిరెడ్డిపల్లి, ఉలికల్లు, పొదరళ్ల, సాలకంచెర్వు, ఎర్రగుంట, కృష్ణాపురం, ఎర్రగుంట్ల, అయ్యగార్లపల్లి, పల్లూరు, ఖైరసముద్రం, కత్తెరమల, లత్తవరం, ఎత్తోడు, కెరవసముద్రం

కడప జిల్లా : అప్పనపల్లి, చిన్నదు దాయల, ఎర్రగుడి, చమలూరు.

కర్నూలు జిల్లా : తమ్మరాజిపల్లి, కగ్గలు, సత్తనూరు, నర్సాపురం, కొమ్మ నూరు, పెద్దకొత్తిలికి, నందిపాడు, చింత లాయపల్లి, కురువల్లి, బురుజుల, వెన్న ములపాడు.

మహబూబ్‌నగర్ జిల్లా : రచ్చలపల్లి, రామరెడ్డిపాలెం, రెడ్డిగూడెం, హాజీ పూర్ (చెన్నారంశివారు), ముట్పూరు, సూరారం, పెద్దకరిసాముల, యాపట్ల, చిన్నకొత్తపల్లి, మైలారం, ఎత్తెం.

నల్గొండ జిల్లా : మిర్యాల, గోక వరం, రామచంద్రాపురం, వెల్మకన్నె.

1964 ఏప్రిల్‌లో దిగువ పేర్కొన్న గ్రామాలలో కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు.

హైద్రాబాదు జిల్లా : వీర్లపల్లి, గాటు వందనపల్లి, కొత్తపాక్, రామనాథ్ గడ్డపల్లి, అర్కత్తల, మైలార్ దేవ వరంపల్లి, జిన్నారం, పెద ఉరజ్జల్, యూవ్ ఖాన్ పేట, మియా నిద్ పూర్, అల్నాపూర్, హెనెవెడ, మల్లసోమారం, మద్దిరెడ్డిపల్లి, హొన్నాల్, తుర్కపల్లి యాదారం, గుల్లూరు

మెదక్ జిల్లా : పెద్దకంజర్ల, అల్లుం పేట, చింతకుంట, రాయజమదలూరు, రాజ్ పేట, రాంపూర్, ధారపల్లి, కొన పూర్, సుర్జోత్తన్ (హరిజన కాలనీ), తిమ్మరాజువల్లి, వారన్ పూర్, గంగా పూర్, వర్కాల్ (హరిజన కాలనీ).

వరంగల్ జిల్లా : చంద్రుగొండ (హరిజన కాలనీ), మహేశ్వరం, తీగరాజు పల్లి, హనుమంతాపూర్, గరిమళ్లపల్లి, మరీముస్త్యాల్, గోపాలపురం

విశాఖపట్నం జిల్లా : పోలేపల్లి, తోట కూరపాలెం.

తూర్పు గోదావరి జిల్లా : కంతంగి, లచ్చిరెడ్డిపాలెం, వి కొత్తూం, పెదమల్లా పురం.

పశ్చిమ గోదావరి జిల్లా : పోణంగి, కల్లకూరు, కొల్లపర్రు.

కృష్ణా జిల్లా : మనిమేశ్వరం.

గుంటూరు జిల్లా : కాజా-1.

ఖమ్మం జిల్లా : పెదకోరుకొండ.

నెల్లూరు జిల్లా : దామెగుంట, బెల్లగుపాలెం.

చిత్తూరు జిల్లా : బహదూర్ వెంకటా పురం.

అనంతపురం జిల్లా : మల్గిర్, పెరవలి, చెరకూరు, బైరాపురం.

కర్నూలు జిల్లా ; కె. నాగలాపురం, చెనుగొండ్ల, జులకల్, బొందలపాడు, టి. లింగందిన్నె, ఆలమూరు, మానేపల్లి, కలుగొట్లపల్లి, ముక్కామల, 52 బాపా పురం.

మహబూబ్‌నగర్ జిల్లా : నందిపేట, జంగమలపల్లి, యెల్కిచెర్ల, బొమ్మనపల్లి

నల్గొండ జిల్లా : ' శెట్టిపాలెం, అగ మోత్కూర్, యేపలి సింగారం. నల్ల బండ గూడెం, సోమవరం, పరసాయ పల్లి, దేవరనేని కొత్తపల్లి, బండరామే వరం, నాంపల్లి, సంగం, ఎల్కపల్లి, మామిడాల.



# ప్రశ్నోత్తరావళి

శ్రీ కె. కృష్ణయ్య, తర్నికల్, కల్వకుర్తి, మహబూబ్ నగర్ జిల్లా.

ప్ర: ఆంధ్ర ప్రదేశ్‌లోని ఏ యే జిల్లాలలో బస్సురూట్లను ఇప్పటి వరకు జాతీయం చేశారు?

సమా: ఆంధ్ర ప్రదేశ్‌లోని దిగువ పేర్కొన్న జిల్లాలలో బస్సు సర్వీసుల జాతీయీకరణ జరిగింది. తెలంగాణాలోని అన్ని జిల్లాలు, ఆంధ్ర ప్రాంతంలోని కృష్ణా, పశ్చిమ గోదావరి, గుంటూరు జిల్లాలు.

ఈ జిల్లాలలోని బస్సు సర్వీసులు కాక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా కార్పొరేషను నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలలోని ముఖ్యమైన ప్రదేశాలకు కూడా ప్రయాణ సర్వీసులను నిర్వహిస్తున్నది.

శ్రీ జె. వెంకటరామనరసయ్య, వరదన్నపేట, తా॥ జిల్లా వరంగల్.

ప్ర: వరదన్న పేటలో ప్రారంభించిన ఆర్ట్సు, క్రాఫ్ట్సు కేంద్రాన్ని ఇప్పుడు ఎందుకు మూసివేశారు?

సమా: లోగడ వరంగల్ జిల్లా పరిషత్తుచే ప్రారంభించ బడిన ప్రాంతీయ ఆర్ట్సు క్రాఫ్ట్సు కేంద్రాన్ని నిధుల కొరతవల్ల ఎత్తివేశారు.

శ్రీ బసిరెడ్డి ఈశ్వర రెడ్డి, దొన్నెకోట పోష్టు, కదిరి తాలూకా, అనంతపురం జిల్లా.

ప్ర: కదిరి నుంచి దొన్నెకోటకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి ఒక పథకాన్ని అయిదు సంవత్సరాల క్రితమే మంజూరు చేయడం, రైతులనుంచి మూడు సంవత్సరాల క్రితం అంగీకారం స్వీకరించడం జరిగింది. ఈ పని ఎప్పుడు ప్రారంభమవుతుంది?

సమా: కదిరి తాలూకాలోని "దొన్నెకోటకూ మరి రెండు గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా" చేయడానికి సంబంధించిన పథకంలో దొన్నెకోట గ్రామాన్ని చేర్చారు. ఈ పథకానికి విద్యుచ్ఛక్తి బోర్డు చీఫ్ ఇంజనీరు మంజూరీ కూడా లభించింది. దీని అమలు, నిధులను కేటాయించడం, సాధన సామాగ్రి లభ్యం కావడంపై ఆధారపడి వుంది.

శ్రీ వి. సాంబశివరావు, గుందాడు గ్రామం, హుజూరాబాదు తాలూకా, కరీంనగర్ జిల్లా.

ప్ర: ఈ సంవత్సరం తెలంగాణా ప్రాంతంలో ఎన్ని తపాలా ఆఫీసులను తెరుస్తారు; వాటిని ఏ యే గ్రామాలలో నెలకొల్పుతారు?

సమా: తెలంగాణా ప్రాంతంలోని హైద్రాబాదు, మహబూబ్‌నగర్, నిజామాబాదు, వరంగల్, కరీంనగర్ తపాలా డివిజన్లలో 1964-65 వ సం.లో 168 తపాలా ఆఫీసులను తెరవడానికి ప్రతిపాదించారు.

వివరాలు దిగువ ఇవ్వబడినవి :-

| | | | |
|---|---|---|---|
| హైద్రాబాదు | ... 14 | తపాలా | ఆఫీసులు |
| మహబూబ్ నగర్ | ... 54 | ,, | ,, |
| నిజామాబాదు | ... 39 | ,, | ,, |
| వరంగల్ / కరీంనగర్ | ... 61 | ,, | ,, |
| | 168 | తపాలా | ఆఫీసులు |

తపాలాశాఖ ప్రమాణాల ననుసరించి అర్హమైన, సమర్థనీయమైన గ్రామాలలో తపాలా కార్యాలయాలు నెలకొల్ప బడతాయి కాబట్టి, ఈ అంశాలను సమగ్రంగా పరిశీలించనిదే వీటిని ఏయే గ్రామాలలో నెలకొల్పేదీ పేర్కొనడం సాధ్యంకాదు.

శ్రీ జి. శ్రీనివాసులు, కమలొద్దిన్‌పూర్, మహబూబ్ నగర్ జిల్లా.

ప్ర: మహబూబ్ నగరం జిల్లా ఘనపురం చుట్టుప్రక్కల గ్రామాలలో ఎచ్చట కూడా పశుచికిత్సశాల లేదు. కనుక ఈ గ్రామంలో త్వరలో ఒక పశుచికిత్స శాలను నెలకొల్పుతారా?

సమా: పశుపోషణ శాఖ వార్షిక ప్రణాళికా కార్యక్రమం క్రింద 1964-65 వ సంవత్సరంలో రాష్ట్రం మొత్తంమీద 75 గ్రామీణ పశుచికిత్స శాలలను తెరవడానికి ప్రతిపాదించారు. 75 గ్రామీణ పశుచికిత్స శాలలను ప్రారంభించడానికి అవసరమైన మంజూరీని ఆహార, వ్యవసాయశాఖ ఇచ్చింది. ఈ చికిత్సశాలలను నెలకొల్పవలసిన స్థలాల స్థిరీకరణ పరిశీలనలో వుంది. కొంతమంది జిల్లా పశు వైద్యాధికార్లవద్ద నుంచి ప్రతిపాదనలు ఇంకా అందవలసి వుంది. కాబట్టి స్థలాల స్థిరీకరణ అవిచేరాక త్వరలో జరుగుతుంది. జిల్లా ప్రతిపాదనలు జిల్లా పరిషత్తుల ఆమోదానికి అనుగుణ్యంగా వుండాలి. గ్రామీణ పశుచికిత్సశాలలు నెలకొల్పవలసిన గ్రామాల జాబితాలలో కిలాఘనపూర్‌ను చేర్చవలసిందిగా మహబూబ్ నగర్ జిల్లా పశువైద్యాధికారిని కోరడం జరిగింది. ఈ జాబితా జిల్లా పరిషత్తు స్థాయిలో చర్చించబడి, స్థిరీకరించబడవలసి వుంటుంది.

*శ్రీ వి. సాంబశివరావు, గుండాడు గ్రామం, కరీంనగర్ జిల్లా.*

ప్ర: హుజూర్ నగర్ తాలూకా అంబాల వాగుపై ఆనకట్టను కట్టే ప్రతిపాదన ఏమన్నా ఉన్నదా? ఉంటే దాని వివరాలు తెలియజేయండి.

**సమా:** సుమారు 300 ఎకరాల నేలకు నీటి సౌకర్యాన్ని కల్పించే చెఱువు ఒకటి ఆ గ్రామానికి దగ్గర్లోనే వున్నందువల్ల అంబాల గ్రామంలో ఆనకట్ట కట్టే ప్రతిపాదన ఏమీలేదు. అయినా అంబాలకు 1½ మైళ్ళ దిగువ నీలివాగుమీద ఒక చిన్న ఆనకట్ట కట్టడానికి స్థల పరిశీలన జరిగింది. అయితే దానివల్ల పల్లపు భూములు మునిగిపోయే ప్రమాదం వున్నందుచేత యీ స్థలం ఏమంత లాభదాయకం కాదని తేలింది.

*శ్రీ వసరెడ్డి, లింగంపల్లి, మహబూబ్ నగర్ జిల్లా.*

ప్ర: నవాబుపేట–కొందుర్గు రోడ్డువిస్తరణ కార్యక్రమం 1952లో చేపట్టబడినప్పటికీ యింత వరకూ అది పూర్తికాలేదు. ఈ రోడ్డు మా గ్రామాన్ని షాద్ నగర్ బ్లాకుతో కలుపుతుంది. ఈ రోడ్డు నిర్మాణం పూర్తి కానందువల్ల వ్యవసాయదారులు చాలా యిబ్బంది పడుతున్నారు. త్వరలో ఈ రోడ్డు నిర్మాణం పూర్తవుతుందంటారా?

**సమా:** రూ 20,000 ల ఖర్చు అంచనాతో కొలనుపాక – నాసారం రోడ్డు నిర్మాణం 1960–61 సం.లో జిల్లా పరిషత్తు చేపట్టింది. 1960 అక్టోబరులో దీనికి మార్కౌటు యివ్వడం జరిగింది. 1962 వరకూ పని కొనసాగింది. ప్రజల తరపు నుండి 25 శాతం విరాళం పద్ధతిపైన యీ నిర్మాణ కార్యం చేపట్టబడింది. గ్రామ ప్రతినిధులు తమకు ప్రజల విరాళం రావడం లేదని తెలియజేశారు. అందువల్లనే యీ ఆలశ్యం. నిర్మాణ కార్యక్రమంలో చాలాభాగం పూర్తయిపోయింది. రోడ్డు పనులు, సి. హెచ్. 20.10, 38.25 ఆనకట్టల పనులు యింకా చెయ్యాలి. ప్రస్తుతం వున్న గ్రామ ప్రతినిధుల అకౌంట్లు సరిచూసిన అనంతరం యీ పనులు పూర్తి చేయడం జరుగుతుంది. పనులు త్వరగా పూర్తి చేయటానికి అవసరమైన ఉత్తరువులు జారీ చేయడం జరిగింది.

*శ్రీ బి.వి. ఆంజనేయశర్మ, పెద్దకూరపాడు, సత్తెనపల్లి తాలూకా.*

ప్ర: గుంటూరు జిల్లా చీరాలలోని పారిశ్రామికవాడ ఎప్పుడు ప్రారంభించబడుతుంది?

**సమా:** గుంటూరు జిల్లా చీరాల దగ్గర గల వేటపాలెంలోని గ్రామీణ పారిశ్రామిక వాడను మూడవ పంచవర్ష ప్రణాళి కాంతానికి ప్రారంభించాలని ఉద్దేశించడం జరిగింది. ఈ పారిశ్రామిక వాడ నిర్మాణానికిగాను వర్తమాన ఆర్థిక సంవత్సరంలో (1964–65) అవసరమైన కేటాయింపు చేయబడింది.

*శ్రీ టి. జి. రామారావు, గుంతకల్లు.*

ప్ర: ప్రయివేటు రంగం క్రింద వెజిటబుల్ ఆయిల్ ఎక్స్‌ట్రాక్ట్ కర్మాగారాన్ని స్థాపించాలనే ప్రతిపాదన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పరిశీలనలో వున్నదన్న విషయం ఎంతవరకు నిజం?

సమా: అటువంటి ప్రతిపాదన ఏమీలేదు. ★

# ప్రభుత్వ నిర్ణయాలు

- విధానసభ తరువాయి సమావేశంలో సమిష్టి పట్టాలను ఏక పట్టాలుగా విభజించే బిల్లును ప్రవేశ పెట్టాలని మంత్రివర్గం నిశ్చయించింది. ప్రస్తుతం రాష్ట్రంలో 25 లక్షల సమిష్టి పట్టాలు వున్నాయి.
- ధాన్యం ఆడకాన్ని చేపట్టేటట్టు సహకార సంఘాలను ప్రోత్సహించాలని, లైసెన్సులను మంజూరు చేయడంలో ప్రాధాన్యతను యివ్వాలని నిశ్చయించింది.
- యాత్రికుల కొరకు రోడ్ల నిర్మాణం, పారిశుద్ధ్య సౌకర్యం, మంచినీటి సరఫరా మొదలయిన సౌకర్యాలను కలిగించే నిమిత్తం వాడడానికై ఏటా తిరుపతి పురపాలక సంఘానికి రూ 1.75 లక్షలు, తిరుచానూరు పంచాయతీకి రూ 25,000లు యివ్వాలని నిశ్చయించింది.



# కుమార సంభవము - స్త్రీ స్వాతంత్ర్యము

— అయ్యగారి నరసింహమూర్తి

ఆంగ్ల నాగరికతకు లోనైన నేఁటిభారతీయులు స్త్రీకిఁ గ్రొత్తగా స్వాతంత్ర్యమును గల్పింప యత్నించుచున్నారు. కాని యిది యార్ష సాంప్రదాయము నెఱుంగని లేక యర్థము చేసికొనలేని వారి వ్యర్థ ప్రయత్నములు. వాస్తవమునకు భారత నారికి స్వాతంత్ర్య మున్నదా? లేదా? యని ప్రశ్నించుటకు ముందు స్వాతంత్ర్యమన నేమియో తెలిసికొనవలెను. సాంఘిక నియమముల నుల్లంఘింపక మానసికాభిరుచుల కనుగుణముగ భావవాక్క్రియారూపముల స్వతంత్రముగ జీవింపఁ గలుగుటను స్వాతంత్ర్యమందురు గాని విశృంఖల వీర విహారమును స్వాతంత్ర్య మనరు.

పురుషుఁడు బాహ్యలోకమునుండి వస్తువులను దీసికొనిరాగా వానిని చక్కగ నుపయోగించి గృహాలంకరణ మొనర్చి రక్షించునది స్త్రీ. ఆమె గృహ నిర్వహణము నందు సర్వాధికారిణి. పురుషుని సంపాదనమును సద్వినియోగము చేయునది గృహిణి. స్త్రీ పురుషుల మానసిక స్థితుల ననుసరించి యిట్టి వ్యవస్థగావింపఁబడినది. పురుషుఁ డెంత ప్రజ్ఞాశాలియయ్యును బిడ్డలను గాచి పోషించు శక్తి యాతనిలో లేదు. స్త్రీ యెంతటి నేర్పరియైనను మాతృత్వమునందనిదే ఆ వ్యక్తికిఁ బరిపూర్ణత్వము, సంఘమున సముచిత స్థానము కడు దుర్లభములు.

హిందూదేశమున నాడుపిల్ల పుట్టుకను చాలామంది గర్హింతురని లోకమున నొక యపప్రథ గలదు. స్త్రీవిద్యా విషయమై యీనాటికి ననేకములగు దురభిప్రాయములు లోకమున వ్యాప్తిలో నున్నవి.

ఈ విషయములందలి సత్యాసత్యముల నరయుటకు మనము మన ప్రాచీన ఋషి పుంగవుల వంటి కవిపుంగవులచే రచింపఁబడిన సాహిత్యము నందలి స్త్రీ పాత్రలను, ఆర్షమత సంప్రదాయములను బరిశీలింపవలెను. ఇందులకు ప్రాచ్య పాశ్చాత్య భేదము లేక పలువురచే పలువిధముల ప్రశంసింపఁబడుచున్న కవికులచంద్రుఁడగు కాళిదాసు కుమారసంభవము నుదాహరణముగఁ గైకొనిన సర్వ విషయములు సులభముగ సుస్పష్టముగ బోధపడును.

కాళిదాసు స్త్రీమానసిక ప్రవృత్తులను సునిశితముగఁ బరిశీలించి చిత్రించిన వాఁడగుటచే నాతని పురుషపాత్రల కంటె స్త్రీ పాత్రలు మన కతి సన్నిహితమై స్ఫుటికమువలె స్పష్టముగ గోచరించును. ఒక్క వాల్మీకి తప్ప భారతీయ కవు లెవ్వరును స్త్రీ స్వభావ చిత్రణమున కాళిదాసు నతిక్రమించినవారు కారు.

స్త్రీ పాత్రల విషయమునఁ గాళిదాసు ప్రత్యేకమైన శ్రద్ధను వహించెను. పార్వతి బాల్యమునందు తన తండ్రి యనుమతి లేనిదే యే కార్యమును చేసెడిది కాదు. తన తండ్రి యానతి మీదనే యామె శివుని పరిచర్య కేగినది.

"గురుర్ని యోగాచ్చ
నగేంద్ర కన్యా,
స్థాణుం తపస్యన్త
మధిత్య కాయాయ్ అన్వాస్త..."(3-17)

(పార్వతీదేవి తండ్రి యాజ్ఞవలన కొండ పైభాగమున తపము చేయుచున్న శివుని కొలుచుచున్నది.) అంతియగాక తన తండ్రి వాంఛితమునే తన వాంఛగా నెంచెను

కటకంతుని కంటిమంటకుఁ గాముఁడు గురియైన తఱి శైలాత్మజ తండ్రి వాంఛ తన మనోరథ యత్నములు భగ్నములయ్యెనని వగచినది.

శైలాత్మజాఽపి పితు
రుచ్ఛి ఁనోఽభిలాషం
వ్యర్థం సమర్థ్య లలితం
వపురాత్మనశ్చ'' (3-75)

పార్వతీదేవియు గొప్పవాడగు తండ్రి యభిలాషయు, సౌందర్యయుతమైన తన శరీరమును నిష్ప్రయోజన మగుటకు విచారించెను.

దీనివలనఁ దండ్రి కొమరితలకుఁ గల వాత్సల్య భక్తి భావములు వ్యక్తము లగుచున్నవియేగాని కుమార్తెకు స్వాతంత్ర్యము లేదని నుడువఁజాలము. ఎందులకన హిమవంతుఁడు తన తనయ శ్రేయము నభిలషించును. ఆమె యుచ్చస్థితి యాతనికిఁ బరమానందము. పార్వతిని పరమేశ్వరుఁడు పరిణయమాడునని నారదుఁడు పలికిన పలుకులను విని యాతఁ డుబ్బితబ్బిబ్బయ్యెను. తత్సాదన(ము)నకై హిమవంతు డామెను శివుని సపర్యకుఁ బంపెను.

యౌవనవతి యగు స్త్రీకి రెండు విధములగు వాంఛ లుండును. ఒకటి దాంపత్య సంబంధమైనది. రెండవది మాతృ సంబంధమైనది. ఇందు మొదటిదగు దాంపత్యప్రేమ మఱల రెండు విధములు. శరీరాకర్షణ కారణముగ యౌవన మదముచే నరముల యుద్రేకమువలన జనించునది. దీనికిఁ గామము ప్రధానము. రూప లావణ్యాదు లస్థిరములైనట్లే యిట్టి దాంపత్యముకూడ నస్థిరమే యగును. ప్రేమించి ప్రేమింపబడెడి రెండు వస్తువులకు హృదయ వైశాల్య నైర్మల్యము లుండి స్వార్థరహిత మగునపుడు జనించు ప్రేమ నిష్కామ ప్రేమ. ఇట్టి ప్రేమ యెట్టి పరిస్థితులలోను చలింపక నివాత దీపమువోలె నిశ్చలమై యనశ్వరమై యుండును.

ప్రకృతి సిద్ధముగఁ బురుషునిపై ఆధారపడియుండు స్త్రీ అబల యయ్యును దాంపత్య రంగమున నిరువురు నన్యోన్యాశ్రయులు. క్షీరనీరన్యాయమున నుండవలసిన దాంపత్య రంగమున స్త్రీకి స్వాతంత్ర్యము లేదనిచెప్ప వలనుపడదు. హిమవంతుఁడు తనకూఁతు నడుగవచ్చిన వరున కీయఁదలంచుట కిచ్చగించినను తానే సర్వాధికారినని తలంచి స్వతంత్రించి సంబంధమును నిశ్చయము చేయక తన సహధర్మచారిణి యగు మేనక యంగీకారమునుబడసిన పిమ్మటనే సంబంధమును స్థిరపఱచెను.

"శైలస్సంపూర్ణ కామోఽపి
మేనాముఖ ముదైక్షత,
ప్రాయేణ గృహిణీ నేత్రాః
కన్యార్థేషు కుటుమ్బినః (6-85)

హిమవంతునకు పూర్ణముగశివున కుమార దేవి నిచ్చుట కిష్టమున్నను మేనకనుచూచెను. ఏలయన తఱుచుగా గృహస్థులు కన్యకల కార్యముల,నిల్లాండ్రవలనఁ దెలిసికొందురు. (కళత్ర ప్రధానప్రవృత్తయ ఇత్యర్థః) దీనిని బట్టి దాంపత్యరంగమున స్త్రీపురుష లిరువురు సమాను లగుచున్నారే గాని యొకరెక్కువ మఱియొకరు తక్కువయను భావమునకుఁ దావు కన్పించుట లేదు, ఇఁక శుభకార్యము లందుఁగూడ కేవలము పురుషులకే గాక స్త్రీలకును సంబంధము గలదు. శివుఁడు హిమవంతుని కడకు పెండ్లి విషయమై మాట్లాడుటకు సప్తర్షులను దలఁపఁగా వా రరుంధతీ సహితులై వచ్చిరి. ఆసప్తర్షులతోఁ బాటు అరుంధతిని కూడ నుచితముగ సత్కరించి పర్వతరాజు కడకు వారితోబాటు పంపెను. దానికిఁ గారణము

"స్త్రీపుమానిత్యనాస్థైషావృత్తం హి మహితం సతామ్" (6-13) (సత్పురుషుల వ్యాపారమే గొప్పదిగాని స్త్రీపురుష వివక్షత యనవసరము)

"క్రియాణాంఖలు ధర్మ్యాణాం
సత్పత్న్యో మూలకారణమ్"
(పతివ్రతలగు భార్యలు ధర్మకార్యములకు మొదలుగదా!)
"గుణాః పూజాస్థానం గుణి
షునచలింగ నచవయః" — భవభూతి

అపర్ణతపము చేయునప్పుడు శతవృద్ధులైన మునులుకూడ నామెకుఁ బ్రణామము లాచరించుచుండిరఁట. దానికిఁ గారణము "నధర్మవృద్ధేషు వయస్సమీక్ష్యతే" (ధర్మముచే గొప్పవారగు విషయములలో వయస్సు ఎన్నఁబడదు. (5-16) పైవాని వలన నార్షమతము ననుసరించి స్త్రీకిఁగల స్థానము స్పష్ట మగుచున్నది.

పతివ్రతా ధర్మము గల స్త్రీలు భర్తల యభిప్రాయమునకు వ్యతిరేకముగా నుండరు. మేనక తన భర్తయగు హిమవంతుఁడు (కూఁతురగు) హైమవతిని "పుట్టు వెఱుగనట్టియు, ముదిగోద నెక్కి భిక్షాటనము చేసెడి వాడునునగు పరమేశ్వరున కీయఁదలఁచినపుడామె యాతని మాట కెదురాడక ఆ కార్యమున కిష్టపడెను. "మేనే మేనాఽపి తత్సర్వం పత్యుః కార్యమభీప్సితమ్ భవన్త్య వ్యభిచారిణ్యో భర్తురిష్టే పతివ్రతాః" (6-86) (మేనకాదేవియు పెనిమిటి కిష్టమగు నక్కార్యంబున కిష్టపడెను. పతివ్రతలగు స్త్రీలు పెనిమిటి కిష్టమగుదాని కడ్డుగా నుండరుగదా!)

రతిమన్మథుల ప్రేమ యన్యోన్యాశ్రయమైనది. స్త్రీ ప్రకృతి సిద్ధముగఁ బురుషునిపై ఆధారపడి యుండును గాన నామెకు భర్తయే సర్వస్వము. భర్తయెచట నుండునో తానును అచ్చటనే యుండఁగోరును. అంతే గాక భర్తసుఖమే తన సుఖముగా భావించును. కనుకనే పతివ్రతా ధర్మముఁ గల రతీదేవి భర్త మరణానంతరము తన భర్తకు

మావిచివురులతోఁ దర్పణ మిమ్మని వసం
తుని ప్రార్థించినది.

"పరలోక విధౌచ మాధవః స్మర
ముద్దిశ్య విలోల పల్లవాః
నివపేః సహకార మఞ్జరీః
ప్రియచూతప్రసవో హి తే సఖా"(4-35)

(ఇంతేకాదు. వసంతుఁడా! నీ చెలికాడగు మారునకు మావిచివురులన్న మిక్కిలి ప్రేమగనుక పారలౌకిక క్రియలగు పిండము-జలతర్పణము నిచ్చుటతోఁ బాటు మావి పూవులను సైత మిమ్ము.)

అంతటితో నూరుకొనక.

"తదను జ్వలనం మదర్పితం
త్వరయేర్దక్షిణ వాతవీజనైః
విదితంఖలు తే యథా స్మరః
క్షణమప్యుత్సహతే న మాంవినా"(4-36)

(నాయందగ్ని నంటించి దక్షిణ వాయువులు తొందరగా వీచుటకు తొందఱ పఱచుము. ఎందుకనఁగా నీ మిత్రుడగు మారుఁడు నన్ను విడిచి యొక్క క్షణమైనను సంతోషింపఁడని యెఱింగియే యుందువు గదా.) అని ఇరువురకును గల యనురాగాతిశయమును తెలియఁజేసినది. మఱియు.

"ఇతిచాపి విధాయ దీయతాం
సలిలస్యాఞ్జలిరేక ఏవ నౌ
అవిభజ్య పరత్ర తంమయా
సహితః పాస్యతి తే సబాన్ధవః

నీవు నాకగ్నినిచ్చుట అయిన వెనుక నొక్కే జలాంజలిని మా ఇరువురకు నిచ్చినఁ జాలును. ఏలయన పరలోకమందును విభాగము చేయక నాతో కలిసియే జలమును త్రాగును. అట్లు కలసి త్రాగుటయే యాయన కిష్టము. అవైన నార్ష సాంప్రదాయాను గతమగు స్త్రీ ధర్మమును దెలిపినది.

"శశినా సహయాతి కౌముదీ
సహమేఘేనతటిత్ప్రలీయతే
ప్రమదాః పతి వర్త్మగా ఇతి
ప్రతిపన్నం హి విచేతనైరపి. (4-33)

(చంద్రునితో వెన్నెలయు మేఘముతో మెఱుపును నశించును. పతివ్రతలు భర్త మార్గము నొందుదురు. ఇట్లవివేకులకును దెలియును.

దీనినిబట్టి భార్యా భర్త లన్యోన్యానురాగాశ్రయులైనపుడు హెచ్చు తగ్గులను భేద భావము పొడ సూపుటకుఁ దావుండదు. కానిచో భర్తృ విహీన యగు భార్య నోటి వెంట నిట్టి పలుకులు వెలువడవు).

స్త్రీ యౌవనవతి యగుటతోడనే మాతృత్వమును సంపాదింపఁగోరును. "ఇయేష సా కర్తుమవంధ్యరూపతాం" (5-2) అను వచనమున నిది సూచితమయ్యెనని యనుకొనవచ్చును. పార్వతి తన యొక్క రూపమును "అవంధ్య" మొనర్చుకొనుటకుఁ బ్రయత్నించెనన తనకుఁ దగిన భర్తను బొందుటయేగాక భర్తచే సత్సంతానమును బడయుటయుఁ గోరెనని "అవంధ్య" శబ్దముచే సూచితమయ్యెను. తపస్సొనరించు పార్వతి స్వయముగఁ బెంచుకొనిన వృక్షముల యందుఁగల ప్రేమను "గుఁహుడు" సయితము మరల్పలేడట. కనుకనే "కన్న ప్రేమకంటెఁ బెంచిన ప్రేమ యధికమందురు."

"అతన్ద్రితా సా స్వయమేవవృక్షకాన్
ఘటస్తన ప్రస్రవణైర్వ్య వర్ధయత్,
గుహోపి యేషాం
ప్రథమాత్మజన్మనాం న
పుత్రవాత్సల్యమపాకరిష్యతి'' (5-14)

(ఆ గౌరి యోపికతో తన స్తన్యపానము వలె ఘటోదకములతో స్వంతముగఁ బెంచబడిన చిన్నచెట్లయందుఁ గల ప్రేమను తనకుముందు గుహుఁడు పుట్టినపుడు సైతము వీనిమీది పోనియంత ప్రేమ ధరించెను.)

ఇంతేగాక తన హస్తములతో హరిణములకు ధాన్యము నిచ్చెడిది. పార్వతి తన యందెంత ప్రేమాతిశయముతో మెలఁగినదో యవియును నీమెయందంత యనురాగాతిశయముతో మెలంగినవఁట.

"అరణ్య బీజాఞ్జలి దాన లాలితా స్తథాచ
తస్యాం హరిణా విశశ్వసుః" (5-15).

(నివ్వెరధాన్యమును దోసెళ్ళతో నిచ్చుటచే లాలన చేయఁబడిన హరిణము లట్లుగా విశ్వాసము గలవి యాయెను). మాతృప్రేమ యన నెట్లుండునో పార్వతి ఆలంబనముగా కాళిదాసు మనోజ్ఞముగాఁ దెలిపినాఁడు.

స్త్రీలకుఁ బాతివ్రత్యము పరమ ధర్మము. భర్త తమకు ప్రియము సలుపకున్నను నతని యెడనే ప్రేమ నెఱపుచు క్రుంగి కృశించుట భారతదేశాచారము.

"కామేక పత్నీ వ్రతదుఃఖ శీలాం" (3-7)

ప్రౌఢ నాయికలు కొందఱు తమ సౌందర్యాతిశయముచే భర్తలను అదుపులో నుంచుకొందురు. రతి సమయమందు తమ కపరాధ మొనర్చిన పురుషులయెడఁ బగఁ దీర్చుకొందురు.

"స్మరసి స్మర మేఖలాగుణైరుత
గోత్రస్ఖలితే బషు న్దనమ్
చ్యుతకేసర దూషితేక్షణాన్య
వతంసోత్పల తాడనాని వా" (4-8)

(మనము రహస్యముగా నుండువేళల) ఇతర స్త్రీ నామముతో నన్ను బిలువగాఁ గోపగించి నా కటిసూత్రముచేఁ గట్టినకట్లను దలఁచుకొంటివా? లేక నాకర్ణమునం దలంకారము కొఱకు నుంచుకొనఁబడిన నల్ల కల్వలతోఁ గొట్టగా నా పుప్పొడి నీ కండ్లలోఁ బడి మంట కలుగఁ జేయుటను దలంచి యిపుడు నన్నీ ప్రకారముగాఁ

బ్రతిక్రియ చేయ నెంచితివా? ఏల యగపడ వని రతీదేవి భర్తను గూర్చి విలపించి నది.)

ఇవ్విధమున స్త్రీలు సర్వవిషయము లందును స్వతంత్రలే గాని యస్వతంత్రలు గారని కాళిదాసు నిరూపించినాఁడు. స్త్రీల కును పురుషులకు వలెనే సుహృద్భావాది గుణము లుండును. పార్వతికిని - తత్సఖుల కును మధ్యఁ గల సుహృద్భావమే దీనికిఁ దార్కాణము.

యుక్తాయుక్త విచక్షణా జ్ఞానములేక నవ నాగరకుల మనుకొనుచున్న నేటి భారతీ యులు స్త్రీకి క్రొత్తగా స్వాతంత్ర్య సంపా దనమునకై యత్నము చేయుచున్నా రనిన ఆశ్చర్యపడవలసిన పని లేదు. ప్రాచీన హైందవ విజ్ఞానమును, తత్సంప్రదాయము లను బాగుగా నవగాహన చేసికొనినవా రెవ్వరును నిట్టి పిచ్చి చేష్టలు చేయఁబూనరు.

ఆఁడుపిల్ల పుట్టుకను హిందువులు ద్వేషింతురనుట యథార్థము గాదని, మీదు మిక్కిలి వా రుభయవంశముల కీర్తి ప్రతి ష్ఠలకుఁ గారకు లనియు తెలిపినాఁడు. తల్లి దండ్రులు మగపిల్లవానిని కోరుకొనుట వైదిక కర్మ లాచరించుటకును, తమ జీవి తానంతరము శ్రాద్ధ కర్మము లాచరించి తమ కూర్ధ్వలోక ప్రాప్తిని పొందింపఁ జేయుటకును మాత్రమే యని ఆర్ష సంప్ర దాయము నెఱింగినవా రెఱుంగఁగలరు.

ఉమ జననమువలన మేనకా హిమవంతు లిరువురు పవిత్రులై ప్రకాశించిరి.

"మహీభృతః పుత్రవతోఽపి దృష్టి
స్తస్మిన్న పత్యే న జగామ తృప్తిమ్"(1-27)

హిమవంతున కెందఱు కుమారులు, కుమార్తెలున్నను పార్వతీదేవి యందలి తృప్తిని పొంద డాయెను.

"ప్రభా మహత్యా శిఖయేవ దీప
స్త్రిమార్గయేవ త్రిదివస్యమార్గః,
సంస్కారవత్యేవ గిరా మనిషీ
తయా స పూతశ్చ విభూషితశ్చ"(1-28)

(హిమవంతుఁడా కుమారితచే గొప్ప శిఖచే దీపమువలెను, గంగచేత స్వర్గ మార్గము వోలె వ్యాకరణాది సంస్కార వాక్కుచే విద్వాంసుని వలె పవిత్రమైన వాడును, నలంకరింపఁబడిన వాడును ఆయెను.)

శివుని ప్రార్థన నంగీకరించి వచ్చిన సప్తర్షులతో హిమవంతుఁడు "కన్యేయంకుల జీవితం" (6-63) (నా వంశమునకుఁ బ్రాణమైన కూఁతురు) అని పలికినాఁడు. దీనిని బట్టి యాఁడుపిల్ల యనిన హైందవు లకుఁ గల యభిప్రాయ మెట్టిదియో తెలిసి కొన వచ్చును. ఈ విషయమునే మాయా వటువు రూపమున పార్వతి సన్నిధానము నకు వచ్చిన పరమేశ్వరుఁడును బలికి నాఁడు.

"వికీర్ణ సప్తర్షిబలిప్రహాసిభి
స్తథాన గాంగై స్సలి లైర్దివశ్చ్యుతైః
యథాత్వదీయై శ్చరితైర నావిలై
ర్మహీధరః పావితఏషపా న్వయః (5-37)

(ఈ హిమవంతుఁడు సప్తర్షుల పూజా పుష్పముల చే నవ్వుచున్నవి వలె నున్నవియు, ఆకాశమునుండి జారు చున్నవియు నగు గంగోదకములచేఁగూడ నిర్మల మగు గుణములుగల నీచే వంశముతో పవిత్రుఁడైనట్లు పవిత్రుఁడు గాలేదు.

ఇఁక మేనక "తయా దుహిత్రా సుత రాంచకాసే స్ఫురత్ ప్రభామండలయాసవిత్రీ విదూర భూమి ర్నవమేఘశబ్దాదుద్భిన్న యా రత్నశలాకయేవ (1-24) క్రొత్త మబ్బుచే మొలకలెత్తఁబడిన విదూర పర్వత ప్రాంత రత్నభూమివలె కాంతి మండలము గల ఆ కూతుచేఁ బ్రకాశించెనట.

స్త్రీ యౌవన దశయందడుగిడినపుడు యుక్తమగువాని కిచ్చి వివాహము నెఱపి యత్తవారింటికిఁబంపబడినను స్త్రీ తన మృదువగు మాటలచేతను, కార్యముల చేతను, వినయ సౌశీల్యాది గుణసంపత్తి చేతను నటు మెట్టి నింటివారికి, నిటు పుట్టి నింటివారికిని వన్నెతెచ్చును. ఏ యింటి వారికి కళంకము ప్రాప్తించినను ఆమె సహింపఁజాలదు. కనుకనే సతీదేవి తన తండ్రియగు దక్షుఁడు భర్తయగు పరమేశ్వ రుని నిందచేయుట కోర్వనిదై యోగముచే దేహమును త్యజించినది. "అథావమానేన పితుఃప్రయుక్తా దక్షస్య కన్యా భవపూర్వ పత్నీ, సతీ సతీయోగ విసృష్ట దేహా" (1-21)

పెండ్లి నిశ్చయమైన పిమ్మట కూఁతురు తమను వీడిపోవును గాన కూఁతునందలి ప్రేమచే మేనక దుఃఖించెను.

"తన్మాతరంచాశ్రుముఖీ దుహితృస్నేహ విక్లబామ్" ఏహి విశ్వాత్మనే వత్సేభిక్షాఽసి పరికల్పితా అర్థినోమునయః ప్రాప్తం గృహమేధి ఫలంమయా"(6-92) (తన కూఁతును దగిన వరున కిచ్చుటచే తనకు గృహమేధి ఫలము చేకూరె నని హిమవం తుఁడు మిగుల సంతసించినాఁడు)

ఈ విధముగ జననీ జనకులు కూఁతు విషయమై శ్రద్ధ వహించుచున్నపుడు ఆఁడు పిల్ల పుట్టుకను గర్హింతు రనుట యెంత యుక్తమో, విజ్ఞులు గ్రహింపక పోరు. బిడ్డలపై తల్లిదండ్రులకుఁ గల వాత్సల్యాను రాగాభిమానములను గూడ పై విషయము వ్యక్తము చేయును.

స్త్రీలు కేవలము గృహనిర్వహణాది

కృత్యములనేగాక సమస్త విద్యల నభ్యసించెడివారనుటకు "ఉమ" విద్యాభ్యాసమే నిదర్శనము,

తాం హంసమాలాశ్శరదీవగఙ్గాం,
మహౌషధీం నక్తమివాత్మభాసః,
స్థిరోపదేశాముపదేశకాలే
ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః (1-30)

(క్రిందటి జన్మలో స్థిరముగా నుపదేశము సేయఁబడిన విద్యలు పార్వతీదేవి కీ జన్మములో తమంతట తామే యుపదేశ మాత్రమున శరత్కాలము రాఁగా హంసలు తామై గంగానదిని బొందినట్లును రాత్రియందోషధిని స్వభావసిద్ధమైన వెలుఁగులు వలెను పొందినవి.)

"కన్యా వరయతే రూపం,
మాతా విత్తం పితా శ్రుతం
బాన్ధవాః కుల మిచ్ఛన్తి
మృష్టాన్నమితరే జనాః॥-

అను దానిని బట్టి యౌవనోదయమైన స్త్రీ రూపవంతుడగు భర్తను బడసి యనంతరము మాతృత్వమును గోరినదై వానివలనఁ దేజస్వంతము, వీర్యవంతము నైన సంతానమును బడసి వీరమాతయై వార్ధక్యమున పవిత్రమైన తత్సంతానాంతికమున విశ్రాంతి గైకొనుటవలన నామె స్వాతంత్ర్య రహితయని చెప్ప నొల్లదు. భారత నారి భర్తవలన, పుత్రులవలన లోకమున ఖ్యాతిని బడిసి స్వర్గము నధిష్ఠింప వలయునని వాంఛించునే గాని స్వాతంత్ర్య రహితము, నిస్తేజము, నిర్వీర్యమునగు బానిసతనపు జీవితమును గడుపుట కంగీకరింపదు. అట్టిస్థితి యీ దేశము నందలి మగువలకు కలుగదు.



# భారత ప్రగతి

## కేరళ

### మత్స్య పరిశ్రమాభివృద్ధి సంస్థ

ఎర్నాకుళంలో ఏప్రిల్ 15 వ తేదీన జరిగిన మత్స్యపరిశ్రమాభివృద్ధి వ్యవహారాల కేంద్ర మండలి నాలుగవ సమావేశంలో కేంద్ర ఆహారశాఖ సహాయమంత్రి శ్రీ ఏ. ఎం. థామస్ మత్స్య పరిశ్రమాభివృద్ధి కార్పొరేషను నొకదానిని నెలకొల్పడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నట్లు వెల్లడించారు. ఈ సంస్థ బహుశా ఈ సంవత్సరంలోనే ప్రారంభించబడవచ్చునని కూడా ఆయన తెలియజేశారు. ఈ సమావేశానికి వివిధ రాష్ట్రాల మత్స్యశాఖ మంత్రులు, మత్స్యశాఖ అధికార్లు హాజరయ్యారు.

ఏప్రిల్ 25, 26 తేదీలలో తిరువేంద్రంలో దక్షిణ మండలి ఆరోగ్యశాఖా మంత్రుల నాలుగవ సమావేశం జరిగింది. కేరళ గవర్నరు శ్రీ వి. వి. గిరి సమావేశాన్ని ప్రారంభించారు. మన దేశంలోవలె సామ్యవాద సరళి సమాజ వ్యవస్థగల దేశాలలో అందరికీ వైద్య సౌకర్యాలు కల్పించడమే వైద్యం, ప్రజారోగ్య పథకాల చరమ లక్ష్యంగా వుండాలని శ్రీ గిరి తమ అధ్యక్షోపన్యాసంలో నొక్కి చెప్పారు. కేంద్ర ఆరోగ్యశాఖా మంత్రిణి డాక్టర్ సుశీలా నయ్యర్ అధ్యక్షత వహించారు. మన జాతీయ ప్రణాళికలలో ఆరోగ్య సౌకర్యాల విస్తృతీకరణ కార్యక్రమానికి విశేష ప్రాముఖ్యత నివ్వడానికి గల ఆవశ్యకతను ఆమె వివరించారు. దక్షిణాది రాష్ట్రాల ఆరోగ్యశాఖా మంత్రులు, ప్రజారోగ్య శాఖ అధికార్లు సమావేశానికి హాజరయ్యారు.

### రెండు రాకెట్ల ప్రయోగం

తిరువేంద్రం సమీపంలోగల తుంబ రాకెటు స్థావరం నుంచి ఏప్రిల్ 17 వ తేదీన మరో రెండు రాకెట్లను ప్రయోగించారు. రాడార్ సెట్లు ప్రయోగ పరీక్షలను సాగించే సందర్భంగా ఈ ప్రయోగాలు జరిపారు. ఈ ప్రయోగ ఫలితాలు సంతృప్తికరంగా వున్నాయి.

ఈ ఏప్రిల్ నెలలో 500 లకు పైగా లోయర్ ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ పాఠశాలలను, ఉన్నత పాఠశాలలను ప్రారంభించడానికి ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది.

సుప్రసిద్ధ మళయాళ కవులలో ఒకరైన శ్రీ కుమారన్ అసన్ 92 వ జన్మదినోత్సవం ఈ నెలలో జరిగింది.

ముఖ్యమంత్రి శ్రీ ఆర్. శంకర్ అధ్యక్షతన రాష్ట్ర ప్రజామండలి తాలూకు ప్రజాసంబంధాలసంఘం ఆధ్వర్యంలో తిరువేంద్రలో ఒకరోజుపాటు జరిగిన రక్షణ సమ్మేళనం ప్రారంభం కావడంతో మే నెలలో యీ రాష్ట్రంలోని ముఖ్యసంఘటనలు ఆరంభమయ్యాయి.

మే 11,12 తేదీలలో తిరువేంద్రంలో జరిగిన దక్షిణమండలి 9 వ సమావేశానికి కేరళ అతిధిగా వ్యవహరించింది. కేరళకు యీ సమావేశంవల్ల ఎంతో మేలు చేకూరింది. రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి కొరతను తీర్చడానికై నైవేలీప్రాజెక్టునుండి25 మె.వా. విద్యుచ్ఛక్తిని యివ్వడానికి మద్రాసు అంగీకరించింది. దక్షిణ రాష్ట్రాల లోని పడమటికి ప్రవహించే నదులలోని నీటిని వినియోగించుకునే విషయమై కేంద్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ కె. ఎల్. రావు అధ్యక్షులుగా మద్రాసు, మైసూరు, కేరళరాష్ట్రాల ముఖ్యమంత్రులతో ఒక సంఘాన్ని ఏర్పాటు చేయాలని కూడా యీ మండలి నిశ్చయించింది.

రూ. 2.86 కోట్లతో నిర్మింపబడిన నాలుగు అంచెల కట్టకు మే 20 తేదీన కొచ్చిన్ నౌకాశ్రయంలో ప్రారంభోత్సవం జరిగింది. దీనితో యీ నౌకాశ్రయంలోని కట్టల సంఖ్య 13 కు పెరిగింది. ఇప్పుడు కొచ్చిన్ నౌకాశ్రయం కలకత్తా, బొంబాయి మద్రాసుల్లోని నౌకాశ్రయాల మాదిరిగా వాటిస్థాయికి చేరుకుంది.

కొట్టాయానికి దగ్గర్లో మట్టుపెట్టివద్ద పశుగణాభివృద్ధి రంగంలో బ్రహ్మాండమైన ప్రయత్నం అనదగ్గ ఇండో – స్విస్ పాడి క్షేత్రానికి మే 25 వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది. ఈ ప్రారంభోత్సవానికి భారత దేశంలో స్విస్ రాయబారి డా॥ జాక్విస్ అల్బర్ కట్టట్ హాజరయ్యారు.

వ్యవసాయ పరిశోధన భారతీయమండలి తాలూకు రైస్‌కమిటీ సమావేశంకూడా మే నెల ఆఖరువారంలో తిరువేంద్రంలో జరిగింది.

# ఉత్తర్‌ప్రదేశ్

## చిన్న తరహా నీటి వనరుల విస్తృతీకరణ

ఉత్తర్‌ప్రదేశ్ తూర్పు ప్రాంతంలోని 8 జిల్లాలలో, వ్యవసాయోత్పత్తిని హెచ్చించే నిమిత్తం చిన్నతరహా నీటి వనరులను విస్తృతీకరించే కార్యక్రమాన్ని ప్రారంభిస్తున్నారు.

ఇందుకొరకు ఆదిలో ఈ 8 జిల్లాలనుంచి ప్రతిజిల్లాలోనూ ఒక అభివృద్ధి మండలం చొప్పున ఎన్నికచేశారు. ఈ విధంగాఎన్నిక చేసిన అభివృద్ధి మండలాలలో సుమారు 50 శాతం విస్తీర్ణంలో ఇదివరకే నీటిపారుదల జరుగుతున్నది. కమతాల ఏకీకరణ కార్యక్రమం ముగిసి మార్పిడికూడా పూర్తయింది. ఇంతేకాక ఈ ప్రాంతాలలో రైతులకు చిన్నతరహా నీటివనరుల ఆవశ్యకత ఇతోధికంగా వుంది. ఈ కార్యక్రమం అమలుకు అల్హాబాదు జిల్లాలో మౌఐమఅభివృద్ధి మండలాన్ని, బల్లియజిల్లాలో హనుమాన్ గంజ్‌ను, గోరఖ్‌పూర్ జిల్లాలో పిప్రేచ్‌ను, బస్తీజిల్లాలో సౌన్‌ఘాట్‌ను, గొండాజిల్లాలో వజీర్‌గంజ్‌ను, సుల్తాన్‌పూర్ జిల్లాలో ముసాఫిర్‌ఖానాను, ఫైజాబాదుజిల్లాలో పురాబజారును ఎన్నికచేశారు. భహరేచ్ జిల్లాలో కూడా ఒక మండలాన్ని ఎన్నుకున్నారు.

## బుందేల్‌ఖండ్‌లో మరో విద్యుత్కేంద్రం

బెత్వానదీ తీరంలోనున్న ధుక్వాన్‌వద్ద 22,500 కి. వా. ల శక్తిగల నూతన హైడల్ కేంద్రాన్ని నెలకొల్పడానికి ప్రతిపాదించబడింది. ఝాన్సీపట్టణానికి నైరుతిగా సుమారు 20 మైళ్ళదూరంలో నిర్మించబడగల ఈ కేంద్రం బుందేల్‌ఖండ్‌కు విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తుంది.

## పంచాయతీరాజ్య సంస్థల ఆర్థికస్థితి

పంచాయతీరాజ్య వ్యవస్థలోని త్రివిధములైన సంస్థలు అంటే గ్రామపంచాయతీలు, క్షేత్ర సమితులు, జిల్లాపరిషత్తుల ఆర్థికవనరులు తదితర అంశాలను పరిశీలించే నిమిత్తం యు. పి. ప్రభుత్వం 10 మంది సభ్యులతో ఒక సంఘాన్ని నియమించింది. ఈ కమిటీ కార్యస్థానం లక్నోలోవుంది. ఇది నాలుగు నెలల్లో నివేదిక సమర్పిస్తుంది.

## అస్పృశ్యతా నిర్మూలన : రొక్కం బహుమతులు

అస్పృశ్యతను నిర్మూలించడంలో విశేష కృషి జరిపే పంచాయతీలకు వర్తమాన ఆర్థిక సంవత్సరంలో రొక్కం బహుమతులు ఇవ్వడానికి రాష్ట్ర ప్రభుత్వం రూ. 25,000 లు మంజూరుచేసింది.

## రక్షణసిబ్బంది పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యాలు

ప్రస్తుత అత్యవసర పరిస్థితి సందర్భంలో మరణించిన లేక అశక్తులైన లేదా కనిపించకుండావున్న లేక చనిపోయినట్లు భావించబడుతున్న రక్షణసిబ్బంది పిల్లలకు ప్రాథమిక దశనుంచి డిగ్రీస్థాయివరకు ఉచితంగా విద్యాసౌకర్యాలు కల్పించడానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది.

ప్రస్తుతం పాఠశాలకు వెళ్ళుతున్నా కొంత కాలంతరువాత పాఠశాలకు వెళ్ళగలపిల్లలకు కూడా ఈ రాయితీ లభింపజేయబడుతుంది.

## ఉత్తమ గ్రామసేవిక

ఉన్నావ్‌జిల్లా, నవాబ్‌గంజ్ బ్లాకులోని మకూర్ గ్రామానికి చెందిన శ్రీమతి కమలా అవస్తీ, రాష్ట్రమంతటిలోకీ ఉత్తమ గ్రామ సేవికగా ఎన్నిక చేయబడినారు. ఆరుగురు సభ్యులతోకూడిన ఒక సంఘం ఈ ఎన్నిక జరిపింది. రాష్ట్రసాంఘిక సంక్షేమ మండలి అధ్యక్షురాలు బేగం అలీ జహీర్ కమిటీ అధ్యక్షురాలుగా, సాంఘిక సంక్షేమ (మహిళలు) శాఖ డిప్యూటీ డైరెక్టరు కుమారి చంద్ర గోవింద్ కన్వీనరుగా వ్యవహరించారు.

శ్రీమతి అవస్తీ అజమాయిషీ క్రిందగల రెండు గ్రామాలలోనూ పొగరాని పొయ్యిలు, వస్త్రాలు ఉతుక్కునే అరుగులు, ఆహార పదార్థాలను పదిలపరచే సాధనసామగ్రి, పెరటితోటలు, డస్ట్‌బిన్లు మొదలైనవాటి విషయంలో సమగ్రమైన అభివృద్ధి జరిగింది. ఒక గ్రామంలో మహిళా సహకార సంఘాన్నికూడా నెలకొల్పి నమోదుచేశారు. ఇద్దరు మహిళలకు కోళ్ళపెంపకంలో శిక్షణ ఇవ్వబడింది. గుడ్లను పొదగడానికి ఉపయోగించే సాధనసామగ్రికూడా వారిపద్ద వుంది.

## కుటీర పరిశ్రమలకు సహాయం

పారిశ్రామిక సహకార సంఘాలకూ, షెడ్యూలు తెగలకు చెందినవారికీ, ఇతర వెనుకబడిన తరగతుల వ్యక్తులకూ ఆర్థిక సహాయం లభింపజేసేందుకై ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం రు 4 లక్షలు మంజూరుచేసింది.

## సాయుధ సిబ్బంది ఇచ్చే దరఖాస్తులకు ప్రాధాన్యత

సైనికోద్యోగులు తమ గృహవ్యవహారాలకు సంబంధించి పెట్టుకునే దరఖాస్తులకు ప్రాధాన్యత ఇవ్వవలసిందిగా యు పి. ప్రభుత్వం జిల్లా అధికార్లను ఆదేశించింది. సైనికోద్యోగులు చేసే ఫిర్యాదులనుగురించి వెంటనే దర్యాప్తులు జరిపి వారి ఇబ్బందులను

నివారించడానికి తక్షణమే చర్యలు తీసుకోవాలని ప్రభుత్వం అధికార్లను కోరింది.

### పిథోరాఘర్ విద్యుత్కేంద్రం

పిథోరాఘర్ పట్టణంలోని విద్యుత్కేంద్రంలో 1965 మార్చి నెలాఖరునాటికి 50 కి. వా. ల శక్తిగల అదనపు డీసెల్ సెట్టును నెలకొల్పుతారు. పిథోరాఘర్ పట్టణానికీ, ఆ పరిసర ప్రాంతాలకూ విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే నిమిత్తం పట్టణంలోని మెయిన్లను సుమారు రూ. 1,97,624 ల ఖర్చుతో విస్తృతీకరిస్తారు

### రక్షణసిబ్బందిపిల్లలకు ఉచిత విద్య

"దిగువశ్రేణి" హోదాలలోవుండి నెలకు రూ. 400/– ల వరకు జీతం పొందుతున్న ఎన్.సి.ఓ లు, జె.సి.ఓ.లు నౌకా, విమానదళాలలో ఇవే హోదాలలో పనిచేసే సిబ్బంది పిల్లలకు కూడా ఉచితవిద్యా పథకాన్ని వర్తింపజేయడానికి ప్రభుత్వం నిశ్చయించింది.

### పనివారల ఇతోధికశిక్షణ

సుశిక్షితులయిన వృత్తి పనివారలను తయారుచేయడంలో 200 శాతం అభివృద్ధిని తీసుకురావాలన్న తన తృతీయ ప్రణాళికా ధ్యేయంలో ఉత్తరప్రదేశ్ పూర్తిగా కృతకృత్యురాలైంది. అనుకున్న సమయంకంటే రెండేళ్ళు ముందుగానే తన ధ్యేయాన్ని నెరవేర్చింది. వర్తమాన ప్రణాళికాకాలంలో అదనంగా 10,632 సీట్లు కల్పించాలని ఉద్దేశించగా యిప్పటికి అప్పుడే 26 ఇంజనీరింగు, 12 ఇంజనీరింగేతర వృత్తులలో శిక్షణ నిమిత్తం మొత్తం 9,536 సీట్లు కల్పించబడ్డాయి. వర్తమాన ప్రణాళికా కాలంలో రాష్ట్రంలోని పారిశ్రామిక శిక్షణ కేంద్రాలను 44 కు పెంచాలనే ధ్యేయం పూర్తిగా సాధించబడింది. ప్రస్తుతం ప్రతి 18 నెలలకు రాష్ట్రం 16,000 మంది నిపుణులైన వృత్తిపనివారలను తయారుచేస్తున్నది.

### కోసీ ఆనకట్టకై పరిశీలనలు

నైనిటాల్, అల్మోరా జిల్లా సరిహద్దున రామనగర్‌కు సుమారు 17 మైళ్ళదూరంలో కోసీనదిపై 550 అడుగుల ఎత్తుగల కాంక్రీటు ఆనకట్టను నిర్మించేందుకు జరుగుతున్న భూగర్భ పరిశీలనలు శీఘ్రగతిని కొనసాగుతున్నాయి. ఈ కోసీనది రామగంగకు ఉపనది.

తొలినివేదిక ప్రకారం యీ స్థలం పెద్ద ఎత్తున కట్టే ఆనకట్టకు చక్కగా సరిపోతుంది. ఆనకట్ట నిర్మాణంవల్ల 102.5 మె. వా. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయడం సాధ్యమవుతుందని, 98,000 ఎకరాలనేలకు నీటిపారుదల సౌకర్యం కల్పించడానికి వీలవుతుందని అంచనా వేయబడింది.

### పునరావాసానికై ఏడు కాలనీలు

ప్రభుత్వ మాజీసేవకులకు, వలస వచ్చినవారికీ, స్వాతంత్ర్యం గురించి పోరాడినవారికీ, వ్యవసాయ గ్రాడ్యుయేట్లకు, భూములేని కార్మికులకు పునరావాసం కల్పించేనిమిత్తం యింతవరకురాష్ట్రంలో ఏడు కాలనీలు నిర్మించడం జరిగింది. కాశీపూర్, తారాయ్ (నైనిటాల్) కాలనీతో పాటు అవి గంగాధర్ (మీరట్) అఫ్జల్‌ఘర్ (బిజ్నోర్), మనానగర్ (రాంపూర్), దునగిరి (అల్మోరా) ఖేరి (లఖింపురాఖేరి).

ఈ కాలనీలోని మొత్తం సాగుకొచ్చే 1,18,551 ఎకరాల నేలకు 90,349 ఎకరాల నేలను సేద్యంక్రిందకు తీసుకురావడం జరిగింది.

### అలహాబాదులో గంగపై కొత్త వంతెన

రూ 240.50 లక్షల ఖర్చుతో గంగానదిపై అలహాబాదువద్ద ఒక కొత్త బ్రిడ్జి నిర్మించబడుతుంది.

## గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

1964 మార్చి నెలలో రాష్ట్రంలోని దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా జరిగింది :

**అనంతపురంజిల్లా** : తలుపుల, ఓబులరెడ్డిపల్లి, మైదుగోలం, కొరకుంట, కలిపి, ఉప్పరపల్లి, తూముకుంట, చల్లపల్లి, కొండాపురం, మవతూరు, బుల్లసముద్రం, నీలకంతాపురం, ఆర్. అనంతపురం, హులవోయ్, పాపసానిపల్లి, గోవిందాపురం, జతలూరు ; **చిత్తూరుజిల్లా** : పత్రపల్లి, కొత్తూరు, చౌడపల్లి, తాటిగుంటపాలెం, కొత్తపల్లి, గట్టు, చింతవారిపల్లి, రాచవారిపల్లి, బొమ్మనేడు – ఉప్పరపల్లి శివారుగ్రామం, మాధవరం, వడెపల్లి, కొత్తూరు, సామిరెడ్డిపల్లి; **కడపజిల్లా** : జంగలపల్లి, ఒంగిపల్లి; **కర్నూలుజిల్లా** : మార్కాపురం, రుద్రవరం, ఆకుమళ్ళ, ముక్కమళ్ళ, పండ్లపురం, కానదేవు, నందివర్గం, గోనవరం, అలమూరు, తర్తూరు



అలసట పోయి
హుషారు కలగాలంటే...

మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే టీ

సాటిలేని టీ!



టాటా-ఫిన్లే టీ కంటె తృప్తికరమైనదేముంది! ఇందుకు కారణాలు:—

## తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

## పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

## ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** టీ త్రాగండి; ఆనందము అందుకోండి!

ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్—సుందరమైన టిన్
లలిత్—బంగారు రంగు ప్యాకెట్
మిలాప్—వెండి రంగు ప్యాకెట్
బహదూర్-నారింజ రంగు ప్యాకెట్
షాన్—నీలి రంగు ప్యాకెట్



# తేజోమూర్తి - నెహ్రూ

ఏ. వెంకటేశ్వర్లు

శిలలై నిల్చెను జీవకోటి ధరపై
శ్రీఘ్రంబె యీ వార్తకున్
చలమేపట్టెనో? మృత్యుదేవి యిపుడే
చంపంగ నెహ్రూత్తమున్
బలమేపోయెను మాకు దిక్కుగలదే ?
భారంబు మోయంగ - మా
తలవ్రాతల్తుడుపంగనౌనె ? వసరెన్
ధాత్రీ తలంబంతయున్

ప్రతి గృహంబునందుఁ బ్రతి కేంద్రమందునఁ
బసినిసుంగు మొదలు ముసలి వఱకుఁ
దమకు నౌర ! యాపదలు వచ్చి పడినట్లు
పొక్కుచుండి రాత్మఁ బొక్కి పొక్కి

ఖండ ఖండాలు గగ్గోలు కలతఁ జెంది
దుఃఖవారాశి మున్గిరి తూలిపడఁగ
తలఁచినంతట గుండెలే దద్దరిల్లు
మూడుమూర్తుల మూర్తియై మురిసిపోయె.

కష్టము లతని వంతు సుఖంబు మనది
శ్రమ యతనిపాలు ఫలితము జగముపాలు
స్వర్గ మతనిది మనదియశాంతిజగము
ముందు దారింక ముప్పులో ముండ్లపొదలో ?

తీరనిలోటు కాదె సరిదిద్దఁగఁ జాలని లోస మిద్ది, యే
తీరున నేఁటిపోకడలు తీర్పను బొందునో చెప్పఁజాల రె
వ్వారలు దేశచక్రమును వంచనసేయక త్రిప్పువారో ? హా
యారని చిచ్చు పుట్టెఁ బరమాత్ముఁడె రావలె సృష్టినేతయై.

గాంధితాతయు నెహ్రూజీ కలియుగమున
దైవరూపంబు లౌచును దేజరిల్లి
తీర్చి దిద్దిరి దేశంబు దివ్యశక్తి
యట్టివారలు నేఁ డేరి ? యార్యభూమి.

ఎంత యేడ్చిన మే మింక నేక మగుచు
బాధ పడినను నీ మూర్తిఁ బడయఁగలమె?
నీకు నీవయే సాటి యో నిర్మలాత్మ !
శాంతి పొందుము నేఁడైన స్వర్గమందు.

అభ్యుదయం

### రహదార్లు

**తాళ్ళపాలెంవద్ద తుంగభద్రకాలువపై వంతెన.**

తాళ్ళపాలెం సమీపంలో తుంగభద్ర కాలువపై రూ. 88,000 ల వ్యయంతో ఒక వంతెన నిర్మించే పథకానికి 1958-59 వ సంవత్సరంలో మంజూరీ లభించింది. ఆర్. సి. సి. టి. స్తంభాలుగల ఈ వంతెనకు 3 స్పానులున్నాయి. నేల గట్టిది కాకపోవడంవల్ల పునాదులు లోతుగా త్రవ్వవలసి వచ్చింది. ఈ వంతెన నిర్మాణానికి 1959 ఏప్రిల్ 16 వ తేదీన శంకుస్థాపన జరిగింది. 1964 ఏప్రిల్ 18 వ తేదీన ముఖ్యమంత్రి వంతెనకు ప్రారంభోత్సవం చేశారు

రూ. 1.03 లక్షల సవరింపు అంచనాకు సాంకేతికంగా మంజూరీలభించింది. మొదట 1959వ సం లో వేసిన అంచనాల కంటె పరికరాల ధరలు, కూలీరేట్లు పెరిగిపోవడంవల్ల ఈ సవరింపు అవసరమైంది.

పశ్చిమ గోదావరి జిల్లాలో కోడేరు-నల్లజెర్ల రోడ్డు ప్రధానమైన రహదారి. ఇది మార్టేరు పట్టణ హద్దులలో 8/2 వ మైలు వద్ద నర్సాపురం కాలువమీదుగా వెళ్తుంది. ఈ ప్రదేశంలోగల పాత వంతెనను పునర్నిర్మించడానికి 1959 ఏప్రిల్ 8 వ తేదీన మంజూరీ లభించింది.

ఈ వంతెనకు 37 అడుగులు, 6 అంగుళాల కొలతగల గవాక్షాలు రెండువున్నాయి. వంతెనపైన రోడ్డు వెడల్పు రెండు కాలిబాటల మధ్య- 24 అడుగులు వుంది. 24 అడుగుల లోతున పునాదులు త్రవ్వారు.

అప్రోచ్‌లతో సహా వంతెన నిర్మాణ వ్యయం అంచనా రూ. 2,43,000 లు. 1964 ఫిబ్రవరిలో పని ముగిసింది.

### విద్యుచ్ఛక్తి

**నెల్లూరులో 30 మె. వా. ల థర్మల్ కేంద్రం:**

మొదటి బాయిలర్ విషయంలో ఆవిరి, నీటి డ్రమ్ములను నెలకొల్పారు. గొట్టాలను విస్తరింపజేసే పనులు ముగిశాయి. ఇ-మిల్స్, ఏ. పి ఫాన్, ఎఫ్. డి. ఫాన్ల స్థాపన పూర్తయింది. ఫర్నేస్ వాల్ ట్యూబులు, డస్ట్ కలెక్టర్ ఐ. డి. ఫ్యానులను నెలకొల్పేపనులు కొనసాగుతున్నాయి. రెండవ బాయిలర్ విషయంలో అష్‌ప్లాంట్ బి-14 కన్వేయర్, ఆష్ హాపర్లను స్థాపించే పనులు ప్రారంభమయ్యాయి. సివిల్ పనులు వేగంగా జరుగుతున్నాయి. ఇవి ముగిసిన వెంటనే టర్బో జనరేటర్ సెట్టును స్థాపించే పని చేపడతారు. 40 ఎం. వి. ఏ. పవర్ ట్రాన్స్‌ఫార్మర్, 20 ఎం. వి. ఏ. ట్రాన్స్‌ఫార్మర్, ఔట్‌డోర్ స్విచ్ గేర్లు ఇంకా చేరలేదు.

**హంపి — గుత్తి - కడప 132 కె. వి. లైను:**

ఈ లైను వేసే పనులు పూర్తిగా ముగిశాయి. 60 కి. వా. ల శక్తితో 1964 ఫిబ్రవరి 20 వ తేదీన దీనిని వినియోగంలోకి తెచ్చారు.

తుంగభద్ర ఆనకట్ట విద్యుత్కేంద్రంలో 9,000 కి. వా. ల శక్తిగల మూడవ యూనిటును 1964 ఫిబ్రవరి 20 వ తేదీన ప్రారంభించారు.

**సబ్‌స్టేషన్లు**

హంపి-కడప 132 కె. వి. సబ్ స్టేషన్లను 1964 ఆగస్టులో వినియోగంలోకి తేవడానికి నిశ్చయించారు. వివిధ పరికరాల కొరకు ఆర్డర్లు చేశారు. స్విచ్చులు, బార్లు వచ్చాయి. స్ట్రక్చర్లను తయారు చేస్తున్నారు. 132 కె. వి. గుత్తిసబ్ స్టేషను నిర్మాణాన్ని నిలిపివేశారు.

**కొత్తగూడెం థర్మల్ పథకం, మొదటిదశ:**

ఈ పథకానికి అవసరమైన బాయిలర్లు, జనరేటర్ల కొరకు ఆర్డర్లు చేయడం జరిగింది. కన్సల్‌టింగ్ ఇంజనీర్లు ఉత్పత్తిదార్లతో సాధన సామాగ్రి, యంత్రం డిజైనుకు సంబంధించిన విభిన్నాంశాలను చర్చించి స్థిరీకరించారు.

**కొత్తగూడెం - వరంగల్ - రామగుండం 132 కె. వి. డి. సి. లైను:**

విద్యున్మార్గం నిర్ణయం జరిగింది. పనులు అమలు జరుగుతున్నాయి. ట్రాన్స్‌మిషన్ లైన్లలో ఉపయోగించే ఏ. సి. ఎస్. ఆర్. పవర్ కండక్టర్ ఉత్పత్తినిమిత్తం అవసరమైన 3/8 అంగుళాల వ్యాసంగల అల్యూమీనియం కడ్డీలను సరఫరా చేసేందుకై వచ్చిన టెండర్లను పరిశీలిస్తున్నారు.

**రామగుండం థర్మల్ విస్తరణ పథకం రెండవ దశ:**

టర్బో ఆల్టర్‌నేటర్ సెట్టు యొక్క ప్రధాన విడిభాగాలు 1963 డిశంబరు 20 వ

తేదీన ఓడద్వారా రవాణా అయి 1964 జనవరి 27 వ తేదీన బొంబాయికి చేరాయి. బాయిలర్, ఫీడ్ పంపులుకూడా బొంబాయికి రవాణా అయ్యాయి. వాటిని ప్రాజెక్టు స్థలానికి తరలిస్తున్నారు. కండెన్సర్, ఏక్సైటరీస్‌కు సంబంధించిన సవరించిన స్పెసిఫికేషను కన్సల్‌టెంట్సు వద్దనుంచి వచ్చింది. దానిని పరిశీలించి, స్థిరీకరించడం కూడా ముగిసింది. ముద్రిత ప్రతులను టెండర్ల నిమిత్తం న్యూఢిల్లీలోని డి. జి. ఎస్., డి.కి పంపడమైంది.

హైద్రాబాదులో గ్యాస్ టర్బో సెట్లు:

10 మె. వా. ల శక్తిగల రెండు సెట్లలో ఒకదానికి ముఖ్యమంత్రి 1964 జనవరి 26 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు. రెండవ సెట్టును 1964 మార్చి 27 వ తేదీన వినియోగంలోకి తెచ్చారు.

తెలంగాణా హైడ్రో థర్మల్ పథకం:

రామగుండం బాయిలర్ విషయంలో పవర్, కంట్రోల్ కేబిల్స్‌కు, ఎల్. టి. స్విచ్ బోర్డు (సర్క్యూట్ బ్రేకర్లతో సహా) లకు ఆర్డర్లు చేశారు. 1875 కె. వి. ఏ. ఆగ్జిలరీ ట్రాన్స్‌ఫార్మర్ నిమిత్తం స్విచ్ బోర్డుతోసహా 125.00 ఎంపైర్స్ సర్క్యూట్ బ్రేకర్ల సరఫరా కొరకు తిరిగి వర్తమానం పంపడం జరిగింది.

హుసేన్ సాగర్ మెయిన్‌బాయిలర్ పని ముగింపు దశలో వుంది. బొగ్గుబంకర్లు, మొదలైనవాటి స్థాపన ముగిసింది.

ట్రాన్స్‌మిషన్, పంపిణీ పథకం:

ఎగువ సీలేరు - కొత్తగూడెం - నాగార్జునసాగర్ 220 కె. వి. లైను:

20 మైళ్ళవరకు సమగ్ర పరిశీలన పూర్తయింది. సబ్ సెట్టింగ్ పనులు కొనసాగుతున్నాయి. గోదావరినది మీదుగా ఏ ప్రదేశంలో ఈ లైను నిర్మించవలసిందీ నిర్ణయించారు. స్పెషల్‌టవర్ల డిజైనింగును త్వరలోనే చేపడతారు.

కడప - మద్రాసు సరిహద్దు 220 కె. వి. లైను:

టవర్లు, ఇన్సులేటర్లు, గ్రౌండ్ వైర్ మొదలైన సాధన సామగ్రి నిమిత్తం టెండర్లు స్వీకరించడం జరిగింది.

నాగార్జునసాగర్ - శ్రీశైలం - కడప 220 కె. వి. లైను:

విద్యున్మార్గాన్ని స్థిరీకరించడం జరుగుతున్నది, టవర్ల నిమిత్తం, పనులనిమిత్తం, టెండర్లు వచ్చాయి. వాటిని పరిశీలిస్తున్నారు.

## పశుసంతతి అభివృద్ధి

చిత్తూరు జిల్లాలో స్థానిక రాయలసీమ పశు సంతతిని అభివృద్ధిపరిచే నిమిత్తం, ఇంగ్లాండుకు చెందిన మిల్క్ మార్కెటింగ్ బోర్డు సౌజన్యంతో క్రైజాతి పశువుల వీర్యాన్ని (500 మోతాదులు) మన రాష్ట్రం దిగుమతి చేసుకున్నది. మద్రాసులోని మెసర్స్ పారీ అండ్ కంపెనీవారు లభింపజేసిన నత్రజని ద్రావణాన్ని ఉపయోగించడం ద్వారా వీర్యాన్ని నిలువజేసి వుంచడానికి సాధ్యమైంది. పాడి అభివృద్ధికై పశుజాతిని తీవ్రగతిని పెంపొందించడానికి ఈ విధానం నూత్న అవకాశాలు కల్పించింది.

## ఖనిజ సంపద

సున్నపురాతి గనులు:

ఆంధ్రప్రదేశ్‌లో శ్రేష్ఠమైన మాగ్నీసియం సున్నపురాతి గనులు అపారంగా వున్నట్లు ప్రసిద్ధి. ఈ సున్నపు రాళ్ళను ఉక్కు తదితర పరిశ్రమలలో ఉపయోగిస్తారు. దేశ పారిశ్రామికాభివృద్ధికి తప్పనిసరిగా కావలసిన ముడిపదార్థం ఇది. పరిశ్రమలలో మాగ్నీసియం సున్నపురాళ్ళ వినియోగానికి గల అవకాశం, గ్రేడులవారీగా వీటి నిక్షేపాలను గూర్చి తెలుసుకునే నిమిత్తం ఖమ్మం జిల్లాలో ఇటీవల సమగ్రంగా పరిశీలనలు జరిపారు.

ఈ సున్నపురాతి నిక్షేపాలు ఖమ్మం పట్టణానికి ఉత్తర దిశలో అయిదుమైళ్ళ దూరంలో వున్నాయి. సున్నపురాళ్ళ నమూనాలను 50 అడుగుల మందంవరకు సేకరించారు. 650 లకు పైగా నమూనాలను పరిశీలించారు. ఈ పరిశీలనవలన ఈ నిక్షేపాలలో ఎక్కువ భాగం మాగ్నీసియం సున్నపురాయి ఉన్నట్లుతేలింది.

## కార్మిక సంక్షేమం

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రారంభించిన కార్మిక సంక్షేమ కేంద్రాలన్నింటిలోనూకార్మికుల కొరకు ఔట్ డోర్, ఇండోర్ క్రీడలను నిర్వహిస్తున్నారు. వీటిలో రోజూ సగటున 100 మొదలు 150 వరకు కార్మికులు పాల్గొంటున్నారు.

మహిళల ప్రయోజనార్థం వృత్తి, వంట, చేతిపనులు, ఆటలను నిర్వహిస్తున్నారు. రోజుకు సగటున 30 మంది స్త్రీలు వీటినుంచి ప్రయోజనం పొందుతున్నారు. వీరు నేర్చుకున్న వివిధ కళలు, వృత్తి పనుల వలన కొన్ని కుటుంబాలకు పరోక్షంగా ఆర్థిక ప్రయోజనం చేకూరుతున్నది కొన్ని సందర్భాలలో ఆర్డర్లు పొందడం ద్వారా ప్రత్యక్షంగా ప్రయోజనం పొందడం జరుగుతున్నది. మరికొన్ని సందర్భాలలో వృత్తి పనులు అభ్యసించిన మహిళలు లాభసాటియైన ఉద్యోగాలు పొందగలిగారు కూడా!

స్త్రీ హెల్త్ విజిటర్లు కార్మికుల ఇండ్లకు

వెళ్ళి గర్భిణీస్త్రీలు, బాలింతరాండ్రను పరీక్షించి సలహా లిస్తున్నారు. వీరు శిశు సంక్షేమం, కుటుంబ సంక్షేమాన్ని గురించి కూడా తీవ్రంగా ప్రచారం చేస్తున్నారు. హెల్త్ విజిటర్లు రోజుకు సగటున 5 లేక ఆరుగురు గర్భిణీస్త్రీలు,బాలింతలను పరీక్షచేస్తున్నారు. అంతేకాక ప్రతిరోజూ అయిదు లేక ఆరు ఇండ్లను కూడా సందర్శిస్తున్నారు. సంక్షేమ కేంద్రాలలో పిల్లలకు, తల్లులకు పాలు పంచిపెడుతున్నారు. యునిసెఫ్ సరఫరా చేసిన పాలను సగటున 20 మొదలు 25 మందికి సరఫరా చేస్తున్నారు. క్లిష్టమైన కేసులు ఆసుపత్రులకు, ఉద్యోగుల ప్రభుత్వ భీమా పథకం చికిత్సాలయాల వైద్యాధి కారిణులకు నివేదించబడుతాయి. ఈ వైద్యాధికారిణులు పక్షానికి ఒక పర్యాయం సంక్షేమ కేంద్రాలను సందర్శిస్తుంటారు.

కార్మిక సంక్షేమ కేంద్రం కార్యకలాపాలలో పిల్లలను పాఠశాలలకుపంపడం ఒక భాగం. కొన్ని సంక్షేమ కేంద్రాలలో నర్సరీ పాఠశాల విభాగాలు వున్నాయి. ఒక్కొక్క కేంద్రంలో 30 మంది పిల్లలు వున్నారు.

స్వల్ప ప్రమాదాలకు సంక్షేమ కేంద్రాలలో ప్రథమ చికిత్సకూడా జరుపుతారు.



## నాటక రచయితలకు ఒక క్రొత్తఅవకాశం

చైనా మన దేశానికి చేసిన ద్రోహం బయటపడ్డతర్వాత ప్రజలలో కలిగిన నవచైతన్యం – ఇప్పటి మన దేశ రక్షణప్రయత్నంలో ప్రజానీకంపాత్ర – ప్రజాశికా కార్యక్రమంవల్ల నిజంగా కలుగుతున్న సాంఘిక సంచలనం – ఇవి ముఖ్యాంశాలుగా సూచించగల ఇతివృత్తంతో, రెండు గంటలలో ప్రదర్శించటానికి వీలైన తెలుగు రంగస్థల నాటకాలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యీ క్రింది బహుమతు లివ్వటానికి నిర్ణయించింది :

మొదటి బహుమతి......రూ. 1,000
రెండవ బహుమతి........రూ. 500
మూడవ బహుమతి.......రూ. 300

రచనలు క్రొత్తవిగా వుండాలి. ఇదివర కెక్కడా ప్రచురింపబడినవి గాని, ప్రదర్శింపబడినవి గాని పంపగూడదు. ఒక్కొక్క రచన మూడుప్రతులు పంపాలి. అవి 1–9–1964 లోపుగా యీ దిగువ చిరునామాకు చేరాలి.

బహుమతి పొందిన నాటకాలమీద అన్ని హక్కులూ ప్రభుత్వానికే చెందుతవి.

డైరెక్టరు,
సమాచార పౌరసంబంధాల శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,
హైదరాబాదు.

# 'ఆంధ్రప్రదేశ్'

## తెలుగు, ఉర్దు, హిందీ, ఇంగ్లీషు మాస పత్రిక ప్రకటన రేట్లు

దిగువ రేట్ల ననుసరించి 'ఆంధ్ర ప్రదేశ్' మాస పత్రికలో ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | నాలుగు సంచికలలో | | | ఒక సంచికలో మాత్రమే | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| లోపలి పేజీ | 300 | 150 | 100 | 100 | 55 | 30 |
| వెనుక అట్ట పేజీ (4) | 400 | — | — | 150 | — | — |
| అట్ట 2, 3 పేజీలు | 350 | — | — | 125 | — | — |

**ఒక సంవత్సరం కంట్రాక్టు ప్రకటనలకు 20 శాతం రిబేటు ఇవ్వబడును.**

### నిబంధనలు

1. మెకానికల్ వివరాలు : 10½" × 8½" డెమ్మీ.
2. ముందు అట్ట టైటిల్ పేజీపై ప్రకటనలు స్వీకరించబడవు.
3. పావు పేజీకి తక్కువగా ఉన్న ప్రకటనలు స్వీకరించబడవు.
4. వచ్చే సంచికలో ప్రచురించడానికి వీలుగా స్థలం వివరాలు, డబ్బుతోసహా ప్రకటన సమాచారాన్ని ప్రతినెల 8వ తేదీలోపుగా యీ కార్యాలయానికి పంపాలి. క్రాస్ చేయని డిమాండ్ డ్రాఫ్ట్‌ద్వారా గానీ, మనియార్డరు ద్వారా గానీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌర సంబంధముల శాఖ డైరెక్టరు, హైద్రాబాదు పేర డబ్బును పంపాలి.
5. బ్లాకుల విషయంలో అన్నివిధాలా శ్రద్ధ తీసుకోబడుతుంది. అయితే మిషనుపై బ్లాకులు పగిలిన యెడల యీ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన విధం, స్థలం వివరాలను ఒక సంచికలో ప్రకటించాలో (భాషను తెల్పాలి) లేక 4 సంచికలలో ప్రకటించాలో స్పష్టంగా పేర్కొనాలి.
7. డబ్బు చెల్లింపు, యితర ప్రత్యుత్తరాలను దిగువ వారితో జరుపాలి :—

డైరెక్టర్,
సమాచార పౌరసంబంధాల శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం,
హైదరాబాద్-1.

(8 వ పేజీ తరువాయి)

## సంపూర్ణ ఆర్థిక సహాయం

మామూలు ఋణ సహాయక కార్యక్రమాలతోపాటు మూసి, కదం, కె. సి. కాలువ, నాగార్జునసాగర్ ఆనకట్టక్రిందగల అయకట్టు అభివృద్ధికి సంపూర్ణ ఆర్థిక సహాయపథకం అనే ఒక ప్రత్యేక పథకాన్ని కూడా ఆంధ్రప్రదేశ్ సహకారకేంద్ర భూమి తనఖా బ్యాంకు తన కార్యక్రమంలో చేర్చినది. ఇక్కడ సూచించిన విధంగా త్వరలోనే రూ 1149 లక్షలను భూమితనఖా బ్యాంకులు పంపిణీ చేయాలని ఉద్దేశించబడింది.

(1) నాగార్జున సాగర్ ఆనకట్ట: రూ. 887 లక్షలు

(2) కె. సి. కాలువ : రు. 187లక్షలు; (3) కదం: రూ. 75 లక్షలు.

సహకార వ్యవసాయ పథకం గ్రామీణులకు పూర్తి ఫలితాన్నిచ్చే ఒక పథకం. 1963_64 సం. లో, పైలట్ ప్రాంతాలలోనూ పైలట్ కాని ప్రాంతాలలోనూ 70 సంఘాలను నిర్వహించే ఒక కార్యక్రమానికి ఆమోదం లభించింది. ఈ ధ్యేయాన్ని దృష్టిలో వుంచుకుని యింతవరకు పైలట్ పథకం ప్రాంతంలో 16 సహకార వ్యవసాయ సంఘాలు, ఆ ప్రాంతంవెలుపల 12 సంఘాలు నిర్వహించబడ్డాయి. అదే సంవత్సరంలో తొమ్మిది సంఘాలకు రూ. 48,475 లు వరకు ఆర్థికసహాయం యివ్వడం జరిగింది.

అత్యవసర వస్తువుల ధరలను అదుపులో పెట్టడానికై తీవ్రచర్యలు తీసుకోవాలని నిశ్చయింపబడింది. కేంద్ర సహకార దుకాణాలను నిర్వహించే ఒకపథకాన్ని కేంద్రప్రభుత్వం చేపట్టింది. 1963_64లో 11 దుకాణాలు నిర్వహింపబడ్డాయి. వీటికితోడు ప్రభుత్వ సేవకులవినియోగదారుల సహకారసంఘాలు 21 వున్నాయి. 30_11_1963 తేదీనాటికి రూ. 3,16,945 వాటాధనంతో యీ సంఘాలలో మొత్తం 35,037 సభ్యులు వున్నారు. రాష్ట్రంలో పని చేయడానికి యింతవరకూ 850 చౌకదుకాణాలను తెరవడానికి మంజూరు లభించింది. ఇవికాక సహకార రంగంలో 264 చౌకదుకాణాలు పనిచేస్తున్నాయి.

## కార్మికులకు న్యాయం

రాష్ట్రంలో కార్మికులకు, యజమానులకుమధ్య సంబంధాలు మెరుగ్గా వున్నాయని పారిశ్రామిక శాంతి తీర్మానం వ్యక్తం చేసింది. 1963_64 లో మొత్తం 204 పారిశ్రామిక వివాదాలకు 112 వివాదాలు సమాధాన పరచడం జరిగింది. ఇవికాక పైగా మరో 93 వివాదాలకు తీర్పుయివ్వడం జరిగింది. యాభైఎనిమిది వివాదాదాలు తీర్పుకై కార్మిక న్యాయస్థానాలకు పంపబడ్డాయి. అయిదు వివాదాల విషయంలో యిరువర్గాలవారూ స్వచ్ఛంద మధ్యవర్తిత్వానికి అంగీకరించారు.

పారిశ్రామిక శాంతితీర్మానంలో ఒక భాగంగా అత్యవసర ఉత్పత్తికమిటీలను యింతవరకూ ఆంధ్రప్రదేశ్‌లో 69 పరిశ్రమలు స్థాపించాయి. కమిటీవల్ల ఒనగూడే లాభాలను విస్తృతీకరించాలనే తీర్మానాన్ని దృష్టిలో వుంచుకుని, వందమందిగాని, అంతకు ఎక్కువగాగాని కార్మికులుగల అభివృద్ధి దశలోని పరిశ్రమ లన్నింటిలో అత్యవసర ఉత్పత్తి కమిటీలను ఏర్పాటు చేయాలని ఉద్దేశించబడింది. ఈ కమిటీల ఏర్పాటువల్ల ఉత్పత్తి అధికం కావడమే కాక అనేక పరిశ్రమలలో పనికి గైరుహాజరయ్యేవారి సంఖ్యలో తగ్గుదలకుకూడాకారమైంది.

1963 లో కార్మికుల నష్టపరిహారం చట్టంక్రింద రోగగ్రస్తులు, గాయపడినవారు అయిన కార్మికులమీద ఆధారపడిన వారికిచ్చే డబ్బు విషయంలో ప్రయివేటు, పబ్లిక్ రంగాలలో కార్మికుల వద్దనుండి వసూలుచేసిన రూ. 9,03,284_13 న. పైసలకు రు 6,62,383_13 న. పై ఆయా వ్యక్తులకు యజమానులు యివ్వడం జరిగింది. కార్మికుల రాష్ట్ర భీమాపథకం క్రింద పారిశ్రామిక కార్మికుల కొరకు 1964 మే 29 వ తేదీన హైదరాబాదులో 150 పడకలు గల వైద్యశాల ఒకటి ప్రారంభించబడింది.

## స్త్రీ సంక్షేమం

తృతీయప్రణాళికలో స్త్రీ సంక్షేమశాఖకు కేటాయించబడిన రూ, 44.39 లక్షలకు 1963_64 సంవత్సరానికి రు. 6.31లక్షలూ, 1964_65 సంవత్సరానికి రు. 8.75 లక్షలూ ఉద్దేశించబడ్డాయి. సేవాగృహాలను విస్తృతీకరించడం ప్రణాళికలో ఒక ముఖ్యమైన పథకం. హైదరాదు, అనంతపురంలలో సేవాగృహాలలో శిక్షణ, ఉత్పత్తి యూనిట్లు ప్రారంబించబడ్డాయి. తృతీయ ప్రణాళిక క్రింద యింతవరకు 15 బాలగృహాలు ప్రారంభించబడింది.

1964_65 సం. కాలంలో మరొక గృహాన్ని ప్రారంభించడానికి ఉద్దేశించబడింద. తృతీయ ప్రణాళికా ధ్యేయం 28 బాలవిహారాలను నెలకొల్పాలని కాగా, యింతవరకు 21 బాలవిహారాలు నెలకొల్పబడ్డాయి. మిగిలిన 7 బాలవిహారాలూ 1964_65 కాలంలో నెలకొల్పాలని ఉద్దేశించబడాయి.

## పౌర సంభంధాలు

ఆంధ్రప్రదేశ్‌లో సినిమా పరిశ్రమను ప్రోత్సహించాలనే రాష్ట్రప్రభుత్వ నిర్ణయాన్ని దృష్టిలో వుంచుకుని, సినిమాస్టూడి

యోలకు ఋణాలను మంజూరు చేయాలని, రాష్ట్రంలో తయారయిన కథా చిత్రాలకు సబ్సిడీలు యివ్వాలని, ప్రతి రెండునెలలకూ ఒక వార్తాచిత్రాన్ని సమాచార పౌరసంబంధాలశాఖ తయారు చేయాలని, ఏటా ఉత్తమ కథా, వార్తా, విజ్ఞాన, బాల చిత్రాలకు బహుమతులు యివ్వాలని 1963_64లో నిశ్చయించడం జరిగింది. సమాచార, పౌర సంబంధాల శాఖ ఎనిమిది ప్రదర్శనల్లో పాల్గొంది. ఇందులోని విషయం రక్షణ సన్నాహానికి సంబంధించినది.

సమాజ వికాసానికి సంబంధించిన రేడియోసెట్లు ఏర్పాటు పథకంక్రింద 1963_64 సం.లో 684 సెట్లు నెలకొల్పబడ్డాయి. దీనితో యీశాఖ ఆధ్వర్యం క్రింద వున్న సెట్లు 10,484 అయ్యాయి. మామూలుగా నెలకొల్పాలనుకున్న సెట్లు 1000 మాత్రమే కాగా ప్రత్యేకవిషయంగా భారత ప్రభుత్వం 1964_65 సంవత్సరానికి 3500 సమాజ వికాస రేడియో సెట్లను కేటాయించింది. రాష్ట్రసబ్సిడీ పథకంక్రింద 500 సి. ఆర్. సెట్లను కొనడానికి రాష్ట్రప్రభుత్వం కూడా మంజూరు చేసింది. ఈ 4,000సెట్లూ 1964_65లో నెలకొల్ప బడతాయి.

1963_64లో మొత్తం 304 గ్రామస్థుల రేడియోగోష్ఠులు నిర్వహించ బడ్డాయి. వీనికితోడు గోష్ఠులకు సంబంధించిన విషయాలతో 'గ్రామవాణి' అనే త్రైమాస పత్రిక ఒకదానిని సమాచార, పౌరసంబంధాలశాఖ ప్రారంభించింది. అత్యవసర పరిస్థితి దృష్ట్యా క్షేత్రప్రచార కార్యక్రమాలకు అధిక ప్రాధాన్యత యివ్వబడింది. జిల్లా స్థాయిలో 20 క్షేత్రప్రచార యూనిట్లు వివిధ విధానాలద్వారా యించుమించు 49.4లక్షల సామాన్యప్రజల మధ్యకు వెళ్ళాయి. ఈ యూనిట్లు సుమారు 2073 సినిమా ప్రదర్శనల్ని, 1785 సంగీత నాటక కార్యక్రమాలను, 405ప్రదర్శనల్ని యిచ్చాయి. రక్షణకు సంబంధించిన విషయాలే యిందులో ప్రధానమైన అంశం. రక్షణకు సంబంధించిన తెలుగు నాటకానికి పోటీ ప్రకటించేందుకు ప్రభుత్వం అంగీకరించింది. పత్రికలకు, ప్రభుత్వశాఖలకు ఉపయోగపడేటట్లుగా ఒక రిఫరెన్స్, రిసర్చి విభాగంకూడా ఏర్పాటు చేయబడింది. ఇదే సంవత్సరంలో కృష్ణా, కడప, నిజామాబాదు, ఆదిలాబాదు జిల్లాలలో సర్వహంగులూ గల సమాచార కేంద్రాలు నెలకొల్పబడ్డాయి.

# సంస్మరణము

బొగ్గువరపు వీరశేఖరశాస్త్రి

శ్రీకళాన్విత విరాజితదేహమె రథంబు
శశి సూర్యనాడులె చక్రయుగము.
సరస సహస్రార చక్రంబె ఛత్రంబు
నంతరంగ చతుష్టయంబె హరులు
జీవతత్వ మొందని జీవుండె సారథి
బ్రహ్మదండియె సచ్ఛరాసనంబు
వదనమందు వెడల్బు వాక్కులె బాణముల్
పంచవింశతి తత్వ ప్రతతె సేన
గాగ శాంతియుతాజిరంగమున నృపుల
గెలిచి భారత రాజ్యలక్ష్మిని గ్రహించి
ప్రజల కిహలోక సుఖముల ప్రబలజేసి
నేడు మనను బాసి పోతివా నెహ్రుదేవ. —

దేవ మానవ పరద్వర్ధ సహిత
ఉపకృతి నెంచి లోకోద్ధార మొనరింప
సుఖ జీవనముల నిచ్చు ఘను లనఁగ
కమలజ వంశ మిత్రములకు తమిదీర
వసువుల నొసగు లోకసఖు లనఁగ
పుణ్యజనాళి నెప్పుడు శిక్షితుల జేయు
దనరిన పూరుషోత్తము లనంగ
విబుధాళులకు మనోభీష్టార్థముల నెప్పు
డిచ్చుచుండెడి ధనాధీశు లనఁగ
దనరి నిశ్శేష లోకరాష్ట్రముల కొప్పు
శ్రుతివిహిత ధర్మ కర్మ పద్ధతుల గఱపి
జాతి మత భేద వాదముల్ సమయచేసి
నేడు దివి కేగితివ నీవు నెహ్రువర్య. —

ప్రాజ్ఞులం దతిభక్తి ప్రజలయం దనురక్తి
వర యహింసాసక్తి పదవు లెసఁగి
సార్థ్వమందు విరక్తి సత్యమందు ప్రసక్తి
సమతయందున రక్తి సరణు లలరి
పాండిత్యమున శక్తి భాషణంబున యుక్తి
బహుధర్మముల సక్తి బలము లెసఁగి
నృపకార్యముల నేర్పు నృపవాదముల తీర్పు
నుపకృతులం దోర్పు లుప్పతిల్లి
సకల దేశ మహీశ్వరుల్ సన్నుతింప
శ్రీలు విలసిల్లు ఢిల్లీపురి నివసించి
నీదు సత్కీర్తి జగతిపై నిండజేసి
నేడు దివికేగితివ నీవు నెహ్రుదేవ. —

ప్రజలను హింసించు పరమశివుడు కాదు
ప్రజలను పోషించు పరమ శివుడు
పరుల సంపద కాశపడునట్టి హరి కాదు
పరులకు సంపదన్ పఱపెడు హరి
ఒక్క భాషను బల్కుచుండు బ్రహ్మము కాదు
మెండు భాషలు పల్కుచుండు బ్రహ్మ
మన్యకాంతల గోరు నట్టి యింద్రుడు కాదు
అన్య కాంతల మాత లనెడి యింద్రు
డనఁగ దనరారి సుచరిత్ర లందు మీరి
సర్వ జాత్యైకమత్యమున్ స్థాయి చేసి
దేవదానవ వైరముల్ దీర్చ దివికి
నేడు బోతివ నెహ్రు పండిత వరేణ్యా. —

ధరణీ భరము నీవు దాల్చి యుండుటచేన
దిక్కరుల్ విహరింప తెఱపి కలిగె
లోకపాలన నీవు స్వీకరించుట చేత
హరి లక్ష్మితో నాట లాడదొడగె
నిత్యపూజలు నీవు నిర్వహించుటచేత
హరుడు భిక్షుకు పోక హాయి నుండె
బహుతటాకము లీవు ప్రబలజేయుట చేత
జలధరమునకు విశ్రాంతి గలిగె

నీదు మహితోపకృతులచే నిఖిల దేవ
మానవుల కెల్ల సుఖము లమర్చినట్టి
అమల గుణధుర్య నీకు జోహారు లివియె
గొనుము జవహరలాల్ నెహ్రూ కోవిదేంద్ర. ......

రత్న కిరీటహారములు దాల్చుట మాని
ప్రియ మెచ్చ నూలుటోపిని ధరించి
కనకాంబరంబుల గట్టుకొనుట మాని
కళకగు నూలుకోకల ధరించి
దారుణ హింసాయుధముల దాల్చుట మాని
భూతదయాయుధంబును ధరించి
యురముపై శ్రీదేవి నుంచుకొనుట మాని
రాజ్యలక్ష్మిని కరాగ్రమున దాల్చి

యవతరించిన శ్రీ విష్ణువనగ నీవు
శాంతి వాగ్యుద్ధమున నహింసాత్మకముగ
భూధవుల గెల్చి సమరాజ్యమును గ్రహించి
నేడు మా కిచ్చి పోషివా నెహ్రూ దేవ. —

మర్త్యలోకమునం దెల్లమానవులకు
వైరములు మాన్పి సరిచేయ వలలినట్లె
దేవలోకమునం దెల్ల దేవ దైత్య
సంఘములకు విరోధమున్ సమయచేసి
యద్దివమును స్వతంత్ర రాజ్యముగ మార్చి
మరల నవ్విష్ణుకళలతో మహిని బుట్టి
మా కొఱంతలు దీర్చుమో మాన్యచరిత
నిరుపమాత్రనెర కళాధుర్య —వరహుర్య.



# మళ్ళీ వసంతం

(ఒక విలేఖరి కథనం)

వెనకటికి బాగా పేరు మోసిన అమెరికా దేశపు రచయిత విలియం సరోయాన్ అనేఆయన బల్లముందు కూర్చుని ఏదో వ్రాసుకొంటూ వుండగా ఒకాయన 'మీరేమిటి వ్రాస్తున్నారు?' అని అడిగాడట. ఆ అమాయకమైన ప్రశ్నకు ఆయన ఆశ్చర్యపోయాడో ఏమో, తాను ఓ మనిషి కథ వ్రాస్తున్నానని సమాధానం చెప్పాడట. మొన్న నేను నాగార్జున సాగర్ వద్దనున్న కాందిశీకుల శిబిరాన్ని సందర్శించినప్పుడు సరిగ్గా యీ విషయమే నాకు గుర్తొచ్చింది. వాళ్ళను గురించి వ్రాయడం అంటే ఒక మనిషి కథను వ్రాయడమే. గాఢాంధకారం ఆవరించిన చీకటి జీవితాల్లోంచి అరుణారుణ కిరణ నవోదయంలోకి చూస్తోన్న వ్యక్తులు వారు

'కాందిశీకుడు' అన్నమాట చుట్టూ ఎప్పుడూ విషాదం గూడుకట్టుకునే వుంటుంది. 'నేను ఎటు వెళ్ళాలి' అని ఎలుగెత్తి అరిచే వ్యక్తి కాందిశీకుడు మరోరకంగా చెప్పాలంటే వెళ్ళడానికి దారుల్లేని వ్యక్తి అతను ప్రతి కాందిశీకుని కథా, అతను ప్రపంచంలోని ఏ దేశస్థుడైనా, అదో విషాద గీతిక. మధుర



"రేపు మనది"

స్మృతుల్ని తన వెనక దిగవిడిచి, గృహోన్వేషియై దూరదూర ప్రాంతాలకు పయనిస్తాడతను. మానవ సహనాన్ని గురించి చెప్పవలసివచ్చినప్పుడు ఆయన జీవితం ఒక మహాకావ్యం అవుతుంది. అతని ముందున్న బాట సుదీర్ఘమైనది. మార్గం ఎగుడు దిగుడులది. కాని అతని ఉత్సాహం వున్నదే, అది అవధుల్లేక పొంగిపొర్లే పారావార తరంగంలాంటిది.

బ్రహ్మాండమైన నాగార్జునసాగర్ ఆనకట్ట చల్లని నీడలో, పాకిస్తానునుంచి వచ్చిన 518 కాందిశీకుల కుటుంబాల వారికి పునరావాస సౌకర్యాలు కల్పించబడుతూవున్నాయి. ఏప్రిలులో కొంతమంది, మేలో కొంతమంది చొప్పున రెండు దఫాలుగా వారు వచ్చారు. మన రాష్ట్రంలో తూర్పు పాకిస్తాను కాందిశీకుల గురించిన ఏర్పాటుచేసిన మూడు స్థావరాల్లోనూ నాగార్జునసాగర్ స్థావరం మొదటిది. మరొక 193 కుటుంబాల వారికి ఆదిలాబాదు జిల్లాలోని బెల్లంపల్లి వద్దా, తర్వాత మరొక 275 కుటుంబాల వారికి నాగార్జునసాగర్ కాలువల పొడుగునా, మూసీ ఆనకట్ట దిగువనా నివాస సౌకర్యాలు కల్పించబడుతున్నాయి.

సర్వసౌకర్యాలు:

కొండదగ్గరున్న కాలనీకి రెండు మైళ్ళ దూరంలో అరవై ఎకరాల భూమిలో యీ కాందిశీకుల శిబిరం విస్తరించి వుంది. ఒకానొక పద్ధతి ప్రకారం యిక్కడ పకగది గృహాల్ని నిర్మిస్తారు. ధారాళమైన చక్కటి గాలీ, స్వాభావికమైన వెలుతురూ యిక్కడ లభిస్తాయి. ఇతర నివాస ప్రాంతాలకన్న కాందిశీకుల శిబిరానికే ఎక్కువ నీటిని రాష్ట్రప్రభుత్వం సరఫరా చేస్తోంది. రాష్ట్రప్రభుత్వం కాందిశీకుల సంక్షేమం విషయంలో అత్యంత శ్రద్ధ తీసుకుంటున్నదనడానికి ఇదే ఒక చక్కటి నిదర్శనం. ప్రతి యింట్లో విద్యుద్దీపాల కాంతులు మిరుమిట్లు కొలుపుతున్నాయి.



"రేడియోయే వారికి మిత్రుడు"

రాగానే కాందిశీకు లందరికీ టీకాలు వేసేశారు. వాళ్ళ రక్తాన్ని తీసి పరీక్షించారు. ఆ శిబిరంలో ఒక చిన్న వైద్యశాల వుంది. అందులో ఒక డాక్టరూ, ఒక కాంపౌండరూ వున్నారు. కాందిశీకులకు కావలసిన వైద్య సహాయాన్నంతా వాళ్ళు యిస్తారు. మేము శిబిరాన్ని సందర్శిస్తూండగా ఒక అంబులెన్సు కారు సుంచి వేగంతో వెళ్ళిపోతూ కనిపించింది. కొండ దగ్గర్లోని కాలనీ హాస్పిటల్లో ఒక ప్రసూతి కేసును చేర్చడానికని ఆ అంబులెన్సు వెళ్తున్నట్టు ఎవరో చెప్పారు.

శిబిరానికి ఒకవంద గజాల దూరంలోనే బజారు వుంది. అక్కడి ప్రభుత్వ సేవకుల సహకార సంఘంనుండి కాందిశీకులు తమకు కావలసిన గోధుమల్ని, బియ్యాన్ని సరసమైన ధరలకు కొనుక్కొంటున్నారు. అక్కడ స్థానికంగా వుంటున్న బెంగాలీ కాందిశీకుల మీద



"రాగోదయం, బాలానందం"

జాలి, సానుభూతి వున్నాయి కాంద శీకులు అక్కడికి రావడంతోనే అక్కడి ప్రజలంతా విరాళాలు వేసుకొని బియ్యం కొని, ప్రతి కుటుంబానికీ కొద్దికొద్దిగా యిచ్చుకుంటూ వచ్చారు. వండుకోవడానికి కావలసిన కుండలు మొదలయినవి కూడా యిచ్చారు.

మేం వెళ్ళిన రోజున శిబిరంలో ఒక ముఖ్యమైన సంఘటన మా కళ్ళ బడింది. 'అక్షరాభ్యాసం' నిమిత్తం పిల్లలంతా సమాజ కేంద్రంలో గుమిగూడారు నాగార్జునసాగర్‌లో ఒక సరికొత్త జీవితానికి వాళ్ళు ప్రస్తావన పలుకుతున్నారా అనిపించింది. పిల్లలందరికీ పలకలు పంచి పెట్టారట. వాళ్ళు ఆ పలకల మీద బెంగాలీ అక్షరాల్ని వ్రాస్తూ వుంటే చూడముచ్చటగా వుంది

కొంతమంది కాందిశీకులు తాపీపని చేద్దామనుకొంటున్నారు. మరికొంత మంది వండ్రంగం చేపట్టాలని భావిస్తున్నారు. ఇంకొంతమంది బళ్ళు తోలుకుందామని అభిలషిస్తున్నారు. ప్రభుత్వమే గాని భూముల్ని యిస్తే, సేద్యం చేసుకుందామని మరికొంత మంది అనుకుంటున్నారు పోతే యిః మిగిలిన వాళ్ళని రాళ్ళు పగలగొట్టడానికీ, యిసుక లారీల కెత్తడానికీ, యీవిధమైన

కాయకష్టంచేసే పనులకు వుపయోగించుకోవచ్చు.

రోబీదానును చూడండి. ఆయనకు ముప్పయి తొమ్మిదేళ్ళుంటాయి. మేము ఆయన్ను కలిసేసరికి ఆయన ఒంటిమీద చొక్కా-అన్నా లేకుండా లుంగీతో వున్నాడు. డక్కా జిల్లాలోని సున్నా గ్రామంనుంచి వచ్చాడట అతను. ఆయన అక్కడ వడ్రంగి. ఇప్పుడాయన తన యింట్లోవున్న అయిదు పొట్టల్నీ నింపడానికి వడ్రంగంవృత్తి చేద్దామనుకుంటున్నాడు.

సుశీల్‌కుమార్ మండల్‌కు ముప్పయారేళ్ళు. ఆయన అక్కడ ఖుల్నా జిల్లా రాజపూర్‌లో ఉపాధ్యాయుడుగా వుండేవాడు. ఈనాడు పిల్లల చదువుకు ఏదోకొంత చేద్దామన్న అభిలాష ఆయనలో కనిపిస్తోంది. ఆ ఉత్సాహం ఆయనలో పొర్లి ప్రవహిస్తోంది. మమ్మల్ని శిబిరం అంతా తిప్పుతోంటే అతని ఉత్సాహం ఉరకలూ, పరుగులూ ఎత్తి పొర్లి ప్రవహించి, గంతులు వేశాడు.

తపాలా బంట్రోతుగా పనిచేసిన ముప్పయేళ్ళ రామ్‌గోవింద్ అధికారిగాని, ఖుల్నా జిల్లా ధన్‌హడ్ వూళ్ళో ఓ మాదిరి దుకాణం నడుపుకొన్న ముప్పయేడేళ్ళ మహాదేవరాయ్‌గాని, ఖుల్నా జిల్లా గోవిందకటి గ్రామస్థుడు డెబ్భయ్యేళ్ళ ఓందుముసలి హరిపాదరాయ్‌గాని ఎవరయినా వారందరి నిశ్చయమూ ఒకటే—మళ్ళీ సరికొత్తగా జీవితాన్ని ప్రారంభించాలని.

శరణార్థులు తమంతట తామే జీవన భృతిని వెతుక్కోవడానికివీలుగా ప్రస్తుతం వారికి యిస్తోన్న బియ్యం మొదలయిన వాటిని క్రమ క్రమంగా తగ్గిస్తున్నారు.



**పరిస్థితులతో రాజీ**

ఎక్కడికక్కడ పరిస్థితులకు అతుక్కుపోవడమనేది జీవితానికి యిచ్చే మరో నిర్వచనం. ప్రొద్దున్నే పదిగంటల వేళ ఎవరన్నా ఆ శిబిరం వైపుగా వెళ్తే వాళ్ళకు అక్కడ, ప్రతి కుటుంబమూ తను తను దినచర్యల్లో మునిగిపోయి గతాన్ని మర్చిపోవడానికి ప్రయత్నిస్తున్నట్టు గోచరిస్తుంది. బిడ్డకు పాలు కుడుపుతోన్న తల్లి, స్నానంచేసిన భర్తకు తువ్వాలు అందిస్తోన్న భార్య, వంట వండుతోన్న యింటి కోడలు—చూడదగ్గ చక్కటి దృశ్యాలివి నిశ్శబ్దమైన వాళ్ళ కదలికలను చూస్తూవుంటే తాత్కాలికంగా ఎదురయిన ఎత్తుపల్లాలతో ప్రమేయంలేకుండా, జీవితం ఒక నదిలా ప్రశాంతంగా సాగిపోతోందన్న విషయాన్ని వారు వ్యక్తం చేస్తున్నారా అనిపిస్తోంది

ప్రస్తుతం రేడియోయే కాందిశీకులకు 'స్నేహితుడు' ఈ విశాలమైన ప్రపంచములో ఏమూల ఏం జరుగుతుందో ఆ సమాజ కేంద్రంలోని రేడియో ద్వారా వింటామని వాళ్ళు ఉత్సాహపడుతున్నారు. బెంగాలీ సంగీతం కూడా వినిపిస్తూవుంటుంది. ఆ సంగీతంలో అక్కడక్కడ యింటిమీద ధ్యాసకూడా లీలగా ధ్వనిస్తూవుంటుంది. కొంతమంది వార్తాపత్రికల్ని చదవడానికి అలవాటు

పడ్డారు కాని ప్రస్తుతం బెంగాలీ పత్రిక లేమీ అక్కడకు వెళ్ళడంలేదు.

ముందు ముందు వీరు యిక్కడ స్థానిక ప్రజలతో ఎలా కలిసిపోతారో ఊహించుకుంటే, చాలా సరదాగా అనిపిస్తుంది మనకు. మరోతరం పోతే యీ అధికారీలు, రాయ్‌లు, మండలులు తెలుగే ప్రధాన భాషగా మాట్లాడుతూ కనిపిస్తారు. భవిష్యత్తును వెతుక్కుంటూ ఎలా వర్తమానాన్ని విడిచి వచ్చారో ఆ గతాన్నంతా ఉత్సాహంతో మననం చేసుకుంటారు.

ఒక్కొక్కప్పుడు అతికష్టంగా, మరొకప్పుడు తేలిగ్గా, ఇంకొకప్పుడు విషాదంగా చరిత్రగతిలో సమస్యలు పరిష్కారం కావడం అతివిచిత్రం అనిపిస్తూవుంటుంది. శబ్దాడంబరంతో చేసే నినాదాలకన్న ఈ



......ఒకే నిశ్చయం......

చిన్న విషయమే- కాందిశీకులపై ఆదరణే- ఎంతగానో జాతీయసమైక్యతకు కారణభూత మవుతుంది.

కాందిశీకులకు నాగార్జునసాగర్ ఒక సరికొత్త జీవగడ్డ అక్కడే వాళ్ళ జీవితాల్లో 'మళ్ళీ వసంతం' వెల్లివిరుస్తుంది.

తిరిగి వస్తోంటే రోడ్డుమీద స్వేచ్ఛగా ఆడుకుంటున్న చంటిపిల్లలు కనిపించారు మాకు తెల్లగా రాలుతోన్న సూర్యకాంతి, ఆ కింద ఆడుకుంటున్న పిల్లలు, దూరంగా బేక్‌గ్రౌండ్‌లో గాలిలో మెలికలు తిరుగుతోన్న శ్రావ్యమైన బెంగాలీ లలిత సంగీతం-నిజంగా అదొక శిబిరం మాత్రమే కాదు, రేఖలు విచ్చుకొంటోన్న మానవ జీవత కథాకుసుమం రూపులు దిద్దుకొంటోన్న స్థలంకూడా.

---

(86 వ పేజీ తరువాయి)

మద్రాసు, శ్రీ ఎస్. ఎస్. కార్డ్‌మాస్టర్, ఆంధ్రప్రదేశ్ వాణిజ్య పరిశ్రమల సమాఖ్య, సికింద్రాబాదు, (సభ్యులు).

ఉద్యోగుల ప్రతినిధులు : శ్రీ ఎం. గోవిందాచారి, హింద్ మజ్దూర్ సంఘం, శ్రీ ఎన్. సత్యనారాయణరెడ్డి, ఆంధ్రప్రదేశ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, శ్రీ ఎం. నవాజ్‌ఖాన్, కార్యదర్శి, భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు (సభ్యులు)

సంఘం ప్రధాన కార్యస్థానం హైద్రాబాదులో వుంటుంది.

## శ్రీ భద్రాచల సీతారామాలయ ఉద్ధరణ సంఘం

దేవదాయ, ధర్మాదాయ (ఏ) శాఖ కమీషనరును ప్రభుత్వం "శ్రీ భద్రాచల సీతారామాలయ ఉద్ధరణ సంఘం" కార్యదర్శి - కోశాధికారిగా నియమించింది.

## వార్థక్యపు పించన్ల పథకం

వార్థక్యపు పించన్లను మంజూరు చేసే నిమిత్తం రాష్ట్రంలోని జిల్లా కలెక్టర్లకు వర్తమాన సంవత్సరంలో అదనంగా రూ. 15,61,000 లు లభింపజేయడానికి ప్రభుత్వం ఆదేశించింది. కేటాయింపు వివరాలు దిగువ పేర్కొనబడినవి: ఆదిలాబాదు, రూ. 43,000; అనంతపురం, రూ. 78,000; చిత్తూరు: రూ. 82,000; కడప. రూ 56,000; తూర్పుగోదావరి. రూ. 1,13,000; గుంటూరు: రూ. 1,13,000; హైద్రాబాదు: రూ. 91,000; కరీంనగర్: రూ. 71,000; ఖమ్మం: రూ. 48,000; కృష్ణా: రూ. 91,000; కర్నూలు: రూ. 82,000; మహబూబ్‌నగర్ రూ. 71,000; మెదక్: రూ. 52,000; నల్గొండ: రూ. 71,000; నెల్లూరు: రూ. 87,000; నిజామాబాదు: రూ. 43,000; శ్రీకాకుళం: రూ.1,00,000; విశాఖపట్నం: రూ. 1,00,000; వరంగల్: రూ. 65,000; పశ్చిమ గోదావరి: రూ. 87,000.

మిగతా రూ. 4,97,100/-ల మొత్తాన్ని రిజర్వులో వుంచి దరిమిలా ఇతోధికంగా మొత్తాలు అవసరమైన జిల్లాలకు కేటాయిస్తారు.

## ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ మండలి

ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ మండలి సభ్యులుగా ఈ దిగువ పేర్కొన్నవారిని రాష్ట్ర ప్రభుత్వం 1964 జూన్ మొదటి తేదీనుంచి నియమించింది. శ్రీ కె. వి. నారాయణరెడ్డి, ఎం. ఎల్. ఏ ; శ్రీ జలగం వెంగళరావు, ఎం. ఎల్. ఏ. ఖమ్మం జిల్లా పరిషత్తు అధ్యక్షుడు; శ్రీ సి. హెచ్. వి. మూర్తిరాజు, ఎం. ఏల్. ఏ. ; శ్రీ ముప్పన రామారావు, పెద్దాపురం మునిసిపల్ అధ్యక్షుడు, తూర్పు గోదావరి జిల్లా; శ్రీ హాజీ మహమ్మద్ రహమతుల్లా, కడప మునిసిపల్ అధ్యక్షుడు; మునిసిపల్ వ్యవహారాల శాఖ డైరెక్టరు; టౌన్ ప్లానింగ్ డైరెక్టరు; చీఫ్ ఇంజనీరు, (భవనాలు, ప్రజారోగ్యం, హైద్రాబాదు.)

## ఉపాధ్యక్షుని నియామకం

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం తొలి ఉపాధ్యక్షుడుగా శ్రీ ఓ. పుల్లారెడ్డి, ఐ. సి ఎస్ (రిటైర్డ్)ను ఆంధ్రప్రదేశ్ గవర్నరు - ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం అధ్యక్షుడుగా నియమించారు. శ్రీ పుల్లారెడ్డి, చార్జి పుచ్చుకున్న తేదీనుంచి మూడు సంవత్సరాల వరకు ఈ పదవిలో వుంటారు.

# దేశ రక్షణ



# దేశాభివృద్ధి



# రెండూ రెండు ముఖ్యాంగాలు

దేశరక్షణకు అవసరమైన పరికరాల ఉత్పత్తికే తన సమస్త శక్తిని కేంద్రీకరిస్తున్న ఉక్కు పరిశ్రమ మిల్లుల ఉత్పత్తి కార్యక్రమాన్ని తదనుగుణంగా సవరించుకొన్నది. సాయుధబలాలు ఉపయోగించే మోటారు శకటాల ప్రమాణాలు స్థిరీకరించబడినవి. ఇంజనీరింగ్ పరిశ్రమ ఉత్పత్తి శక్తి ఇనుమడించబడింది. విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాలు పని త్వరితంగా ప్రారంభించడానికి వేగిరంగా చర్యలు గైకొనబడుతున్నవి. అత్యవసర పరిస్థితిని తట్టుకోడానికై జెనరేటింగ్ సెట్ల పూల్ ఏర్పాటుచేయబడుతున్నది. రైల్వే వర్క్‌షాపుల నుంచి ఎక్కువగా వాగన్లు ఉత్పత్తి అయి వెంటనే వినియోగానికి పంపబడుతున్నవి. రోడ్లు ఆధునాతన మార్గాలుగా మార్చబడుతున్నవి.

**దేశరక్షణ శక్తిని ఇనుమడింపచేయడానికి అవసరమైనవాటికే ప్రాధాన్యమివ్వబడుతున్నవి.**

**మనస్సా, వాచా, కర్మణా ఈ కృషికి మీరు తోడ్పడండి.**



ప్రణాళికలతో ముందుకు సాగిపోదాము

## దేశరక్షణ కృషికి ఇతోధికముగా తోడ్పడండి

DA 63/444

# సంగ్రహ ప్రకటనలు

భారత ప్రభుత్వం 1963 జనవరిలో జారీచేసిన బంగారు కంట్రోలు ఉత్తర్వు కారణంగా అనేక మంది స్వర్ణకారులు ఉపాధి కోల్పోయారు. 14 క్యారట్లకు మించిన బంగారు వస్తువుల తయారీ అమ్మకంపై నిషేధం వచ్చింది. ఆతర్వాత భారత ప్రభుత్వం 14 క్యారట్లకు మించిన బంగారు వస్తువుల తయారీలో యీ ఉత్తర్వు నియమాలను కొంతవరకు సవరించింది. తమ పాత వృత్తినే కొనసాగించుకుంటున్న స్వర్ణకారులు 1962 సం. పు. భారత ప్రభుత్వపు రక్షణ నిబంధనలలోని 126 హెచ్. హెచ్. నిబంధన ప్రకారం లైసెన్సు పొందవలెనని తెలియజేసింది.

బంగారం కంట్రోలు ఉత్తర్వు కారణంగా బాగా దెబ్బ తిన్న స్వర్ణకారులకు ఉపాధి కల్పించేనిమిత్తం భారత ప్రభుత్వం తనకు వీలైనంతమట్టుకు అలాంటి స్వర్ణకారులకు ఇతర విధాలుగా వివిధ సౌకర్యాలను–వారి పిల్లలకు ఉచిత విద్యా సౌకర్యాలను కల్పించడం, ఇతర వృత్తుల్లో స్థిరపడడానికి ఆర్థిక సహాయాన్నివ్వడం మొదలైనవాటిని కల్పిస్తున్నది

గత ఏడాది భారత ప్రభుత్వం రూ. 30 లక్షలను కేటాయించింది. ఈ ధనాన్ని ఆంధ్రప్రదేశ్ అంతటా విస్తరించివున్న ఉపాధి కోల్పోయిన స్వర్ణకారులకు–జిల్లాలలోని వారికి జిల్లా పరిషత్తులద్వారానూ, జంటనగరాలలోనివారికి పరిశ్రమల, వాణిజ్య శాఖ డైరెక్టరు ద్వారానూ పంచడం జరిగింది.

ఈ పనిని నిర్వహించడానికి గాను ప్రభుత్వం జి. దస్తగిరి, ఖరేషి, ఐ. ఎ. ఎస్.ను అదనపు డైరెక్టరు, ప్రభుత్వ ఉపకార్యదర్శిగా నియమించింది. స్వర్ణకారులకు పునరావాసం కల్పించే నిమిత్తం, వివిధ పథకాలను ప్రారంభించే నిమిత్తం తొలిదశగా రూ. 30లక్షలను మంజూరు చేసింది. మిగతా మొత్తంకూడా ఆతర్వాత మంజూరు చేయబడుతుంది. తగిన స్వర్ణకారులకు ప్రత్యామ్నాయ వృత్తులలో పునరావాసం కల్పించే వివిధ పథకాలను రాష్ట్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

భారత ప్రభుత్వం రక్షణ నిబంధనలలోని 126 హెచ్ హెచ్ నిబంధనక్రింద లైసెన్సు పొందిన స్వర్ణకారులుకూడా తమ పాత వృత్తిని విడిచిపెట్టి పునరావాస సౌకర్యాన్ని కల్పించ వలసిందిగా దరఖాస్తు చేసుకోవచ్చును. అట్టివారు పునరావాస సౌకర్యం పొందిన మూడు నెలలలోగా తమ లైసెన్సును తిరిగి సమర్పించవలసి ఉంటుంది. ధృవీకరించబడిన స్వర్ణకారులు పునరావాస సౌకర్యం పొందిన తర్వాత కూడా తమపాత వృత్తిలోనే స్థిరపడదలచినచో, అట్టివారు వారికి పునరావాస సౌకర్యం క్రింద ఇవ్వబడిన ఋణమొత్తాన్ని వెంటనే ప్రభుత్వానికి తిరిగి చెల్లించవలసి ఉంటుంది.

## మంచిగంధం, రక్తచందనం

మైసూరు, మద్రాసు అడవులలోనూ ఆంధ్రప్రదేశ్‌లో కొంత భాగంలోనూ ఉన్న వృక్షాలలో మంచిగంధంచెట్లు అతివిలువైనవి. సుగంధానికి పేరెన్నికగాంచిన యీ చెట్లకలపకు మన దేశంలోనూ, విదేశాలలోనూ కూడా మంచిగిరాకీ ఉన్నది. ఐతే ఇటీవలనే అంతరరాష్ట్రీయ దొంగ రవాణా దారుల ముఠా ఒకటి పైనచెప్పిన మూడు రాష్ట్రాలనుండీ మంచిగంధం కలపను ఉత్తర భారతదేశంలోని నగరాలకు దొంగతనంగా రవాణా చేస్తున్నట్లు కనుగొనబడింది. ఈ విషయాన్ని అనేక సంఘటనలు విశదపరిచాయి. అందువల్లనే మైసూరు, మద్రాసు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల ప్రభుత్వాలకు యీ మంచిగంధపు వృక్షాలను రక్షించడానికై సత్వర చర్యలను గైకొనడం ఆవశ్యకమైంది.

మంచిగంధపు కలప దొంగ రవాణాను అరికట్టడానికై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రస్తుతం అమలులోవున్న 1882 ఆంధ్రప్రదేశ్ అడవుల చట్టానికి కొన్ని సవరణలను ప్రతిపాదించింది. ఆంధ్రప్రదేశ్ అడవుల సెక్షన్ 36 (a) నుండి 36 (d) వరకువున్న నిబంధనల ప్రకారం ఏ వ్యక్తిఅయినా జిల్లా అటవీశాఖాధికారి అనుమతి మంజూరుచేస్తే తప్ప, 5 కిలోగ్రాములకు మించిన మంచిగంధపు కలపను తనవద్ద ఉంచుకొనడం నిషేధింపబడింది. ఈ చట్టం సవరణ ఆంధ్ర

ప్రదేశ్ గెజెట్‌లో ప్రకటించబడిన నాటి నుండీ అంటే 3-5-1963నుండి అమలు లోనికి వచ్చింది. 1964 ఏప్రిల్ 22వ. తేదీ నాటి గెజిట్‌లో మంచిగంధపు డీలర్లు, స్టాకిస్టులు రు 100లను రుసుముగా చెల్లించి లైసెన్సు పొందాలని ప్రభుత్వం ప్రకటించింది ఈ లైసెన్సులను, జిల్లా అటవీ శాఖాధికారినుండి పొందవలసి ఉంటుంది. చిర్ధాల నిర్వహణ, అటవీశాఖకు చెందిన అధికారులచే నిల్వల పరిశీలన మొదలైనవన్నీ కూడా నిర్ణయింపబడ్డాయి.

ఈ చట్టంలోని ఏ నిబంధనయైనా ఉల్లంఘించినవారు శిక్షార్హులు. అట్టివారికి 3 నెలలకు తక్కువ కాకుండా ఒక సంవత్సరానికి లోపు జైలుశిక్ష, రూ. 10,000ల మేరకు జరిమానా విధించబడతాయి.

ఈ మంచిగంధపు కలపవలెనే రక్తచందనం కలపకూడా అతిముఖ్యమైనది. ఇది ఆంధ్రప్రదేశ్‌లోని కడప, చిత్తూరు జిల్లాలలో ఎక్కువగా లభ్యమవుతున్నది. దీనికి కూడా మంచి ఎగుమతి మార్కెట్టుఉన్నది రక్తచందనం దొంగ రవాణాను అరికట్టదానికై రాష్ట్రప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ అడవులచట్టం క్రింద 1957లో రక్తచందనం రవాణా నియమావళిని ఏర్పరచింది ఈ నిబంధనల ప్రకారం తమ పట్టాభూములలో వున్న రక్తచందనపు కలపనైనా సరే అమ్మడానికిగాని ఎగుమతి చేయడానికిగాని అభిలషించేవారు తమకు సమీపంలో వున్న జిల్లా అటవీశాఖాధికారికి తాము అమ్మదలచుకొన్న రక్తచందనం వృక్షాల సంఖ్యను నివేదించడం, ప్రోపర్టీ మార్కు రిజిస్టరు చేయించుకొనడం, జిల్లా అటవీశాఖాధికారిచే తాము అమ్మిన కలపను గుర్తు పెట్టించుకొనడం వంటి పనులన్నీ పూర్తిచేసి, అమ్మడానికీ ఎగుమతి చేయడానికీ జిల్లా అటవీ శాఖాధికారి నుండి ఎగుమతి పర్మిట్ లభించిన వెనుకనే ఎగుమతి చేయవలసి ఉంటుంది

ఒకవేళ ఎవరైనా రక్తచందనం కలపను ఇండియాలోని రేవు పట్టణాలనుండి విదేశాలకు ఎగుమతి చేయదలచుకుంటే ఎగుమతి పర్మిట్లనూ, కలప వుత్పత్తిని గురించి ధృవపత్రాలనూ జతపరిచి హైద్రాబాదులోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వపు అడవుల చీఫ్‌కన్సర్వేటర్‌కు అనుమతి నిమిత్తం దరఖాస్తు చేయాలి. అడవుల చీఫ్ కన్సర్వేటర్ చేత ఆ రేవు ప్రాంతానికి పంపబడిన అధికారి ఆ కలపపై ఆమోదముద్ర (ఎగుమతి పాస్ గుర్తులు) వేసిన తర్వాతనే ఎగుమతి చేయవలసి ఉంటుంది.

## జిల్లా జనాభా లెక్కల పుస్తకాల అమ్మకం

జనాభా లెక్కల శాఖవారు 1961 లో ప్రచురించిన పుస్తకాల్లో ముఖ్యంగా చెప్పుకోదగ్గది జిల్లా జనాభా లెక్కల పుస్తకం. ఆంధ్రప్రదేశ్ జనాభా లెక్కల నిర్వహణ సూపరెంటెండెంట్ ప్రతి జిల్లాకు ప్రత్యేకంగా ఒకొక్క పుస్తకం చొప్పున రూపొందించిన యీ పుస్తకాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురిస్తున్నది.

జిల్లా పరిపాలనకు సంబంధించిన పట్టీలు జనాభా లెక్కలకు సంబంధించిన అంకెలతో కూడిన పట్టీలు మొదలయినవాటితో పాటు ప్రతి జిల్లా సమగ్ర స్వరూపాన్ని యీ జిల్లా జనాభా లెక్కల పుస్తకాలు మన కళ్ళకు కట్టినట్టు చూపిస్తాయి. ఈ పుస్తకాలు 1951 జనాభా లెక్కల సమయంలో ప్రారంభించబడిన ఒక నూతన పోకడ. ఇప్పటి పుస్తకాలు 1961 జనాభాలెక్కలతో, లోగడకన్న మరింత చక్కగా రూపొందించబడ్డాయి.

ఈ పుస్తకాల తొలి భాగంలో జిల్లా భౌతిక స్వరూపం, దాని చరిత్ర, ప్రజల సాంఘిక, ఆర్థిక స్థితిగతులు, గతంలోకన్న యీనాడు ప్రతి రంగంలోనూ జిల్లా సాధిస్తున్న ప్రగతి మొదలయిన విషయాలు కథా కథన పద్ధతిలో వివరించబడ్డాయి. వీటితోపాటు అనుబంధంగా ముఖ్యమైన స్థలాలు, యించుమించు అన్ని రంగాల్లోనూ పరిపాలనకు సంబంధించిన గణాంక వివరాలు చేర్చడం జరిగింది. రెండవ భాగంలో (i) జనసంఖ్య, స్త్రీ-పురుషుల నిష్పత్తి, ఆర్థిక స్వరూపం, అక్షరాస్యత, భాష, వలస-తాలూకాస్థాయిలో-వీటికి సంబంధించిన వివరాల సంఖ్యలను తెలియజేసే పట్టికలు, (ii) గ్రామాల వారీగా, పట్టణాల వారీగా వాటిలోని విస్తీర్ణం, గృహాలు, జనసంఖ్య, షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులు, అక్షరాస్యులు, విడివిడిగా విభజింపబడిన ఆయా పనివారు, కార్మికులు కానివారు — యీ వివరాలతో కూడిన విడివిడిగా గ్రామదర్శిని, పట్టణ దర్శినిలు యీ గ్రంథంలో చేర్చబడివున్నాయి. గ్రామ, నగర దర్శినిల్లో ప్రతి గ్రామంలోగల విద్య, వైద్య, రవాణా సౌకర్యాలు వంటి ప్రాథమిక సౌకర్యాలు, భూమి ధర, పండించే పంటలు, చేతిపనులు, మొదలయిన వివరాల పట్టీలు; గ్రామం, పట్టణంలోని సహకార సంఘాలు, జిల్లాల్లో జరిగే సంతలు, తీర్థాలు మొదలయినవికూడా చివర్లో యివ్వడం జరిగింది. ఈ పుస్తకంలో రెండు జిల్లా మేప్‌లు వున్నాయి. ఒకటి పరిపాలనా విభాగాలు చూపిస్తుంది, మరొకటి ప్రజల సాంద్రత మొదలయిన విషయాలను వ్యక్తంచేస్తుంది. అంతేకాక గ్రామాలు, అవివున్న స్థలాలు,

వాటి సరిహద్దులతో కూడిన తాలూకా మేప్‌లుకూడా వున్నాయి.

కడప, అనంతపురం జిల్లాల జనాభా లెక్కల పుస్తకాలు ప్రచురణ పూర్తయి అమ్మకానికి సిద్ధంగా వున్నాయి. చీగంపేట లోని రాష్ట్ర ప్రచురణల శాఖ వద్దనుండి వాటిని పొందవచ్చు. ఇతర జిల్లాల పుస్తకాలు త్వరలోనే మరికొన్ని నెలలలో అమ్మకానికి సిద్ధంగా వుంటాయి. కడప జిల్లా పుస్తకం 619 పుటలు. అనంతపురం జిల్లా పుస్తకం 733 పుటలు వున్నాయి. ఈ పుస్తకాలకు గట్టి బౌండు చేయబడింది. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ. పంచాయతీ రాజ్ స్థాపనానంతరం తొలిజనాభా లెక్కల్లో వ్యక్తమయిన అభిరుచుల దృష్ట్యా సాధ్యమైనంత తక్కువ ఖరీదుకు యీ పుస్తకాలను రూపొందించాలని ప్రభుత్వం తలంచింది. కడప పుస్తకం ఖరీదు రూ 9 35 న పైసలు. అనంతపురం పుస్తకం ఖరీదు రూ 10.80 న. పై.

ఈ కాపీలు కావాలనుకున్న వ్యక్తులూ, సంస్థలూ "ముద్రణ, ప్రచురణల శాఖ డైరెక్టరు, చీగంపేట, హైదరాబాదు - 16" వద్దనుండిగాని. వారివద్దనుండి అమ్మకపు అధికారాన్ని పొందిన ప్రాంతీయ ఏజెంటు వద్దనుండిగాని వ్రాసి తెప్పించుకో వచ్చును.

## వేటపై నిషిద్ధం - అధికార్లకు హెచ్చరిక

బయటి అడవుల్లో వేట నియమాలను పూర్తిగా పాటించాలని, వేట నిషేధింపబడిన ప్రాంతాలలో - అడవుల్లోని రక్షిత స్థావరాల్లో అయినా, లేక బయటయినా అది నిషేధింపబడిన ప్రాంతాలలో - పూర్తిగా ఆ నిషేధాన్ని గౌరవించాలని 1962 లో ప్రభుత్వం అధికార్లను ఆదేశించింది. ఏ అధికారయినా యీ నియమాలను ఉల్లంఘించినట్టుగా అతనిపై ఫిర్యాదులు వస్తే చాలా తీవ్ర విషయంగా దాన్ని భావించడం జరుగుతుందనీ, అందుకు బాధ్యులయిన అధికారులను తీవ్రంగా దండించడం జరుగుతుందనీ వారికి తెలియజేయబడింది.

ఈ విషయంలో కొంతమంది ప్రభుత్వ అధికారులపై ఫిర్యాదులు వస్తున్నాయి. అందుచేత యింతకు పూర్వం వ్యక్తంచేసిన నిబంధనలను పూర్తిగా పాటించాలనీ, అధికారులమీద యీ విషయమై వచ్చే ఫిర్యాదులపై తీవ్రచర్యలు తీసుకోవడం జరుగుతుందనీ మరొకసారి ప్రభుత్వం అధికార్లకు నొక్కి చెప్పింది.

## సిమెంటు పరిశ్రమ

ప్రభుత్వం ఈ దిగువ సభ్యులతో సిమెంటు పరిశ్రమపై రాష్ట్ర సంయుక్త స్థాయీ సంఘా న్నొకదానిని ఏర్పాటు చేసింది.

సభ్యులు :- ఫ్యాక్టరీల చీఫ్ ఇనస్పెక్టరు, హైదరాబాదు (అధ్యక్షుడు), ఫ్యాక్టరీల డిప్యూటీ చీఫ్ ఇనస్పెక్టరు, హైదరాబాదు (సభ్యుడు)

యజమానుల ప్రతినిధులు (అనధికారులు): శ్రీ ఆర్. ఎన్. జై, మేనేజర్ (మంగళగిరిలోని అసోసియేటెడ్ సిమెంటు కంపెనీ లిమిటెడ్ ప్రతినిధి); శ్రీ డి. ఎస్. దత్, డిప్యూటీ ప్లాంట్ మేనేజర్ (విజయవాడలోని ఆంధ్ర సిమెంటు కంపెనీ లిమిటెడ్ ప్రతినిధి); శ్రీ వై. ప్రభాకర రెడ్డి, కార్యదర్శి (బేతంచెర్లలోని పాణ్యం సిమెంటుకంపెనీ లిమిటెడ్ ప్రతినిధి)-వీరు సభ్యులు.

ఉద్యోగుల ప్రతినిధులు (అనధికార్లు). శ్రీ జి. సంజీవ రెడ్డి ఎం. ఎల్. ఏ: (ఏ సి సి. సిమెంట్స్ పనివారల సంఘం ప్రతినిధి, మంచిర్యాల (ఐ. ఎన్. టి. యు. సి); శ్రీ ఎన్. వి. రంగారావు (కృష్ణా సిమెంట్స్ పనివారల సంఘం ప్రతినిధి (ఏ. ఐ. టి. యు. సి) విజయవాడ; శ్రీ ఏ. ఎస్. ఆర్. కృష్ణదాస్ (రామకృష్ణా సిమెంట్స్ ఉద్యోగుల సంఘం ప్రతినిధి, మాచర్ల, గుంటూరుజిల్లా (సభ్యులు).

గుంటూరులోని ఫ్యాక్టరీలశాఖ ప్రాంతీయ ఇనస్పెక్టరు ఈ సంఘం సభ్యుడు - కార్యదర్శిగా వ్యవహరిస్తారు

రాష్ట్ర సంయుక్త స్థాయీ సంఘం, కేంద్రసంయుక్త స్థాయీ సంఘం కోరిన విధంగా ప్రమాదాలు, సంక్షేమ సౌకర్యాలు మొదలైన వాటికి సంబంధించిన భోగట్టా సేకరిస్తుంది. సిమెంటు ఫ్యాక్టరీలలో ఒప్పందాల పాటింపు విషయాలను పర్యవేక్షిస్తుంది. సంఘం ప్రధాన కార్యస్థానం గుంటూరులో వుంటుంది. దీని అధికార పరిధి రాష్ట్రమంతటికీ విస్తరించి వుంటుంది.

## ఆంధ్రప్రదేశ్ భవనాల కంట్రోలు చట్టం

1960వ సం. పు ఆంధ్రప్రదేశ్ భవనాల (కౌలు, అద్దె, ఖాళీ) కంట్రోలు చట్టంక్రింద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. ఈ చట్టం 3 వ సెక్షన్‌లోని 1వ ఉపసెక్షన్ మేరకు హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలోని భవనాల విషయంలో అధికారం పొందిన ఆఫీసరును కంట్రోలరు బాధ్యతలు నిర్వహించ డానికి నియమించింది.

## కార్మిక పరిస్థితి సమీక్ష

రాష్ట్రంలో మధ్యమధ్య కార్మికపరిస్థితిని పర్యవేక్షిస్తూ, సమీక్షించడానికిగాను దిగువ పేర్కొన్న సభ్యులతో ఒక ఉన్నత స్థాయి సంఘాన్ని నియమించడానికి ప్రభుత్వం ఆదేశించింది:-

కార్మిక, రవాణాశాఖల మంత్రి (అధ్యక్షుడు)

ప్రభుత్వ ప్రతినిధులు :- పరిశ్రమల శాఖ రెండవ కార్యదర్శి, ప్రత్యేక కార్యదర్శి, పబ్లిక్‌వర్క్స్‌శాఖ కార్యదర్శి, హోం (పోలీసు) శాఖ ఉపకార్యదర్శి, కార్మికశాఖ కమీషనరు (సభ్యుడు - కార్యదర్శి).

యజమానుల ప్రతినిధులు : శ్రీ జె. కె. భువాల్కా, ఆంధ్రవాణిజ్య సమాఖ్య, సికింద్రాబాదు; శ్రీ ఆర్. రామచంద్రరావు, దక్షిణభారత యజమానుల సమాఖ్య.

(మిగతా 82 వ పేజీలో)

# వానాలప్పా! చెన్నాలప్పా!!

'హంసపదిక'

చెల్లెళ్లారా! అక్కల్లారా!
శ్రావణ మేఘం వచ్చిందర్రా!
జల్లుల ముత్యాల్ తెచ్చిందర్రా!
ఎగురుతు ఎగురుతు ఈలలు వేస్తూ
'వానాలప్పా' తిరగాలోయ్....!
చేతులు కలిపి కేకలు వేస్తూ
చెన్నాలప్పా తిరగాలోయ్...!!
వానాలప్పా! చెన్నాలప్పా!
వాకిట తిరుగూ చెన్నాలప్పా!!

మేడలు మిద్దెలు గిరగిర తిరుగును....
చెట్లూ చేమలు గిరగిర తిరుగును....
గిరగిర తిరిగే రంగుల రాట్నం!
కొండల కోనల రంగుల రాట్నం!!
చెల్లెళ్లారా! అక్కల్లారా!
చిత్రా లెన్నో కనిపిస్తాయి...
వానాలప్పా! చెన్నాలప్పా!
వాకిట తిరుగూ చెన్నాలప్పా!!

అదిగో! అదిగో! అదిగది గదిగో!
రుద్రమ్మెక్కిన రంగుల గుఱ్ఱం!
రంకెలు వేసే రంగుల గుఱ్ఱం!
అడిగో! అడిగో! ఖడ్గతిక్కనా!
కదన రంగమున గర్జన చేస్తూ
గంతులు వేసే ఖడ్గతిక్కనా!
కత్తిని త్రిప్పే ఖడ్గతిక్కనా!!

అదిగో! అదిగో! బొబ్బిలికోటా!
అడిగో! అడిగో! అడిగడి గడిగో!!
మీసం త్రిప్పే పాపారాయుడు!
బాకును దూసే పాపారాయుడు!
వేంగళరాయల ధర్మారాయల
వీర విహారం అదిగో...అదిగో....!
బాలచంద్రుడూ బ్రహ్మనాయడూ
నాగమ్మా నలగామ రాజులూ
అరిగో... అరిగో...అరిగరి గరిగో!!
వానాలప్పా! చెన్నాలప్పా!
వాకిట తిరుగూ చెన్నాలప్పా!!

వీరమాతలా బంగరు పంటలు!
వీరవనితలా నోముల ఫలములు!
తెలుగు పిల్లలకు తీయని చరితలు!!
గిర గిర తిరుగూ వానాలప్పా!
గిర గిర తిరుగూ చెన్నాలప్పా!!
తమ్ముడు త్రిపిన బొంగర మదిగో...
చెల్లెలు చేసిన పడవలు అవిగో....
అమ్మా నాన్నా అరిగో....అరిగో....!!
వానాలప్పా-చెన్నాలప్పా-
వాకిట తిరుగూ చెన్నాలప్పా!!

# గ్రంథ సమీక్ష

## శ్రీ మహా భాగవతము

(నాలుగు సంపుటములు. వెల ఒక్కొక్క సంపుటము రూ. 5/-. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, తిలక్ రోడ్డు, హైదరాబాదు వారి ప్రచురణము. సంపాదకవర్గము: ఆచార్య రాయప్రోలు సుబ్బారావు, డా॥ దివాకర్ల వేంకటావధాని. డా॥ బి. రామరాజు, శ్రీ తా పీ ధర్మా రావు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి.)

మహాకవియు. మహాభక్తుడునగు పోతరాజు రచించిన మహాభాగవత మాంధ్రుల కత్యంతప్రీతిపాత్రమైన మహాపురాణము. వాయువువలె వెలుతురు వలె నది చొరని గృహ మాంధ్రదేశమున నుండదనుటలో నత్యుక్తి లేదు ఆంధ్రులం దక్షరాస్యు లందఱికి నందలి పద్యము లొండు రెండైన రాక యుండవు. రసవంతమైన కావ్యముగా, ప్రామాణికమైన మత గ్రంథముగా, కర్తవ్యోపదేశకమైన పురాణముగా దానికి దేశమున నెంతో ప్రశస్తి యున్నది క్రీ శ. 1940వ సంవత్సరమున కీ. శే వేదం వేంకటాచల శాస్త్రిగారు తొలుదొల్త దీనిని ముద్రించిన నాటి నేటి వఱకు నిది పలువురిచే పలుసార్లు ముద్రింపఁబడినది. వారిలోఁ గొందఱవకాశమునుబట్టి కొన్ని తాళపత్ర ప్రతులను బరిశీలించియే ఆయా ముద్రణములను సంతరించి యుండిరి అయినను లేఖక ప్రమాదాదుల చేతను, ముద్రణ లోపము చేతను, ధనాద్యభావముచేఁ గలిగిన పరిమిత పరిశోధనావకాశము చేతను, పండితులైన పరిష్కర్తల స్వతంత్రత చేతను అందుఁ గొన్ని అపపాఠములు దొరలినవి. మొదటి ముద్రిత ప్రతులలో దొరలిన అపపాఠములు తరువాతవానిలో యథాతథముగా నట్లే నిల్చిపోయినవి. తరువాత ముద్రించిన వారు కాగితములు, అట్ట, బైండింగు మున్నగువాని విషయమునవలె నాంతర వస్తువు విషయమున నంతగా శ్రద్ధ వహింపక పోవుటయే యందుకుఁ గారణము. మఱి బెక్కు తాళపత్ర ప్రతులు సేకరించి, వానినెల్లఁ బరిశోధించి, శుద్ధమైన ప్రామాణిక ప్రతిని దయారుచేయుట బహు వ్యయ ప్రయాస సాధ్యమైన పని కేవల లాభాపేక్ష గలవారాపని చేయుటకుఁగాని చేయించుటకుఁ గాని అవకాశ ముండదు. ఈ విషయము గుర్తించి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి వారాంధ్రదేశమునందలి నలుమూలలనుండి తాళపత్ర ప్రతులను దెప్పించి, అందుత్తమములు ప్రాచీనములు నైనవాని నేరి, పలువురు పండితుల సాయముచే, వ్యయమునకు జంకక, బహు పాఠాంతర పరిష్కార విపుల పీఠికా సహితమైన యీ భాగవత నవీన ముద్రణమును వెలయించుట యెంతయు ముదావహమైన విషయము ఈ ముద్రణమును సిద్ధము చేసిన విధానమందలి కార్యదర్శిగారి సమర్పణము నందును, సంపాదక వర్గమువారి పీఠికయందును వివరింపఁబడినది. పూనాయందలి భండార్కరు ప్రాచ్య పరిశోధన సంస్థవారు సంస్కృత భారతమునకువలె అకాడమివారీ భాగవతమునకును సవిమర్శమైన (Critical) సమగ్ర ముద్రణమును సిద్ధము చేయించి యుండిన మఱింత ప్రశంసావహముగా నుండెడిది. కాని అది అపార వ్యయమునకును సుదీర్ఘ కాలమునకునుగాని సాధ్యముకాని దగుటచే వారీ ప్రామాణిక ముద్రణముతోడనే తృప్తి వహింపవలసి వచ్చినది ఈ రూపమున నైన భాగవతమునకు – తద్వారా ఆంధ్ర భాషకు – కొంత సేవ జరిగి యుండుట ఆనందింపవలసిన విషయము.

సంపాదక వర్గమున సుప్రసిద్ధులైన కవులు, పండితులు, విమర్శకులు, పరిశోధకులు కూడ నున్నారు. వీరందఱి సమిష్టి కృషికి ఫలితముగా వెలువడిన యీ ముద్రణము ప్రశంసాపాత్రముగా నుండుటలో నచ్చెరువులేదు. తాళపత్ర పరిశీలనమున సంపాదకులకుఁ దోడ్పడిన సహాయులుకూడ పండితులే యగుటచేఁ బరిశీలనము నిర్దుష్టముగను సమగ్రముగను జరిగినదని తలంపవచ్చును

అకాడమీవారు తెప్పించిన తాళపత్ర ప్రతులలో కోస్తాజిల్లాకు, తెలంగాణమునకు రాయలసీమకుఁగూడఁ జెందిన ప్రతులున్నవి. సంపాదకులు వీనిలోఁ బ్రశస్తములైన వానిని గుర్తించి వానికిఁదోడు ముద్రితములైన – హయగ్రీవశాస్త్రులవారి వెవప్పెరు మాళ్ళయ్యగారి, వావిళ్ళ వారి, వేంకటరామవారి, రాయలవారి ప్రతులను గూడఁ బరిశీలించి, సందర్భోచితము, అర్థవంతము నైన మంచి పాఠమును గ్రహించి మిగిలిన ప్రతులందలి పాఠములను బ్రతిపుట

యందు నథోదీపికలందు పాఠాంతరములుగా నొసంగిరి. ఇన్ని పాఠాంతరములతోఁ గూడిన ప్రతి యింతవఱకు ముద్రితములైన వానిలో లేదు. ఈ విధముగా నీ భాగవత ప్రతి సుమారు పది పంద్రెండు తాళపత్ర ప్రతులందలి పాఠములను పరితల కందు పాటులోనికిఁ దెచ్చి యున్నది. 1955వ సంవత్సరమున పురాణం . హయగ్రీవ శాస్త్రిలవారు ద్వితీయపర్యాయము ముద్రించిన ఆంధ్ర భాగవతమే యీ ప్రతికి మూలముగా గ్రహింపఁబడినది అందున్న వ్యాకరణాది దోషములు పరిహరింపఁ బడినవి. ఇతర ప్రతులలో నందున్నవానికంటె నుత్తమములైన పాఠములు లభించినచో సంపాదకులు వానిని గ్రహించి హయగ్రీవ శాస్త్రిలవారి పాఠమునే పాఠాంతరముగా నథో దీపికలో నొసంగియుండిరి.

తాళపత్ర ప్రతులలో లభించిన మంచి పాఠములన్నియు సూచించుట, సంస్కృత భాగవతమునందలి అధ్యాయముల సంఖ్యను దెలుపుట, అన్వయము కుదరక అర్థక్లేశము సంభవించుచోట్ల క్రింద మూలశ్లోకము కూడ నొసంగుట, మంచి కాగితముపై నాలుగు సంపుటములలో చక్కగా ముద్రించుట, విపులమైన పీఠిక రచించుట, ప్రస్తుతమున్న వ్యాకరణములకు లొంగని కొన్ని ప్రయోగములు, సంధులు కానవచ్చినను ముద్రిత ప్రతులనుబట్టి వానిని మార్చివేయక అట్లే యుంచుట మున్నగునవి యీ నూతన ముద్రణమందలి మెచ్చఁదగిన గుణవిశేషములు. ప్రతిఘట్టమును మూలముతో సరి చూచుట కూడ నీ ముద్రణముయొక్క విలువను హెచ్చించియున్నది.

పూర్వ ముద్రిత ప్రతులందలి పాఠములు కొన్ని అర్థరహితములై అన్వయక్లేశము కలిగించుచున్నవి. కొన్ని మూలమునకు విరుద్ధముగా నున్నవి. కొన్ని దుష్టములను భ్రాంతిచే పరిష్కర్తలచే స్వేచ్ఛగా దిద్దఁబడినట్లు కనిపించుచున్నవి. ఈ ముద్రణమున లభించిన తాళపత్ర ప్రతుల సాయమున నట్టి అపపాఠములు చాలవఱకు సవరింపబడినవి. అట్టివి నూటయేఁబదియైదు పీఠికలో సూచింపఁబడినవి.

అంతరాత్మ నీశ్వరు నంశమైనవాని – 3-214 అను సీసపద్యమున వాని అను దంత్య నకారయుక్త పాఠమున్నచో నర్థము కుదురదు. అచ్చట పరిష్కర్తలు సూచించినట్లు వాణి యని మూర్ధన్యణకారముతోఁ గూడిన పాఠముండవలయును. 'వాచాస్వాంశేన' అను మూలమున కిది యనుగుణముగా నున్నది "నాసారంధ్ర నిర్గత స్తబ్ధరోమ లోకంబు" 3-407 అను పాఠము సార్థమైనదికాదు. "వరాహతోకః" అని మూల పాఠము. పరిష్కర్తలు తదనుగుణముగా పాఠమును మార్చుట సమంజసముగా నున్నది. ఇట్లే "చరాచర దేహశరీర ధారణాస్థితిగల" "యుక్తాసనము" "చేడియ లేదు చూరికులశేఖరు" "అభియాతి విశత్రుని వ్రేసె" మున్నగు పాఠములు క్రమముగా "చరాచరదేహి శరీరధారణా స్థితి" "ముక్తాసనము" "చేడియలేరు చూరి కులశేఖరు" "అభియాతుని జత్రువు వ్రేసె" అని సందర్భానుగుణముగా సవరింపఁబడినవి. ఇందలి మార్పులు పైకతి స్వల్పములుగా గోచరించినను అర్థమునందెంతో సౌలభ్యము, ఔచిత్యము చేకూర్చుచున్నవి. ఇట్టి పాఠములను సవరించి గతానుగతికముగా సాగిపోవుచున్న అపపాఠములను తొలగించి పరిష్కర్తలు భాగవతమున కపారమైన వన్నె చేకూర్చినారు. ఇట్టిపాఠ పరిష్కరణమందే వారి కృషి పరిశోధనలు తెల్లగా గోచరించుచున్నవి.

భాగవత కవులు తమనాఁడు శిష్టవ్యవహారమున నుండుటచే నుద్దేశపూర్వకముగా వాడిన రూపములు కొన్ని ముద్రిత ప్రతులలో బాల వ్యాకరణానుగుణముగా మార్పు చెందినవి. పరిష్కర్త లట్టివానిని బరిశీలించి కవుల పాఠములనే యట్టిచోట్ల మార్చుటకై యత్నించియుండిరి "అకుటిలమతి బదరీవనముకు నను బొమ్మనుచు" "కోరి పునీతులఁ జేయువారలన్" "ఓరేద్వకు" "హితపెడ చేఁతనిలయను నువిరపుట్టె" "దానవిఁజనుఁ బాలు" మున్నగు పాఠములట్టివి. ఇట్లే పోతనగారును ఇతర భాగవత కవులును అఖండ యతిని, ఉపుయతిని, ఋయుయతిని, ఉఋయతిని పెక్కుచోట్ల వాడియుండిరి. ఇవి పూర్వకవులు మఱికొందఱు కూడ వాడినట్టివే. కాని అప్పకవికి సమ్మతములైనవికావు. ఆ కారణచే పరిష్కర్తలు సాధ్యమైనచోట్లనెల్ల నీయతులను దిద్దివైచిరి. పరిష్కర్తలు వానిని బరిశీలించి కవిహృదయానుసారములైన పాఠములనే పునరుద్ధరించుట సంతోషింపఁదగియున్నది. "మయసూనుండగు దానవుండు నిజమాయన్ గోపరాజిన్" 2-182 అను పాఠమున యతి తప్పినది. అందుచే ముద్రిత ప్రతులలో హయసూనుఁడను పాఠము గ్రహింపఁ బడినది. కాని యిది మూలవిరుద్ధము. ఇచ్చట ప్రశక్తుడైన దానవుఁడు మయసూనుఁడేకాని హయసూనుఁడు కాఁడు. యతి పొరపాటైనదని భావింపవలెనేకాని పాఠము మార్పరాదు.

కొన్ని వ్రాఁతప్రతులందును, హయగ్రీవ శాస్త్రిగారి ప్రతియందును పొడిచింది (పొడిచినది) ముత్యాల శాసలు (సేసలు) నీ పదాబ్జకావా నిరతుల్ మున్నగు వ్యావహారిక భాషా ప్రయోగములున్నవి. వానిని పూర్వ పరిష్కర్తలు అధికముగా దిద్దియుండిరి.

ఈ పరిష్కర్తలు వానిని సవరించి యుండిరి. దిద్దక గ్రంథమునందు వ్రాఁతప్రతుల పాఠములనే యుంచి అధోదీపికలో పాఠాంతరములుగా పరిష్కృత పాఠముల నిచ్చియుండిన నుచితముగా నుండెడిది. ఇట్టివి వ్యాకరణమునకుఁ గేవల విరుద్ధము లగుటచే సవరింపఁబడినను మొత్తముమీఁద "కవు లిష్టపడి వాడుకొన్న శబ్దములను మార్చరా" దను నియమము ననుసరించియే పరిష్కర్తలు పాఠ పరిష్కరణము సాగించి యున్నారు. అధోదీపికలలో నీయఁబడిన పాఠాంతరములలోఁ గొన్ని యర్థరహితములు, నిరుపయుక్తములు నైనవి కలవు. వ్రాఁతప్రతులలో నున్నంత మాత్రమున అన్ని పాఠములను ఎక్కించుట అనవసరము.

తాళపత్ర ప్రతులను బరిశీలించుచుండగా నితర ముద్రిత ప్రతులందు లేని పద్యములైదా అందు గోచరించినవి. కొన్ని పద్యములకు వచన రూపము లున్నవి. పరిష్కర్తలు వాని నన్నిటిని -ధోదీపిక లందుఁ జేర్చినారు. నిజము పరిశీలింపఁగా నా పద్యములుగాని గద్యములుగాని శైలిలోఁగాని నడకలోఁగాని పదప్రయోగాదులందుఁ గాని పోతరాజువిగాఁ గనిపించుటలేదు వానిలోఁ గొన్నిటికి మూలమును గానిపించుటలేదు. లేఖకు లెవ్వరో సందర్భమును బట్టి వాని నందుఁ జేర్చియుందురు. పరిష్కర్తలు వానిని పోతరాజువి కావను తలంపుతో పూర్తిగాఁ బరిహరింపక అధోదీపికలందుఁ జేర్చుట సమంజసముగా నున్నది.

ప్రథమ సంపుటము మొదట 185 పుటల విపులమైన పీఠిక యున్నది. ఇందు పురాణములను గుఱించియు సంస్కృత భాగవత కర్తృత్వ మహత్త్వములను గూర్చియు, పోతన సింగన గంగన నారయల కాలదేశములను గూర్చియు, వారి అనువాద విధానమునుగూర్చియు, పోతన కవిత్వమును గూర్చియు, నప్పటి దేశ కాల పరిస్థితులను గూర్చియు, భాగవతమందలి భక్తిని గూర్చియు, ముద్రిత ప్రతులందలి అపపాఠములను గూర్చియు, భాగవతమును బరిష్కరించిన విధమును గూర్చియు పెక్కు విషయములు వివరింపఁబడియున్నవి. ఇందనువాద విధానమును, పోతన కవిత్వమును, అపపాఠములను గూర్చి చేయఁబడిన విమర్శ బహు పరిశోధనకు ఫలితమై పరిష్కరణమునకు వన్నె చేకూర్చుచున్నది. పోతనాది కవుల దేశకాలములను జీవితములను గూర్చిన విషయములు విదితపూర్వములైన వన్నియు సవిమర్శముగా సంగ్రహముగా తెల్పఁబడియున్నవి. ఈ విధముగా పీఠిక విపులమై బహు విషయ విన్యాస పరిపూర్ణమై పరితృ జనోపయోగ కరముగా నున్నది పురాణములను గూర్చియు, పోతన భాగవత రచన అను శీర్షిక క్రింద (పుటలు 75-97) సామాన్యముగా కవిత్వమును గూర్చియు వ్రాయఁబడిన విషయములమూల్యములయ్యు ననవసర విపులములుగా నున్నవి. పోతన కవిత్వమును గూర్చిపలెనే యితర కవుల కవిత్వమును గూర్చికూడ నించుక విస్తరించుట పీఠికయొక్క విలువను మఱింత హెచ్చించి యుండెడిది. గ్రంథమునందలి పద్యముల నుద్ధరించినప్పుడు పెక్కు చోట్ల వాని యారంభములనే కాక పద్యముల నన్నిటిని పూర్తిగా నిచ్చి యుండవలసినది. విస్తర భీతిచే పద్యారంభములను మాత్ర మొసంగు విధానము నవలంబించియుందురు. పెక్కు పద్యముల తరువాత నీయఁబడిన సంఖ్యలు గ్రంథమునందలి సంఖ్యతో సంవదించుట లేదు. బహుశః ఆ సంఖ్యలు పూర్వ ముద్రణములందలివి కావచ్చును. దశమ స్కంధమును సూచించినప్పుడు పూర్వోత్తర భాగములలో నేభాగమో కొన్నిచోట్ల చెప్పఁబడి యుండలేదు. అపపాఠములను సూచించి, వానిని సవరించియు నా సవరణలు కొన్ని గ్రంథమున చొప్పింపకపోవుట శోచనీయము. 112వ పుటలో గెఱ వ్రాయుట అని సూచించి గ్రంథమున గిఱి యను పాఠమునే యుంచుట, IV సంపుటము 370వ పుట అభియాతుని జత్రువు అని సవరించి అభియాతృవి యని యుంచుట మున్నగున విందుకు దృష్టాంతములు. ఈ విషయములో పరిష్కర్త లించుక శ్రద్ధ వహించి యుండవలసినది. కాని ఈ లోపములు స్వల్పములైన వగుటచే తరువాతి ముద్రణములలో వానిని సులభముగా సవరించుకొనవచ్చును.

పోతన భాగవతము ఆంధ్రదేశమున బహుప్రచార మందిన గ్రంథము. ఇందలి పద్యము లెన్నియో యెందఱికో నోటికి వచ్చును. ఏపద్య మెచ్చటనున్నదో తెలిసికొనుటకు వీలుగా నీ పరిష్కరణమున పద్యానుక్రమణిక (Verse Index) ముద్రించుట యెంతయు నుచితతరముగా నుండును. స్వల్పవ్యయమునకు వెనుదీయక అకాడమీవారీ కార్యమును గూడ నెఱవేర్తురు గాక.

భాగవత మంతయు నాలుగు సంపుటములుగా ముద్రించుట పాఠకులకు సౌలభ్యము చేకూర్చుచున్నది. ముద్రణ మింపుగా రమణీయముగా నున్నది. అచ్చటచ్చట అఱసున్నలు లోపించినవి. ముద్రణ స్ఖాలిత్యములుకూడ ఎడనెడ లేకపోలేదు ఇందు కొన్ని పరిష్కర్తలయు కొన్ని ముద్రించువారియొక్కయు లోపములు కానవచ్చును. మొదటి రెండు సంపుటములలో ద్విత్వాక్షరములు, ఎ. వ్వ. ఎ మొదలగు గుర్తులు సరిగా నంటలేదు. ఉదా. పుట 203_413వ

నిర్ధూత మొదలైనవి. వచనములందు వాక్యములను విడిచి విరామ చిహ్నము లుంచుటయు, సంస్కృత భాగవతాధ్యాయ సంఖ్యల నొసంగుటయు పరిశీలను బరిశోధ కులకును మెచ్చు కలిగింపక మానవు ఈ విధముగా స్వల్పలోపములున్నను అకాడమీ వారు వ్యయప్రయాసల కోర్చి పవిత్రము, ఆంధ్రులకు పరమప్రియము నైన ఆంధ్ర భాగవతమును మిక్కిలి చక్కగా బహు పాఠాంతరములతో ముద్రించి ఆంధ్రజనుల కందిచ్చుట ప్రశంసార్హముగా నున్నది. ప్రభుత్వమువారి సాయముతో ముద్రితమైన యీ ప్రతిని రూ 10-ల కిచ్చుట యెంతయు సమంజసముగా నుండును. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ యిట్లే జనోపయోగకర ములైన కార్యము లొనరించి యాంధ్రజనుల ప్రశంసలకు పాత్రమై తన యునికిని సార్థక మొనరించుకొనుగాక !

—"హరిత"

## హిందీ తెలుగు బాలవ్యాకరణం.

[రచన : సాహిత్యరత్న మారేమండ హనుమంతరావు, ప్రచురణ : వెంకటాచలం పబ్లిషర్స్:- నాజరుపేట, తెనాలి. 112 పేజీల సాదాప్రతి ఒక రూపాయి యిరువై అయిదు నయాపైసలు; ప్రతులకు - మూర్తిపబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్, గాంధీచౌక్, తెనాలి.]

"సంపూర్ణ ప్రభుత్వ సంపన్న లోక తంత్రాత్మక గణరాజ్యమైన భారతావనికి జాతీయ భాషగా, అధికార భాషగా వ్యవహ రింప బడుతున్న హిందీభాషా ప్రాముఖ్యం దినదినాభివృద్ధి చెందుతుంది. ముఖ్యంగా దక్షిణాది రాష్ట్రాలలో హిందీ అభ్యసించే వారిసంఖ్య రోజు రోజుకి ఎక్కువవుతుంది. రాష్ట్ర, కేంద్రప్రభుత్వోద్యోగులంతా హిందీ నేర్చుకొంటున్నారు అతి సులభంగా హిందీ నేర్పే పద్ధతులను గురించి అనేకానేకమైన పరిశోధనలు జరుగుతున్నాయి. ఆంధ్రదేశం లోని అనేకానేకమంది హిందీ విద్వాంసులు వారి బోధనానుభవాన్ని ఆధారం చేసుకొని తెలుగు ప్రాంతీయులకు సులభంగా హిందీ నేర్పు వీలయిన పద్ధతులను పొందుపరచి అనేకానేకమైన పుస్తకాలు వ్రాస్తున్నారు. మరి కొంతమంది హిందీ వ్యాకరణాన్ని తెలుగు వ్యాకరణ శైలిలో బోధపరచి నారికి సులభ గ్రాహ్యంగా నేర్పుతున్నారు. ఈ పుస్తకం వ్రాసిన శ్రీ మారేమండ హను మంతరావుగారు ఈ శ్రేణికి చెందినవారే.

ఈ వ్యాకరణ గ్రంథంలో అకారాది వర్ణములు మొదలు సంజ్ఞ, సర్వనామం, విశేషణం, క్రియ, క్రియావిశేషణం, విభక్తులు, లింగ వచనములు, భూత భవిష్యత్ వర్తమానముల భేదోప భేదములు "నే" (ने) ప్రత్యయం,సంధి, సమాసం, స్వరాఘాతము, వాచ్యము, విభిన్నార్థవ్యంజకములైన పదాలు, వ్యతిరేక పదాలు, చాహియే (चाहिये) ప్రయోగం సక్, చుక్, లగ్ (सक, चुक, लग) ప్రయోగాలు, హోనా, పఢనా (होना, पढना) ప్రయోగాలు, कि ప్రయోగం, ప్రశ్నార్థకములూ, నుడులు, నానుడులూ, తారతమ్య పరిశీలనాత్మకములైన వ్యాకరణ విధులు, అంకెలు అనేకానేకమైన విషయాలు సాకల్యంగా చర్చించబడ్డాయి. ప్రారంభ దశలోవున్న హిందీ విద్యార్థులకు, యిది చక్కగా వుపయోగిస్తుంది. ప్రతి అధ్యాయం లోను ఆ యా విషయాన్ని హిందీ, తెలుగు రెండు భాషల్లోను నిర్వచిస్తూ వచ్చారు. ఈ సూత్రం కొన్ని అధ్యాయాల్లో పాటింప బడకపోయినా, పాటించిన చోటల్లా ఈ పద్ధతి పుస్తకాన్ని ఎన్నెలు దిద్దింది. రచయిత సంజ్ఞా పరిచ్ఛేదంలో సంజ్ఞకు వుదాహరణగా కొన్ని తెలుగుపదాలు వ్రాశారు కాని హిందీ వ్యాకరణ రచన చేస్తున్నా నన్న విషయాన్ని గుర్తుంచుకొని హిందీపదాలు వ్రాశారుకారు. ప్రతి పరిచ్ఛేదంలోనూ ఆ అధ్యాయానికి యింగ్లీషు పర్యాయపదాలు కూడా "హెడ్డింగ్" గా బ్రాకెట్ చేసి వ్రాయడం వలన ఈ పుస్తకం ఆంగ్ల కళాశాలలో హిందీ అభ్యసించే విద్యార్థులకు, యూనియన్ సర్వీసు కమిషన్ ఆంధ్ర ప్రదేశ్ సర్వీసు కమీషన్‌వారి హిందీపరీక్షలు వ్రాయబోయే విద్యార్థులకు కూడా వుపయో గిస్తుంది.

హిందీ భాషా వ్యాకరణంలో (ने) "నే" ప్రత్యయం విశేష మైనటువంటిది. పూర్ణ ఆసన్న, సామాన్య, సందిగ్ధ భూతకాలాలలో క్రియ సకర్మక మయితే కర్తకు "నే" ప్రత్యయం చేర్చాలి. కర్తకు "నే" చేర్చి నట్లయితే క్రియాస్వరూపం కర్మయొక్క లింగవచనాల ననుసరించి యుంటుంది. ఉదాహరణకు "రాముడు రొట్టె తినెను" అనేవాక్యం హిందీలో వ్రాసి చూద్దాం "राम ने रोटी खायी" "రామ్ నే రోటీ ఖాయీ" గా వ్రాయాలి. ఈ వాక్యంలో కర్తగా వున్న రాముడు పురుషుడు కాని క్రియా స్వరూపం మాత్రం స్త్రీ లింగ ఏకవచనంలో వున్నది. అంటే కర్మఅయిన "रोटी" రోటీ (రొట్టె) ననుసరించి యున్నదన్న మాట ఈ వాక్యాన్ని శాబ్దికంగా తెలుగులోకి అను వదిస్తే "రాముడు రొట్టె తిన్నది అవు తుంది. యిది "నే" ने ప్రత్యయంలో వున్న టువంటి వుల్టా సీదా. హిందీలో లింగ నిర్ణయం యిలాంటిదే. ఒకే అర్థాన్ని సూచించే రెండుపదాలు వేర్వేరు లింగాలలో వుంటాయి. నపుంసకలింగం లేకపోవడం

చేత హిందీలో "किताब" కితాబ్ (పుస్తకం) స్త్రీ లింగం. గ్రంధ్ "ग्रंथ" పుంలింగం. "धारा" "ధారా" స్త్రీ లింగం. "प्रवाह" ప్రవాహ్ (ప్రవాహం) పుంలింగం ఈ లింగ పరిజ్ఞాన సాధనతో హిందీ అభ్యసించేవారి బుర్ర బ్రద్దలవుతుంది "होना, पढना, चाहिये" "హోనా, పఢ్‌నా చాహియే" ప్రయోగాలు కూడా యిదే విధంగా తల తోకా లేనటు వంటివి ఇలాంటి ప్రయోగాలు ముఖ్యంగా దాక్షిణాత్యులకు చికాకు కల్గించేటువంటివి. ఇందువలనే వ్యావహారిక హిందీభాషలో మార్పులు తేవాలని ప్రామాణికమైన హిందీ వ్యావహారిక భాషావ్యాకరణం రచించాలని హిందీ విద్వాంసులైన ఆంధ్రభాషా వేత్తలు కొంతమంది తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నారు. నూత్న విసూత్నమైన సౌలభ్యాలతో హిందీభాషకు వ్యావహారిక వ్యాకరణం వ్రాస్తున్నారు. అనేకమైన సిద్ధాంతాలు స్థిరీకరిస్తున్నారు. కాని విప్లవ దూతల వలె మార్పులు రావాలని ఘోషించే మన భాషా వేత్తల దూరదృష్టిని, నిశిత విమర్శనా వివేకాన్ని, వ్యాకరణ రచనా పటుత్వాన్ని, ఔత్తరాహికులైన హిందీ ప్రాంతీయులు ఆమోదించాలికదా! తమ భాషకు, వేరొక ప్రాంతంవారు వ్యాకరణం వ్రాస్తే వారు సహించగలరా! సహించినా, అందులోని సత్యతత్వాన్వేషణను, భాషా సహజత్వాన్ని గ్రహించి "ఔనౌ"నని స్వీకరముద్రలు వేయగలరా! సదసద్ వివేకబుద్ధితో పరిశీలించి మన భాషావేత్తలు చెప్పేది నూటికి నూరు పాళ్ళు "కరెక్టు" అని అనగలరా!

ప్రస్తుత రచయిత "నే" (ने) ప్రత్యయాదులు వివరించి తగినంత విపులంగానే వ్రాశారు. సులభతరం చేశారు. కాని పై విషయాన్ని దానికున్న ప్రాముఖ్యాన్ని గుర్తించి, తమ శాయశక్తులా హిందీ వ్యావహారిక భాషావాదాన్ని బలపరచి, దాని వ్యాకరణ రచనకు పూనుకొనినట్లు కన్పించదు. కనీసం భవిష్యత్తులోనైనా వీరిలాంటి కవిపండితులు వుద్యమానికి ఆయువుపట్టుగా నిలిచి పోరాడుతారని ఆశిద్దాం.

—జి యస్. రావు

ఆధునాతన ఆంధ్రకవిత్వం తీరుతెన్నులు అనేకవిధాలు. ఒకవైపు పూర్వ సంప్రదాయాను గుణంగా కావ్యాలు, మరోవైపు ఆధునికత వెల్లివిరిసే కావ్యాలు వెలువడు తున్నాయి. భావకవిత్వమూ అభ్యుదయ కవిత్వమూ పుడుతూవున్నాయి. పద్యాలూ, గేయాలూ రాణిస్తున్నాయి. మాత్రాఛ్ఛంద గేయాలూ వచన గేయాలూ తయారవుతున్నాయి. ఇతివృత్తాలు చాలా విధాలుగా వుంటున్నాయి పురాణేతిహాస వస్తువులతో పాటు రిక్షావాడు వాకిపిల్ల కూడా కావ్యవస్తువు లయ్యాయి. అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళ, కుక్కపిల్ల కూడా కావ్యేతి వృత్తాలే అవుతున్నాయి. భాషవిషయంలోనూ మార్పులు ఎక్కువ. భారతంనాటి భాష వాడేవాళ్ళు, గ్రాంధికమ్ వ్యవహార భాషకు దగ్గరగా వున్నది, వ్యావహారిక భాష వాడేవాళ్ళు కావ్యరచన చేస్తున్నారు. ప్రక్రియ విషయంలో, భాషా సంగతిలో, ఇతివృత్త సందర్భంలో, ఈనాడు ఆంధ్ర కావ్యలోకంలో వున్నంత వైవిధ్యం ఏనాడూ ఆంధ్ర సాహిత్యంలో లేదనవచ్చు. అయితే ఇంత వైవిధ్యం వున్నప్పటికీ సమగ్ర కావ్యం, విశ్వసాహితిలో ఆంధ్రజాతి గౌరవం నిలిపే కావ్యం ఏదైనా వెలసిందా అనేది విజ్ఞులు ఆలోచించాలి.

ఈసమీక్షలోని కావ్యాలను, ఇతివృత్తాన్ని పురస్కరించుకొని రెండు తరగతులుగా విభజించవచ్చు. ప్రసిద్ధమయిన ఇతివృత్తం గ్రహించి నిర్మించిన కావ్యాలు, స్వయంగా కల్పించిన ఇతివృత్తకావ్యాలు. ఈ కావ్యాలకు వ్రాయబడ్డ పరిచయాలు గూర్చి ఒక మాట చెప్పక తప్పదు. పరిచయం పాఠకుడికి త్రోవ చూపాలి కానీ అదే త్రోవకారాదు. 'ఆనందభిక్షువు' పరిచయాలు సక్రమంగా త్రోవ చూపించేవి ఇంద్రధనుస్సు పరిచయంవల్ల త్రోవ తెలియదు.

## ఆనంద భిక్షువు (కావ్యం)

[కవి శ్రీ పి. వి. యల్. నరసింహారావు. మూల్యం: రెండు రూపాయిలు. ప్రాప్తిస్థానం: శ్రీ మేడూరి గోవిందాచార్యులు. చే బ్రోలు, తెనాలి తాలూకా, గుంటూరుజిల్లా- లేదా మేనేజర్, శ్రీ విశాలాక్షీ హోం లైబ్రరీ, సద్లమూడి, వయా సంగం జాగర్లమూడి, గుంటూరు జిల్లా ]

బుద్ధుని శిష్యుడయిన ఆనందుని ఆత్మశక్తి, మాతంగకన్య అయిన ప్రకృతి హృదయభక్తి, ఆమె తల్లి మంత్రశక్తి - ఈ మూడింటి మధ్య సంఘర్షణ ఆనంద భిక్షువులోని ఇతివృత్తం. ఇది మానవులలో మానవత్వం, సమానత్వం చూపించే చక్కని కావ్యం.

ఇందులో ప్రకృతి ప్రకృతిగానూ, ఆనందుడు లౌకికాతీతమయిన బ్రహ్మానందంగానూ, ప్రకృతి తల్లి అవిద్యగానూ, గోవత్సం శ్రుతిగానూ, అంతర్వాహినిగా ధ్వని. ధ్వని వున్న కావ్యం ఉత్తమం. కావ్యంలో శృంగార రసం పోషితమయి కూడా తదన్యమయిన శాంతమే పర్యవసాయి.

మంత్రశక్తి, ఆత్మశక్తి సంఘర్షణలో

ఆత్మశక్తి జయిస్తుంది అనే భావనిర్వహణ కవి ప్రతిభా వ్యుత్పత్తులకు తార్కాణగా చూపవచ్చు.

మతం జీవితవిధాన మయితే, జీవితం ఆనందంవాంఛిస్తుంది. వర్ణధర్మం తిరస్కరించే బౌద్ధం ఆనందసంకేతం. ఆనందుడు భిక్షువు. ప్రకృతి ఆనందభిక్షువు. కావ్యం ఆనంద భిక్షువు—నామకరణం అన్ని విధాలా చక్కగా కుదిరింది.

టాగూర్ నాటిక చండాలకలోని వస్తువు ఈ రచనకు సూత్రప్రాయం. అది ప్రసిద్ధ బౌద్ధ గాథ. వర్ణనలు సహజంగా వున్నాయి. శ్రావస్తిపురి నంటివున్న చండాలవాటిక వర్ణన కన్నులకు కట్టినట్లుంది.

కవికి భాషపై వున్న అధికారం కారణంగా ఏ పద్యమూ వ్యర్థంగా కన్పించదు. రచనలో ఎగుడు దిగుళ్ళు లేవు. రచన మాధుర్యం గుణప్రధాన మయింది.

ఇతివృత్తగౌరవం చేత, ఉదాత్త రచనా రీతిచేత, గంభీర రసధ్వనిచేత, స్వతంత్ర కల్పనలచేత, వర్ణనౌచిత్యం చేత, ఆనంద భిక్షువు ఉత్తమ శ్రేణికావ్యం.

"సాహితీ జగత్తులో సుప్రతిష్ఠితములైన సౌందరనందం, బుద్ధచరితం, కరుణశ్రీ మొదలైన కావ్యాలు స్మృతి పథంలో కదిలినై. నాలో అమూర్తములై యున్న భావాలకు మూర్తి కల్పనం జరిగింది ... కొన్నాళ్ళకు ఈ ఆనంద భిక్షువు అవతరించింది."

## ఇంద్రధనుస్సు

(గేయసంపుటి)

[కవి : శ్రీ చిత్రభాను, మూల్యం: 0.75 న. పై. ప్రతులకు : చిత్రభాను ప్రచురణలు. విజయనగరం-2. లేదా 'చిత్రభాను' నాగూరు (P.O.) శ్రీకాకుళంజిల్లా.]

ఈ గేయ సంపుటిలో పది హిందీ, ఉర్దూ అనువాదాలు, ఇరవైఏడు స్వతంత్రరచనలు వున్నాయి. అనువాదాలు అందంగా స్వతంత్ర రచనలులాగా వున్నాయి. స్వతంత్ర రచనలు ముచ్చటగా వున్నాయి. అన్ని ఖండికలలోనూ కవితాత్మ వుంది. ఒక్కొక్క శీర్షికలో కనీసం నాలుగయిదు వాక్యాలు మళ్ళీ మళ్ళీ చదివించేవిగా వున్నాయి చాలా ఖండికలలో కనిపించే ప్రేమ సెంటిమెంటల్‌గా వుంది. ఆత్మ సమర్పణా, నిరీక్షణలో తృప్తీ, ప్రేయసి భావనలో ఉదాత్తతా కనిపిస్తాయి. ప్రేమ విషయంలో కొన్ని ఖండికలు చిన్నతనం చూపిస్తున్నాయి. ఆగష్టు పదిహేను చౌ-ఎన్-లై, వంటివి కించిన్మాత్రంగా దేశభక్తిప్రేరకాలు. 'స్వాతంత్ర్యసంస్థాపకా' గీతిక బాగుంది. 'నిరాశలో ఒక నిముషం' చాలా ఉత్తమంగా వుంది. ఈ గేయ సంపుటిలో కనిపించే ఆశాకిరణం ప్రకాశవంతం కావచ్చు. ఒక నూత్న దృక్పథం అన్ని గీతకలలోనూ వుంది. భాషను మలుచుకోవటంలోనూ, పదాలు ఎన్నుకోవటంలోను శ్రీ చిత్రభాను మంచి నేర్పు చూపించాడు. ఛందస్సులో స్వేచ్ఛ వుంది. వచనగేయాలు ఎక్కువ. రచనలో డాబూ దర్పమూ లేవు. చాలా ఖండికలలో ఒక క్రొత్త మెరుపు వుంది. చదవదగిన గేయ సంపుటి.

## ఖడ్గతిక్కన

(కవి : శ్రీ కార్యమపూడి నాగభూషణము. వెల: రు. 1.25 న. పై. ప్రాప్తి స్థానము: శ్రీ అన్నంరాజు కృష్ణమూర్తి, క్రొత్తపేట, గుంటూరు]

ఖడ్గతిక్కన వీర రసోచిత గాథ ఆంధ్ర బాల బాలికలకు ఆ ఆ లతో నేర్పే పాఠం. అధ్యాపకుడయిన శ్రీ కార్యమపూడి నాగభూషణము ఆ గాథను కావ్యంగా చెప్పటం హర్షింప దగింది. (ballad) కాటమరాజు కథ అధికంగా, చిరుమార్పులలో జరిగిన సృష్టి ఇది. పుల్లం చెల్లించక పోయేప్పుడు, స్నానాల గదిలో మంచమూ, 'పసిడి తళుకులు చిందెడు' పసుపుముద్దా వున్నప్పుడూ, రచనబాగా సాగిందనే చెప్పవచ్చు. శైలిలో ధారాశుద్ధి వుందికాని వ్యర్థపదాలు లేకుండా వుంటే మంచిది. ప్రసిద్ధాంధ్రకవుల పద్యాల వంటి పద్యాలు అక్కడక్కడా మెరుస్తున్నాయి. చైనా దురాక్రమణ పురస్కరించుకొని చదవదగిన కావ్యం.

## అహల్యా శాప మోక్షము

[కవి : శ్రీ మన్నవ హరి సర్వోత్తమరావు. వెల : రు. 1-00. ప్రాప్తిస్థానం : శ్రీ అన్నంరాజు కృష్ణమూర్తి. [కొత్తపేట, గుంటూరు.]

అహల్య కరుణామయ జీవితం లోకానికి వెలుగుబాట. వాల్మీకి అహల్య పాత్రచిత్రణ అన్యాయం చేశాడని, శిలంతూలనాడాడనీ, విమర్శకుల వాదం వుండగా, తదన్యమయినే భగవదవతారమయిన రాముని ఔన్నత్యం చాటడానికే అహల్య జీవితగాథ ఉల్లేఖింపబడింది అనే వాదమూ వుంది. ఈ రెండు భావాలను కవి ఎలా పోషించాడు అనేది పరిశీలనార్యం. శ్రీ మన్నవ హరిసర్వోత్తమరావు ఈ కావ్యం ప్రబంధశైలిలో నడపాలని తలంచినట్లుగా, ఇష్టదేవతా ప్రార్థన, సరస్వతీ ప్రార్థన, పూర్వకవి స్మృతీత్యాది వున్నాయి. ఋతువర్ణన, దేవసభవర్ణన ఉన్నాయి. ఎడనెడ వచనం వుంది. దాంపత్య వర్ణనా, భర్త పట్ల భార్య భక్తి వున్నాయి.

పారమార్థికత, లోకజ్ఞత మేళవించి చేసిన రచన ఇది.

## భావ తరంగాలు
### (గేయసంపుటి)

[రచన: శ్రీ తంగెళ్ళ పాండు రంగశర్మ. మూల్యం: రు. 1-00 ప్రతులకు: శర్మ పబ్లికేషన్సు 10/70- పార్కురోడ్, విజయవాడ.]

బాల వాఙ్మయ రచయితగా పలుపత్రికల ద్వారా పాఠకలోకానికి పరిచయ మయిన, శ్రీ తంగెళ్ళ పాండురంగశర్మ గేయ రచయితగా వచ్చే రచనలు చేసి, ఈ భావతరంగాలు ప్రచురించాడు. ఇందులో దేశభక్తి, పండుగ, జాలి, ప్రేమ గేయా లున్నాయి. 'అంథకారబంధురం' 'కందుకూరి స్మృతి' 'భారతాంజలి' 'ఆంధ్రాంజలి' బాగున్నాయి. గేయాలు మాత్రాచ్ఛందస్సులో వున్నాయి ముచ్చటగా వుండే మాటలు తనివితీరా వాడుకొన్నాడు. చదవదగిన పుస్తకం.

## శ్రీ కర్ణ దర్శనం

[కృతికర్త: శ్రీ నల్లారెడ్డి నాయడు. తెలుగుపండిట్, డి. అర్. కె. ఆర్. హైస్కూలు. కొరిశపాడు. వెల: రు. 1-50.]

భారతం భారతీయ సంస్కృతికి చిహ్నం. అందులో ప్రజాజీవితం అన్నిరంగాల్లో వర్ణించబడింది. ఆ మహాప్రవాహంలో కర్ణ జీవితం ఒక అంతర్ప్రవాహం. భారతం కావ్యమయితే, కర్ణపాత్ర ఒకమహాసృష్టి. భారతం జీవిత మయితే కర్ణజీవితం విధి తాడిత మహాపురుషుని విషాదగాథ. భారతంలోని కర్ణుని జీవితపు వివిధదశలు పురస్కరించుకొని మహాభారత నాయకుడు కర్ణుడే అన్నా తప్పుకాదు. కర్ణుని జీవితం సానుభూతితో దర్శించి కర్ణదర్శనం రచించిన శ్రీనల్లారెడ్డినాయుడు అభినందనకుపాత్రుడు. రచనలో అక్కడక్కడా గడుసు పోకడలున్నాయి. వీరరసస్ఫోరకంగా రచన జరిగింది. ఈ తొంభై పేజీల పుస్తకంలో, కృతిపతి వంశవర్ణన, ఏడు ఫోటోలు పోను మిగిలిన నలభైమూడు పేజీలలో కర్ణ దర్శనం వుంది

## శ్రీ జ్ఞాన ప్రసూనాంబ

(కర్త: శ్రీ ఆర్కాడు కుప్పుస్వామి వెల: 0-75 న. పై. ప్రాప్తిస్థానం: శ్రీ. డి. కణ్ణన్. నెం. 3. గోపురం దిగువ వీధి, కాళహస్తి, చిత్తూరు జిల్లా)

ఈ కావ్యంలో కాళహస్తిలో వెలసి వున్న శ్రీ జ్ఞానప్రసూనాంబ దివ్య చరిత్ర వుంది. శ్రీ కుప్పుస్వామి తమిళ సాహిత్య కథ నాధారంగా తీసుకొని, తెలుగులో ఇది, రచించటం ఆనందదాయకమే! కావ్య మంతా తేటగీతిమాలికల్లో సాగింది. ఈ పుస్తకంలో సగంభాగం కావ్యం మిగతా సగం ఇతరేతర విషయాలతో నిండింది. చూడదగిన పుస్తకం

---

నేటి ఆంధ్ర సాహిత్యంలోని వచన రచనా రీతులు; ఆంగ్ల సాహిత్య సాహచర్యం ఫలితంగా ఏర్పడినవే! నేటి తెలుగు కథానిక భారతదేశంలోనే కాదు. ప్రపంచంలోనే ఉత్తమస్థాయి నందుకొంది. అయితే నవల కథానిక స్థాయినిగానీ, నాటక నాటికలు నవల స్థాయినిగానీ, ఇంకా పొందలేదనవచ్చు మన సాహిత్యంలో నవలలు, నాటక నాటికలు చాలాభాగం ఆంగ్లంలోంచి, భారతీయేతర భాషలలోంచి అనువాదాలగా వున్నాయి. తెలుగులో స్వతంత్ర రచనలు- ఉత్తమస్థాయిలో - చేయాలనే ప్రయత్నం వుంది. విశ్వ సాహిత్యంలో స్థానం సంపాదించుకో గలిగే రచనలు రావలసి వుంది. వారపత్రికలు, మాసపత్రికలు, ప్రచురణల సంస్థలు, కథానికలకు, నవలలకు, నాటక నాటికలకు, స్థానం, అవకాశం ఇస్తున్నాయి కానీ, అవి ఎంతకూ ఒకస్థాయినుంచి పైకి పోవటం లేదు. ఎందరో రచయితలున్న ఆంధ్రలో ఎందుకీ స్థితివుందో అనూహ్యమే. ఈనాడు తెలుగు పాఠక లోకం కోరుతున్న రచన నవల కావటంవల్ల నవలా రచనకు అవకాశం వుంది. పత్రికలలో నాటక నాటికలకు స్థానం లేకపోయినా, ఆకాశవాణి అవకాశం ఇస్తూనే వుంది. ఏ కళా పరిషత్తులోనో, ఏవో సమాజాలు ప్రదర్శించితే తప్ప నాటకనాటికలకు చెప్పుకోతగ్గఆదరణ లేదు. నాటకాలు దృశ్య కావ్యాలే కాని, అదే సమయంలో అవి ప్రచారం కావాలంటే ఉత్తమ రచనలు రావాలంటే అవే శ్రవ్య కావ్యస్థితిని కలిగివుండక తప్పదేమో!.

## ఆనంద బాష్పాలు
### (నవల)

[రచన: శ్రీ రత్నం, ప్రతులకు: ప్రసాద్ పబ్లికేషన్స్, ఏలూరు. వెల: మూడుపారూపాయిలు.]

ఆనంద బాష్పాలు, ఒకతరం తెరమరుగున పడుతూ వుంటే మరోతరం తెరమీద వస్తున్న సంధి సమయం చూపించే రసవత్తర సామాజిక నవల. జగన్నాథం, సుబ్బయ్య శెట్టి గతించేతరం మనుష్యులు. ఇద్దరికీ చేసిన తప్పుల గూర్చి పరివర్తన వచ్చింది. రాజారావు, చిరంజీవి, ఉదయించే తరం యువకులు. మునసబ్ అయిన రాజారావు, అధికంగా తన గ్రామాభివృద్ధి సాధిస్తాడు. డాక్టర్ అయిన చిరంజీవి, అనధికంగా, డాక్టరుగా ప్రజాశ్రేయస్సు సాధిస్తాడు.

ఇద్దరూ అభ్యుదయ వాదులు, ఆదర్శవాదులు వెంకన్నబాబు గతించేతరం మనిషి అయి కూడా ఉదయించే తరంలో జీవిస్తాడు. వ్యవసాయదారు డయిన అతనిలో రచయిత ప్రత్యేకత చూపెట్టాడు. చిరంజీవి – కుసుమ రాజారావు – రమాదేవి రెండు ఉత్తమ జంటలు. ఒకజంట వివాహం తల్లిదండ్రుల ఏర్పాటు, మరొక జంట వివాహం యువతీ యువకుల ఏర్పాటు. రచయిత శ్రీ రత్నం ఆదర్శవాది. నవలలో అభ్యుదయ దృష్టి కారణంగా అక్కడక్కడ కథా గమనంలో ఎగుడుదిగుడు తప్పలేదు. గ్రామంలో తగాదాలు, పార్టీలు, కొట్లాటలు చిరంజీవి సౌజన్య సౌహార్దాలు చదువుతూ వుంటే సినిమా చూస్తున్నట్లు కళ్ళఎదుట చిత్రాలు కదులుతాయి. పెళ్ళయిన చిరంజీవిని ప్రేమించిన సుబ్బయ్యశెట్టి మూడో భార్య తాయారమ్మ, శీలం – స్వార్ధత్యాగంతో చివరకు ప్రకాశిస్తుంది

శైలిలో వేగం ఎక్కువ. భావం త్వర పెట్టటంతో భాషమీద అశ్రద్ధ తప్పదు తెలుగుదనం ఉట్టిపడే సంఘటనలు సంభాషణలు, రచనకు జీవం పోశాయి. పాఠకులను చివరిదాకా చదివించే నవల శ్రీ రత్నం ఇతర రచనల మాదిరిగా ఇదీ పాఠకుల మన్నన పొందుతుంది.

## పోష్టుమన్ చేసిన తమాషా

(కథల సంపుటి)

[రచన: వాసమూర్తి. వెల: రెండురూపాయిలు. ప్రతులకు: శ్రీ కొండపల్లి వీర వెంకయ్యా అండ్ సన్స్, రాజమండ్రి.]

ఇందులో అయిదు కథలున్నాయి. 'పోష్టుమన్ చేసిన తమాషా' 'ఐకమత్యం' 'జోస్యం' 'అమ్మ' 'అన్వేషణ'. ఇవి ఇంతకు ముందు పత్రికలలో ప్రచురింపబడిన కథలు ప్రతి కథానికకూ వాస్తవ సంఘటనలు ఆధారమని రచయిత శ్రీ వాసమూర్తి తెలిపింది చూడవచ్చు. ఈ కథలలో పాత్ర చిత్రణ, మనోభావ పరిణామాలు. అసంతృప్తిగాలేకపోలేదుకానీఇతివృత్తంలో బిగువూ, సంఘటనలలో బలమూ కథలను చదివింపచేస్తాయి. కొన్నికథల్లో హాస్యం వుంది చాలాకథల్లో స్త్రీత్వపు విలువలు, పురుషబలహీనతలు భూతఅద్దంలోంచిచూడబడ్డాయి. ఐకమత్యం మంచికథ

## రాళ్లూ - రత్నాలు

(నాటకం)

వెల: రెండు రూపాయలు.

## నేనూ - నాదేశం (నాటిక)

వెల: రు. 1-00, రచన. శ్రీ పోకల నరసింహారావు, ప్రాప్తిస్థానం: ప్రసాద్ పబ్లికేషన్స్, ఏలూరు.

హిందూదేశం, పంచవర్ష ప్రణాళికలు, గ్రామాభివృద్ధి, గ్రామం మనుష్యులు_ మన స్వత్వాలు విపులంగా చర్చింపబడిన నాటకం రాళ్ళూ - రత్నాలు. ప్రదర్శిస్తే రక్తికట్టుతుంది.

భారతదేశ స్వాతంత్ర్యం, బ్లాక్‌డెవలప్‌మెంటు ఆఫీసు కార్యక్రమాలు, చైనా దురాక్రమణ, ప్రజల బాధ్యత. వీటిని గూర్చి వ్రాసిన నాటిక. నేనూ – నా దేశం ప్రదర్శనానుకూల రచన

పైరెండు నాటక, నాటికల రచయిత శ్రీ పోకల నరసింహారావు రచనలో, జీవితంలో అనుభవం గడించిన ఆదర్శవాది. ఈ రచనలు పల్లెల్లో పురోభివృద్ధికి, బ్లాక్ డెవలప్‌మెంటు కార్యక్రమ ప్రచారానికి నట సమాజాలు ప్రదర్శింపదగ్గవి.

## పరీక్ష : తెరవెనుక

(నాటికలు)

రచన: శ్రీ నూకల నారాయణ రావు, బి. ఏ. వెల: రూ. 1-50. ప్రతులకు: ప్రసాద్ పబ్లికేషన్స్, ఏలూరు.

ఈ పుస్తకంలో రెండు నాటికలున్నాయి. 'పరీక్ష'– ఒక యువతిని పెళ్ళాడటానికి అర్హు డెవరో పరీక్షించటం. 'తెరవెనుక'– ఒక నాటక కంపెనీ ఏరకంగా వుందో, దానిలో నటించేవాళ్ళు ఎలాంటి మనుష్యులో తెలిపే నాటిక రెండు నాటికలలో సు హాస్యం ప్రధానంగా వుంది. 'పరీక్ష' లో హాస్యం సంభాషణగతంగా వుంటే, 'తెరవెనుక' లో సంఘటన గతంగా వుంది. అంతేకాదు, రెండోనాటికలో బాధలోంచి హాస్యం జనించి నవ్వింపి కళ్ళనీళ్ళు తెప్పిస్తుంది. ఈ స్థాయి ఉత్తమమయింది రెండు నాటికలు ప్రదర్శనకు అనుకూలంగా వున్నాయి. బలమున్న ఇతివృత్తం తీసుకొని, తెలుగు వాతావరణంలో హాస్యం పోషిస్తూ రచనలు చేస్తే మంచి నాటికలు రావచ్చు

## బ్రహ్మనాయుడు

(నాటిక)

రచన. శ్రీ కాంతశ్రీ, వెల: 1-00 ప్రతులకు: ప్రసాద్ పబ్లికేషన్స్, ఏలూరు.

పల్నాటి భారతంలో ధర్మరాజువంటి బ్రహ్మనాయడు నాయకుడుగా శ్రమపడిన వీరరసాత్మక నాటిక. ప్రదర్శనానుకూలత వుంది. నటుడూ, దర్శకుడూ అయిన శ్రీ కాంతశ్రీ నాటికను ఏమాత్రం మార్చుకో నక్కరలేకుండా ప్రదర్శించుకో దగినట్లుగా వ్రాసినట్లుంది. తెలుగు తప్పులుకూడా దిద్దు

కొంచెం నాటిక బాగుంటుంది. చైనా దురాక్రమణ దృష్ట్యా వీరరసనాటిక కనుక ప్రదర్శించుకోవచ్చు.

## విద్రోహం
### (నాటకం)

[రచన: శ్రీ బి. గోపయ్య, వెల: రు 2-00, ప్రతులకు: శ్రీబి. రాఘవయ్య, రాఘవవిలాస్, రామగిరి, నల్లగొండ.]

'విద్రోహం' చైనా దురాక్రమణ గాథ. ప్రచారం ప్రధానోద్దేశం. ఇందులో దృశ్యాలు, యుద్ధం జరిగిన తావు, భారత సైనికుల శిబిరంలో ప్రదర్శింపబడే నాటకంలో చైనా చూపించే దుష్ట స్వభావం, శివుడు కైలాసంలో నందికేశ్వరుడితో చైనా ప్రసక్తి, నారద ప్రవేశం — ప్రజలలో చైతన్యం - చైనా ఓటమి - చైనా ప్రధాని, నియంతలకు యావజ్జీవ కారాగార శిక్ష- చూపింపబడ్డాయి.

భూత భవిష్య ద్వర్తమానాల్లో నాటకం జరుగుతుంది. అనేక స్థలాలు రంగస్థలం మీద చూపించాలి. కాలంలో మార్పు. సాంఘికంలో పౌరాణికం, భారతీయులు, చైనీయులు, దేవతలు, పాత్రలు, పాటలు పద్యాలు విరివిగా వున్నాయి. పాత్రలు ఇరవై ఏడు ! ప్రదర్శన కష్టమే ! ఒక గంట కాలక్షేపానికి చదువుకోవచ్చు.

## భక్త రమణీమణులు

[అనువాదం: శ్రీ వల్లభనేని కాశీ విశ్వనాథం, వెల: 0-75 న. పై. ప్రతులకు: ప్రజాప్రచురణలు, ఏలూరు]

ఇందులో మాయాదేవి, సుజాత, గౌతమి, యశోధర, నంద, బ్రహ్మదత్త, మొందోపదాయికల జీవిత చరిత్రలు క్లుప్తంగా వున్నాయి. అందరి జీవితాలు బుద్ధునికీ, బౌద్ధ ధర్మాలకు అంకితం కావటం అంతర్లీనంగా వుంది. ఇది దేనికి అనువాదమో తెలియదు. చదవదగిన పుస్తకం.

—'కొకలలూరి'

## శ్రీ పార్థసారథీయము

[గ్రంథకర్త- శ్రీ శిష్టా పార్థసారథి వెల - రూ॥ 2-00. ప్రాప్తిస్థానము - 1-1-316/4, బాపూనగర్, చిక్కడపల్లి-హైదరాబాదు.]

శ్రీ శిష్టా పార్థసారధిగారు భగవద్గీత, ఆంధ్రానువాదమునకు స్వనామధేయమును జతపరచి భగవద్గీతను, భగవంతుడు పార్థసారధిగా నుండి ప్రవచించెను కావున "పార్థసారధీయము" అని పేరు పెట్టెను. భగవద్గీతకు ఎన్నియో ఆంధ్రానువాదములు కలవు. ఈ కవిగారు మరలదానిని తెలుగు చేయుట, కవితా వ్యాసమునందుండి భగవత్కీర్తన చేయుటయే. "పలికెద, వేరొండు గాథ పలుకగనేలా" యన్నట్లు వీరు ఉద్యోగమును చాలించి, విశ్రాంతి గొను సమయములో నిష్కామకర్మ సిద్ధాంతమును ప్రతిపాదించు భగవద్గీతను వ్రాసి, అందు తొలిపలుకులలో, తన భక్తి భావమును ప్రకటించుటకై ఈ రచనను సాధించితినని చెప్పిరి. భగవద్గీత యందలి వైశిష్ట్యము తెలియనివా రుండరు. దానిని గురించి మరల చెప్పుట చర్విత చర్వణము. మహాభారతేతిహాసము కృష్ణద్వైపాయనునిచే రచింపబడినది. అందు "సనత్సుజాతీయము" "విష్ణు సహస్ర నామము" "భగవద్గీత" ఈ మూడును తత్త్వజ్ఞానమును కలిగించి మానవులను తరింప చేయుటకై భారతమునందు చొప్పింపబడినవి. ప్రస్థానత్రయములో భగవద్గీత యొకటి. ఇందువల్ల జ్ఞాన యోగము, కర్మ యోగము, భక్తి యోగములు మూడింటి వల్లను ముక్తి కలుగునని చెప్పబడినది.

పార్థసారధిగారి ఆంధ్రానువాదము సంస్కృత భగవద్గీతను చదివి అర్థము చేసికొనలేనివారికి మిక్కిలి ఉపయోగకరముగా నున్నది. వీరు ఈ గ్రంథమును ముఖ్యముగా భగద్గీతను చదువవలె ననుకొను స్త్రీల కొరకై వ్రాసితి ననియు, శ్లోకము అర్థము కాకుండా, ఊరకే చదివినంత మాత్రమున తత్ఫలస్థితి కలుగునని తాము భావించమనియు వ్రాసిరి. భగవద్గీత చదువునప్పుడు శబ్దగౌరవముకన్న భావగౌరవమే ఎక్కువగా కనపడును. సంస్కృత భగవద్గీత అతి సులభమగు శైలిలో వ్రాయబడినది. అందలి తాత్త్విక విషయములే అతి గహనములు. కావున ఈ కవిగారు భావానువాదము చేయుచు సులభ గ్రాహ్యముగా చేయుటకు ప్రయత్నించి అందు కొంత వరకు కృతకృత్యు లయినారు.

"పార్థసారధి పసిడి పల్కులు" అని వారు గ్రంథము వెనుక వ్రాసిన పద్యములు భగవద్గీతలో అతి ప్రధానము లగు ఉపదేశములు. భగవద్గీత కంతకును ప్రాణభూతము, అతి ప్రధానము నగు అధ్యాయము సాంఖ్యయోగము. ఇందుకృష్ణు డర్జునునకు మొట్టమొదట ఆత్మ స్వరూపమును నిరూపించి, కర్మయోగమును, కర్మయోగి యగు స్థితప్రజ్ఞుని గూర్చి ఉపదేశించును. ఈ అధ్యాయము నాంధ్రీకరించుచు చాల వరకు అన్నిశ్లోకముల అర్థములను ఈ కవిగారు పొందుపరచినారు.

"శరణనుము నన్ను మాత్రమె, సర్వధర్మ
ములు పరిత్యజించుచునైన, మోక్ష మిత్తు
సర్వపాప విముక్తుగా జలిపి, దిగులు
నొందబోకుమ, నీ మదియందు బార్థ"

అను పద్యములో 'సర్వ ధర్మా న్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ' అను శ్లోకము ఎంత లలితముగా అనువదింప బడినది। ఇది ఈ కవిగారి అనువాద శైలికి ఉదాహరణము.

మొత్తముమీద ఈ గ్రంథము అనువాద గ్రంథ మయ్యు స్వంతరచనగా నున్నదనుట తధ్యము.

## శ్రీ నవ్యాంధ్ర రఘువంశము-

[పద్యకావ్యము - ప్రథమభాగము గ్రంథకర్త — శ్రీ శిష్టా పార్థసారథి. వెల — రు. 2—00 ప్రాప్తి స్థానము శిష్టా పార్థసారథి, 1-1-316/4 బాపూనగర్, చిక్కడపల్లి - హైదరాబాదు.]

మహాకవి కాళిదాసు "రఘుకారుడు"గా కీర్తింపబడినవాడు. "అభిజ్ఞానశాకుంతలము" యొక్క కీర్తి ఖండాంతరములందు వ్యాపించినప్పటికిని, వాల్మీకి కవితారీతుల నవగాహన మొనరించుకొని ఇతిహాసిక రీతిలో రచించిన రఘు వంశమునందే కాళిదాసు యొక్క పరిణత మేధస్సు వ్యక్తమగుచున్నదని భారతీయ విద్వాంసుల అభిప్రాయము. ఈ రఘువంశారంభములో కాళిదాసు తనను తాను మందునిగా, దుష్కరకార్యము సాధించుటకు సాహసించినవానివిగా చెప్పుకొని తన నిరాడంబరతను వ్యక్తము చేయుచు, తాను వాల్మీకి వంటి పూర్వకవులచే నిర్మింప బడిన కవితా మార్గమునందు పయనింతునని చెప్పి అందు కృతకృత్యు డయ్యెను. ఇట్లు రఘువంశము సంస్కృత మహా కావ్యములలో నాయక మణియై వెలయుచున్నది. ఇందు భాష ఎంత సులభమైనదో అంత మధురమైనది. భావము లంత గంభీరములై ఇతరులకు అనుకరించుటకు కష్టసాధ్యము లైనవి.

ఈ రఘువంశ మహాకావ్యము, రఘుకుల తిలకుడైన రాముని వంశమందలిరాజుల చరిత్రలను తెలియజేయునది. దిలీపుని కథతో ఆరంభమై దిలీపుడు, రఘువు, అజుడు, దశరథుడు, రాముడు, అతని తరువాత పరిపాలించిన రాజులను వర్ణించి, చివరకు ఈ వంశమునందు పుట్టిన దుష్ప్రవర్తకులైన రాజులవలన ఈ వంశ మెట్లు నశించెనో తెలుపుచు, ప్రపంచమునం దెట్టి వంశస్థులైన, ఆరంభదశయం దెట్టి మహోన్నత దశయం దుండినను చివరకు నాశము తప్ప దను పరమ సత్యమును చాటుచు ఈ కావ్యము ముగియును.

ఈ రఘువంశ మహాకావ్యమును రెండు భాగములుగా శ్రీ శిష్టా పార్థసారథిగారు సులభశైలిలో తెనిగించి, కాళిదాసుయొక్క అతి మధుర భావామృతమును ఆంధ్రుల కందజేయ ప్రయత్నించినారు. కవిగారు ఆరంభములోనే తన తప్పులను పరిహరించి ఒప్పులను మాత్రమే పాఠకులను గ్రహింప వేడుచు, కాళిదాసుయొక్క భావములను మాత్రమే అనువదింపక, ఆతని సౌమ్యతను గూడ తనలో చూపించుకొనినారు. రఘువంశము ననువదించుటలో ఈ ప్రథమ భాగమునందు, కాళిదాసు తొలిపలుకులను యథాతథముగా ననువదించుట, దిలీపుడు నందినీ ధేనువును పూజించి తద్వర ప్రసాదమున పుత్రుని గాంచుట, రఘుమహారాజు ఔన్నత్యము, ఇందుమతీ స్వయంవరము, అజవిలాపములవంటి అతి సుందరములైన ఘట్టములనే విశదముగా వ్రాసి మూల గ్రంథములలో తప్పక చదువదగిన భాగములివి యని సూచించినారు.

రఘుమహారాజు జననమువలన దిలీపుడు పొందిన ఆనందమును వర్ణించుచు వీరు వ్రాసిన ఈ క్రింది పద్యము పరిశీలింప దగినది. "పున్నమనాటి చంద్రునకు బొంగు పయోధివిమాడ్కి, రాజపు

త్రున్నవ పద్మ పత్రవిభ
రోచి , పరీత విశాల నేత్రునిన్
గన్నుల గర్వు దీర గుతు
కంబున గాంచి యరిష్ట శయ్యపై
గ్రన్నన బొంగె నంత గురు
రాబనిచెన్ శుభకార్య చర్యకై"

పద్యము రమణీయముగా నున్నది. కాళిదాసు కృతు లన్నింటిలోనూ, భార్యాభర్తల ప్రేమ పుత్రోత్పత్తి కలుగుట వలననే పరిపూర్ణత నొందునని అతని భావముగా స్పష్టమగుచున్నది. "విక్రమోర్వశీయ' 'అభిజ్ఞాన శకుంతల' నాటకములలో నాయకులు అపత్యము గలిగియుండుటను, పెక్కువిధముల ప్రంశంశించెను దుష్యంతుడు 'ధన్యాస్తదంగరజ సామలినీభవంతి' అని కుమార సంభవ మహాకావ్యములో కుమారస్వామి జననమే ఉమా శంకరుల సమాగమమునకు ప్రయోజనము అని వర్ణింపబడినది.

ఇందుమతీ స్వయంవరం సందర్భమున అజమహారాజు కీర్తిని వర్ణించుచు,

"శారద నీరదేందు ఘన
సార తుషార మరాళ మల్లికా
హార తుషార ఫేన రజ
తాచల కాశ ఫణీశ కుంద మం
దారం సుధాపయోధి సిత
తామర సామర వాహినుల్ శుభా
కారు రఘూరు కీర్తి కెన
గాదగ వెన్న మరీచి సంపదన్"

అనుపద్యమునందు రఘుమహారాజు కీర్తికి వాడిన విశేషము లన్నియును యథాతథముగా బమ్మెరపోతన భాగవతమునందలి శారదాస్తుతిలోనివి.

మొత్తముమీద ఈ ఆంధ్రీకృత రఘువంశము, ఆంధ్రుల కెల్లరకు సులభ గ్రాహ్యముగా నుండి, ఉదాత్త మగు వస్తువు కలది కావున మిశ్రసమాసముల వంటి వ్యాకరణదోషములను త్రోసిరా జనదగును.

—కె. కమల

## భార్గవ రామాయణము

[గ్రంథకర్త. అనంతపంతుల రామలింగస్వామి, వెల - అయిదు రూపాయలు, ప్రాప్తిస్థానము :— అనంతపంతుల రామలింగస్వామి,

పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా, ఆంధ్రప్రదేశ్.]

గ్రంథకర్తలు భార్గవరామునియందపరిమిత భక్తి ప్రపత్తులు కలిగి యీ గ్రంథమును గ్రథించినారు. వారి గోత్రమునకు సంబంధించిన ఋషులలోనొకరు జామదగ్న్యలగుటగూడ నిందుకు హేతువై యుండవచ్చును.

భార్గవరాముని యవతారచరిత్ర ఖండఖండములుగా నాయా పురాణములయందు గోచరించునేగాని, సంపూర్ణముగా నొకచోఁ జదువుకొని పాఠకులానందించుటకు వీలుగాలేకున్నదని యీ గ్రంథకర్తలు సమస్త పురాణములను బరిశోధించి యీ భార్గవరామాయణమును లిఖించినారు.

ఇందు అవతారకాండము, అభ్యుదయకాండము, సుదర్శనకాండము, యాత్రాకాండము, యాగకాండము, ఆశ్రమకాండము నను పేర్లతో నాఱుకాండములు శ్రీమద్రామాయణము నందువలెఁ జెప్పఁబడినవి.

ఈ యిరువదవ శతాబ్దిలో నూతనముగా వెలసిన యత్యుత్తమమైన ప్రబంధరాజ మిది నన్నయ మొదలు తిరుపతి వెంకటేశ్వరుల వఱకును గల కవిశిరోమణుల సారస్వత సముద్రములను మథించియెత్తిన ప్రబంధామృతమని యీ ప్రబంధమునుగూర్చి ముచ్చటించుటలో నతిశయోక్తిలేదు ఇందులకీ క్రింది యుదాహరణములు నిదర్శనములు కాఁగలవు

“అటఁ జని కాంచె రాముఁడు హి
మాగము, నంబరచుంబి శృంగరా
ట్పటుల హాఠాల్లురఝ్ఝుర ని
పాత నితాంత నిరంతరస్వన
త్కటక చరత్కరి ప్రకర
గండ గళన్మద మండితాళి వి
స్ఫుట జటిలాభ్ర విభ్రమ వి
ముగ్ధ కలాపి విలాస లాస్యమున్.”

“శిల సింహాసనమై, నగంబు గొడుగై,
చిక్రోడముల్ భృత్యులై
యిలకోళ్ళిందున మంద వందిగణమై-
యీరమ్మొ యాస్థానమై
పలుగాకుల్ ప్రజలై, నినుం గొలువ ని
ర్వాణైక సామ్రాజ్య మం
డల మేలం బరతెంచినావొ యిటు ఱేఁ
డా! హైహయప్రాన్వయా!”

“మనమా మ్రగ్గును, మాట తేట చెడు, దు
ర్మార్గ స్థితుల్ గల్గు, లో
ననుమానింతురు మిత్రు, లామయము డా
యన్వచ్చు, మైవన్నెయున్
జను, నాయుష్యమునం దసహ్యమగు, స్వే
చ్ఛావృత్తి చల్లారు, ని
ర్ధనుఁడొక్కండగు వేళ, దుర్భరము కా
దా సీదరం బీధరన్”

ఈ గ్రంథమునఁ గవితాధారకు లోటు లేదు ‘నాత్యంతం సంస్కృతేనైవ, నాత్యంతం దేశభాషయా’ అన్నట్లు ఉభయ భాషలకును సమప్రాధాన్య మీ గ్రంథమున నీయఁబడినది ఇందుకు రెం డుదాహరణలు

“డక్క, డమరువు, దమ్మట, డంబురాలు
తుడుము, గిడిగిడి, గుమ్మెద, దుడుకు, బింబ
కాలె, వీరణములు, రుంజ, డోలు, డప్పు
నరగ, చుయ్యంకి, కిరిదుల నాదు లులిసె.”

“అభ్రంకషప్రోన్న తానేక శిఖర వి
ఖ్యాతాతిభీకరాహార్యపరము
చందన మందార చండాత పారిజా
తామ్ర రంభానోకహాశ్రయంబు
విద్యుల్లతా సదృగ్విస్ఫారలతికాను
షంగ మనోజ్ఞ కుడుంగ యుతము
ధారాళ జీవనాధార ధారాల స
జ్జలపాత సంఘాత సంయుతంబు
ననుపమే తుణికాళి నాట్యాంచితంబు
నపర మేరుమహీధరాఖ్యాన్వితంబు
నద్భుతము, నిర్జరావాస, మనుపమమ్ముఁ
బర్వతవరంబు గోమంత పర్వతమ్ము”

ఇది కేవల మలంకార ప్రబంధమును గాదు, కేవల వర్ణనాత్మకమునుగాదు. కేవలముఁ గథా కథన మాత్రగ్రథితమునుగాదు. అన్ని గుణములు యుక్తియుక్తముగా ‘అతి సర్వత్ర వర్జయేత్’ అను నీతి ననుసరించి కూర్పఁబడినది. పూర్తిగా శ్లేషాదులకుఁ బ్రాధాన్యమునిచ్చు జటిల ప్రబంధధోరణి యిందుఁగానరాదు. పూర్తిగాఁ జేలవమైన పదజాలముతో నడిపిన భాగమును నిందులేదు.

ఇంకను బ్రఁజ్ఞా ప్రదర్శనమునకై కాక రసపోషణమున కనుకూలముగా ననేక వృత్తాది భేదము లిం దుపయోగింపఁబడినవి. ద్విపదయు, దండకముఁగూడ విషయ ప్రాముఖ్యమునుబట్టి కూర్పఁబడినవి. ఇందలి శివ విష్ణుస్తవములు చాల నపూర్వములు.

ఇందలి ప్రయోగవైచిత్రి మిక్కిలి చిత్రమైనది. ఇంకను ‘అగ్గిపై గుగ్గిలంబు’ ‘కంచియచేనుమేయు’ మొదలైన నానుడులకును దక్కువలెదు. వేయేల? ఈ ప్రతిభాసంపన్నమైన మహాకావ్యమె నేటి యాంధ్రభాషాయోషామణి గడుసుందనమునకు జక్కని నిదర్శనము. పాఠకు లీ గ్రంథమును పఠించి యనేక విధములైన సారస్వత లాభముల నందెదరుగాక. ★

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

మే 23 : శ్రీ వెంకటేశ్వరయూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్‌గా డా॥ వి. సి. వామనరావు నియమింపబడ్డారు.

మే 24 : సహకార శాఖ మంత్రిగా శ్రీ తోటరామస్వామి పదవీ స్వీకారం చేశారు

ఆంధ్రప్రదేశ్ మంత్రి వర్గంలోని పదవుల పునర్వ్యవస్థీకరణ ప్రకటన వెలువడింది.

జూన్ 4 : జవహర్లాల్ చితాభస్మం కలకలశాన్ని ఢిల్లీ నుండి ముఖ్య మంత్రి తీసుకొచ్చారు.

జూన్ 6 : ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కళాశాల తొలి వైస్ ఛాన్సలర్‌గా శ్రీ ఓ. పుల్లారెడ్డి నియమింపబడ్డారు.

జూన్ 19 : అన్ని రాష్ట్రాల సహకార మంత్రుల అఖిల భారత సమావేశాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు.

జూన్ 23 : ఆంధ్రప్రదేశ్ అప్రమత్తత సంఘం అప్రమత్తత కమీషనరుగా శ్రీ ఎమ్. శేషాచలపతి నియమింపబడ్డారు.

జూన్ 25 : రాష్ట్ర శాసనసభ సంయుక్త సమావేశంలో గవర్నరు ప్రసంగించారు.

జూన్ 27 : శాసనసభ కాంగ్రెసు పార్టీ నాయకుడుగా శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

జూన్ 28 : నగర కార్పొరేషను ఎన్నికలు జరిగాయి.

హైద్రాబాదులో డా॥ ఎన్. ఎమ్. జయసూర్య పరమపదించారు

## భారత దేశంలో

మే 27. శ్రీ జవహర్లాల్ నెహ్రూ స్వర్గస్థులయ్యారు. శ్రీ గుల్జారీలాల్ నందా భారత ప్రధాన మంత్రిగా పదవీ స్వీకారం చేశారు. పార్లమెంటు ప్రత్యేక సమావేశం ప్రారంభమయ్యింది.

జూన్ 2 : కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ నాయకుడుగా శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

జూన్ 5 : లోకసభ నిరవధికంగా వాయిదా పడింది.

జూన్ 9 : శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి నాయకత్వం క్రింద కేంద్ర మంత్రి వర్గం పదవీ స్వీకారం చేసింది

జూన్ 12 : కొత్త ఢిల్లీలో ఏర్పాటయిన ఒకానొక ప్రత్యేక కార్యక్రమంలో నెహ్రూ ప్రత్యేక తపాళా బిళ్ళను ప్రధాన మంత్రి విడుదల చేశారు.

జూన్ 17 : రక్షణ సిబ్బంది కరువుభత్యం రేట్లు గత ఫిబ్రవరి 1వ తేదీ నుండి సవరించబడినట్లు ప్రకటించబడింది.

జూన్ 21 : దాస్ కమీషన్ నివేదిక విడుదల చేయబడింది. డా॥ గోపీచంద్ భార్గవ పంజాబు రాష్ట్ర ఆపద్ధర్మ ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేశారు

జూన్ 24 : కొత్త ఢిల్లీలో మూడు రోజులపాటు జరిగే ముఖ్యమంత్రుల సమావేశాన్ని ప్రధాన మంత్రి ప్రారంభించారు.

అల్జీరియా, మొరాకో, టూనీషియాలలో మూడు వారాలపాటు సుహృద్భావ పర్యటన జరిపే నిమిత్తం ఉపరాష్ట్రపతి కొత్తఢిల్లీ నుంచి బయలుదేరారు

## విదేశాలలో

జూన్ 10 : దక్షిణాఫ్రికాలోని జాతి విచక్షణపై భద్రతా సంఘం చర్చ ప్రారంభించింది.

జూన్ 11 : శ్రీమతి సిరిమావో నాయకత్వాన పదిహేను మంది గల మిశ్రమ మంత్రి మండలి కొలంబోలో పదవీ స్వీకారం చేసింది.

జూన్ 12 : తూర్పు జర్మనీ సరిహద్దును ఖాయపరుస్తూ రష్యా తూర్పు జర్మనీలు ఒక ఒప్పందంపై సంతకాలు చేశాయి

జూన్ 17 : అంతర్జాతీయ కార్మిక సంస్థ 48వ సమావేశం జెనీవాలో ప్రారంభమయ్యింది.

జూన్ 19 : అమెరికా సెనేటు పౌర హక్కుల బిల్లును ఆమోదించింది

జూన్ 21. సైప్రస్‌లోని ఐక్యరాజ్య సమితి సేనలకు కమేండరుగా శ్రీ కె యస్. తిమ్మయ్య నియమింపబడ్డారు.

Edited & Published by the Director of Information and Public Relations, Andhra Pradesh, Hyderabad-1.
Printed at YUVA PRESS, Public Garden Road, Hyderabad.